# ఆర్ష విజ్ఞాన కరదీపిక

(వేద ఉపనిషత్ ఇతిహాస పురాణ సంగ్రహం)

రచన

శ్రీ శృంగేరి శారదాపీఠ పౌరాణికులు

**బాచంపల్లి సంతోషకుమార శాస్త్రి**

ప్రచురణ

**సహజ పబ్లికేషన్స్**

S-7, 2-2-1149/1

తిరుమల ఎన్‌క్లేవ్, న్యూ నల్లకుంట

హైదరాబాద్ - 500 044

# ఆర్ష విజ్ఞాన కరదీపిక
(వేద ఉపనిషత్ ఇతిహాస పురాణ సంగ్రహం)


రచన

శ్రీ శృంగేరి శారదాపీఠ పౌరాణికులు

**బాచంపల్లి సంతోషకుమార శాస్త్రి**



**ఆగస్టు 2006**

**వెల: రూ.35/-**

ముఖచిత్రం

**బాలి**

కవర్, బుక్ డిజైన్

**సూరి**

ప్రింటింగ్

**సాయితిరుమల ప్రింటర్స్**

**1-8-556/2, చిక్కడపల్లి, హైదరాబాద్-20.**

**ఫోన్: 66100227.**

ప్రచురణ

**సహజ పబ్లికేషన్స్**

**S-7, 2-2-1149/1**

**తిరుమల ఎన్‌క్లేవ్, న్యూ నల్లకుంట**

**హైదరాబాద్ - 500 044.**

**ఫోన్: 040-27561705**


**(శ్రీమతి బుద్ధవరపు లలితకుమారి దేవి, శ్రీ బుద్ధవరపు సాంబసదాశివరావు దివ్యస్మృతికి ఈ అక్షరమాల)**

# ఇది స్వగతం...

ఈ పుస్తక ప్రచురణకు కొంత పూర్వరంగం ఉంది. రెండున్నర దశాబ్దాలకు పైగా పాత్రికేయవృత్తిలో కొనసాగుతూ సాగిస్తున్న జీవనపోరాటంలో వెనక్కి తిరిగి చూసుకుంటే పెద్దగా సాధించింది ఏమీ లేదనిపించేది, నలుగురు మంచిమిత్రుల సాంగత్యం తప్ప. పోనీ ఇప్పటికైనా ఏదైనా సత్కార్యం చేస్తేనో అన్న ఆలోచన రావడమే తడవుగా, ఆ మంచిపని ఏదో అమ్మా, నాన్న పేరిట చేద్దామనిపించింది.

అమ్మ పెంపకం, నాన్న పోషణలో అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ల మధ్య ఆడుతూ, పాడుతూ ఎదిగిన నాకు స్వయంశక్తిపై అపారనమ్మకం ఏర్పడి పాత్రికేయవృత్తిలో ఆత్మవిశ్వాసంతో మెలగడానికి, ఎంచుకున్న వృత్తిలో ఒక స్థాయికి చేరుకోవడానికి కారణం నా తల్లిదండ్రులు శ్రీమతి బుద్ధవరపు లలితాకుమారిదేవి, శ్రీ బుద్ధవరపు సాంబసదాశివరావుల దీవెనలే! శ్రీ బుద్ధవరపు వెంకటసుబ్బారావు, శ్రీమతి బుద్ధవరపు మహాలక్ష్మి దంపతుల (స్వగ్రామం - తూర్పు గోదావరి జిల్లా ఆలమూరు) ద్వితీయ సంతానమైన మా నాన్నగారు శ్రీ బుద్ధవరపు సాంబసదాశివరావుగారు సెంట్రల్ ఎక్సైజ్ సూపరింటెండెంట్‌గా రిటైరయ్యారు. శ్రీ ఆదిరాజు వీరభద్రరావు, శ్రీమతి ఆదిరాజు ధర్మవతి దంపతుల (స్వగ్రామం - కృష్ణా జిల్లా వెల్లంకి) ప్రథమ సంతానం మా తల్లిగారు.

కాకతాళీయంగానే పాత్రికేయవృత్తిని జీవనభృతికోసం ఎంచుకున్న నాకు... చిన్నప్పుడు ఆసక్తికొద్దీ పదుగురి మెప్పు పొందడానికి పాల్గొన్న అంతరకళాశాలలస్థాయి వక్తృత్వపోటీలు, వేషం కట్టిన నాటకాలు, అప్పట్లో అందరితో కలివిడిగా కలసిపోవడానికి, ఎన్నో ప్రశంసాపూర్వక బహుమతులు తెచ్చిపెట్టడానికే కాక తరువాత పాత్రికేయవృత్తిలో రిపోర్టర్‌గా స్థిరపడడానికి ఎంతగానో ఉపయోగపడ్డాయి. డిగ్రీలో ఉండగా కళాశాల(ల) మ్యాగజైన్‌లలో సంపాదకవర్గ సభ్యుడిగా పనిచేసినప్పటి కలం పాత్రికేయవృత్తికి పునాదిగా భావిస్తే, అప్పట్లోనే విజయవాడ ఆకాశవాణిలో యువజన కార్యక్రమాలలో చురుగ్గా పాల్గొన్న అనుభవం హైదరాబాద్ ఆకాశవాణిలో ప్రాంతీయవార్తలు చదవడానికి ధైర్యాన్ని ఇచ్చింది.

ఏదో ఉద్యోగం చూసుకుందామని హైదరాబాద్ వచ్చిన నాకు నా అదృష్టంకొద్దీ శ్రీ భండారు శ్రీనివాసరావుగారు, వారి సతీమణి శ్రీమతి నిర్మలగారు అండగా నిలిచి ఇచ్చిన ధైర్యం ఎలా మర్చిపోగలను? శ్రీ భండారు శ్రీనివాసరావుగారు నాకు పాత్రికేయవృత్తి మార్గం చూపించి నన్నో దారిలో పెట్టారు.

నా వృత్తినైపుణ్యానికి సానపట్టడమే కాకుండా, అడుగడుగునా వెన్నుతట్టి నిలిచిన మిత్రుడు స్వర్గీయ శ్రీ శ్రీకాంత్ విఠల్ సాంగత్యంవల్ల నిబద్ధతతో మెలగడం సాధ్యమైంది. అదృష్టవశాత్తూ మీడియాలో దాదాపు అన్ని ఉపరంగాలలో, అనుబంధ రంగాలలో పనిచేసే అవకాశం లభించింది. 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్' గ్రూప్‌లో అప్రెంటిస్ రిపోర్టర్‌గా అడుగుపెట్టి 'ఆంధ్రప్రభ' దినపత్రిక చీఫ్ ఆఫ్ న్యూస్ బ్యూరో స్థాయికి చేరుకోవడం ఒక సుదీర్ఘ ప్రస్థానమైతే, వివిధ అవకాశాల కారణంగా అటు ఎలక్ట్రానిక్ మీడియా, ఇటు వెబ్ మీడియాలో అడుగు పెట్టడానికి వీలు చిక్కింది. మరోవైపు మీడియా అనుబంధరంగమైన పబ్లిక్ రిలేషన్స్ విభాగంలో సైతం అవకాశం లభించడంతో రాష్ట్రప్రభుత్వ అవినీతి నిరోధక బ్యూరో (ACB) లో పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసర్ (PRO)గా ఇటీవల మూడేళ్లపాటు ప్రభుత్వ కొలువు చేశాను. చిత్రమేమంటే హిందీ ప్రధానంగా బహుభాషా జాతీయ న్యూస్ ఏజన్సీ - సమాచార భారతి - రిపోర్టర్‌గా పాత్రికేయవృత్తిలో అడుగుపెట్టిన నాకు బహుభాషా పత్రికలలో పనిచేసే అవకాశం లభించింది. మొదట్లో ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లో రిపోర్టర్‌గా స్థిరపడదామనుకున్నా, తరువాత 'ఆంధ్రప్రభ'కి మారి తెలుగు రిపోర్టింగ్‌లో పట్టు సాధించడానికి 'ఆంధ్రపత్రిక', 'ఉదయం' దినపత్రికలలో పనిచేయడం అందివచ్చింది. తరువాత 'ఆంధ్రప్రభ'లో అత్యున్నతస్థాయికి ఎదిగిన నాకు ఇటీవల 'ఇతెమాద్' ఉర్దూ దినపత్రికలో చీఫ్ రిపోర్టర్‌గా స్వల్పకాలం పనిచేసే అవకాశం లభించింది.

పాత్రికేయవృత్తిలో ప్రవేశించిన తొలిరోజుల్లోనే సొంతంగా కాలమ్స్ రాయడంపై కలిగిన మక్కువ అప్పట్లో 'ఆంధ్రభూమి' దినపత్రిక ఎడిట్ పేజీలో 'బుద్ధ' పేరిట 'గాసిప్ క్లబ్' కాలమ్ రాయడానికి ఉత్సాహాన్నిచ్చింది. తరువాత 'ఆంధ్రప్రభ' దినపత్రిక ఆదివారం అనుబంధంలో 'బిఎస్ఆర్'గా 'ఈ వారం నేరం' కాలమ్ రాసిన ధైర్యం అనంతరం, 'ఉదయం' దినపత్రికలో పనిచేసిన కాలంలో 'చార్మినార్ చౌరస్తా' పేరిట వ్యంగ్యవ్యాఖ్యల కాలమ్ రాయడానికి ఎంతగానో ఉపయోగపడింది. ఈ కాలమ్స్ రాసే ఆసక్తి

'ఆంధ్రప్రభ'లో విశాఖలో పనిచేస్తున్నప్పుడు 'జగదాంబ జంక్షన్' కాలమ్, ఆ పిమ్మట విజయవాడలో ఇండియన్ ఎక్స్‌ప్రెస్/ఆంధ్రప్రభ బ్యూరో ఇన్‌ఛార్జిగా ఉండగా 'ఆంధ్రప్రభ'లో వారం వారం 'జామ్‌లెన్స్' కాలమ్ రాయడానికి, హైదరాబాద్ తిరిగి వచ్చాక 'ఆంధ్రప్రభ'లో 'పెన్‌టార్చ్' కాలమ్‌కి ఉత్సాహంగా కంట్రిబ్యూట్ చేయడానికి ఉపయోగపడింది. ప్రస్తుతం 'విశాలాంధ్ర' దినపత్రికలో ప్రతి గురువారం 'ఇదో లోకం' పేరిట వ్యంగ్య వ్యాఖ్యలతో కూడిన కాలమ్ రాస్తూండడానికి కూడా అదే ప్రేరణ.

ఫ్రీలాన్స్ జర్నలిస్ట్‌గా అనువాదాలు చేసినా, వాణిజ్య వ్యాపార ప్రకటనలు తీర్చిదిద్దినా, అప్పుడెప్పుడో జెమిని టీవీలో వారం వారం ప్రసారమైన 'జర్నలిస్ట్ డైరీ' కార్యక్రమానికి వాయిస్ ఓవర్ ఇచ్చినా, ఇప్పుడు హైదరాబాద్ దూరదర్శన్ తెలుగు న్యూస్ బులెటిన్స్ తయారీలో పాలుపంచుకుంటున్నా - అంతా ఒడిదుడుకులు లేకుండా సాగడానికే. వీటన్నిటికి - సీనియర్ పాత్రికేయుడు స్వర్గీయ జి. కృష్ణగారు చెప్పిన - 'రాసుకుని బతికేసేవాళ్లం మనం' అన్న సూత్రం మూలం. ఇంచక్కా రాసుకుని బతికేస్తున్నాను.

ఇలా రాసుకుంటూ బతుకుతున్న బతుక్కి ఓ అర్థం ఉండాలనీ, తల్లితండ్రుల స్మృత్యర్థం ఏదైనా సత్కార్యం చేయాలన్న తలంపుతోనే మీడియాలో ఇప్పటివరకు నేను అడుగుపెట్టని, ఏకైక మిగిలిన రంగం - పబ్లికేషన్‌లో ప్రవేశానికి సాహసించాను. తల్లితండ్రుల దివ్యస్మృతికి ఒక మంచి పుస్తకాన్ని ప్రచురించాలని చేసిన ఆలోచనను మొదట పంచుకున్నది సహజంగానే నా భార్య శ్రీదేవి, కుమారుడు చిరంజీవి రాహుల్‌తో. ఊహించిన విధంగానే వారిద్దరు ఇచ్చిన ప్రోత్సాహంతో కొంత ప్రయాస అనిపించినప్పటికీ 'సహజ పబ్లికేషన్స్' అందిస్తున్న ఈ **ఆర్ష విజ్ఞాన కరదీపిక**.

ఆర్ష విజ్ఞాన సర్వస్వానికి అక్షరరూపం ఇవ్వాలన్న నా ఆలోచనకు వెంటనే ప్రోత్సాహం అందించడమే కాకుండా ఎప్పటికప్పుడు సలహాలు ఇచ్చిన సీనియర్ పాత్రికేయులు శ్రీ కల్లూరి భాస్కరంగారు ఈ 'కరదీపిక'కు పేరు పెట్టి, భాషాపరంగా రచనకు పరిపుష్టి కలిగించే విధంగా వాక్యాలను సరిదిద్ది ప్రూఫులు దిద్ది అడుగడుగునా సహకరించారు. అంతేకాకుండా పరిచయవ్యాఖ్యలు రాసిన శ్రీ కల్లూరి భాస్కరంగారికి సర్వదా కృతజ్ఞుడిని.

నా ఆలోచనలు, భావాలకు అనుగుణంగా ఈ 'ఆర్ష విజ్ఞాన కరదీపిక'కు అక్షరరూపం ఇచ్చిన శ్రీ శృంగేరి శారదాపీఠ పరిశోధకులు శ్రీ బాచంపల్లి సంతోష్‌కుమార శాస్త్రిగారికి అభినందనపూర్వక ధన్యవాదాలు.

సత్కార్యాలకు సదా అండగా నిలిచే 'వైస్రాయ్' హోటల్స్ సిఎండి, రాజ్యసభ మాజీ సభ్యులు శ్రీ పి. ప్రభాకరరెడ్డిగారు నా ప్రయత్నానికి కొండంత అండగా నిలవడం నా అదృష్టం. శ్రీ ప్రభాకరరెడ్డిగారు మా కుటుంబ శ్రేయోభిలాషులు కావడం నాకు ఏలోటు ఉండదన్న ధైర్యాన్ని ఇస్తూంటుంది. శ్రీ ప్రభాకరరెడ్డిగారికి మనస్ఫూర్తిగా కృతజ్ఞతాంజలి.

'సహజ పబ్లికేషన్స్' ప్రచురణలో సహకరించి - వేదపరిరక్షణ గావించిన మహావిష్ణువును మత్స్యావతారంలో అత్యంత అద్భుతంగా ఆవిష్కరింపజేసిన (కవర్ పేజీలో) ఆర్టిస్ట్ మిత్రుడు శ్రీ బాలిగారికి, కవర్ డిజైన్‌తో పాటు పుస్తకాన్ని ఎంతో ఆకర్షణీయంగా తీర్చిదిద్దిన స్నేహపాత్రుడు ఆర్టిస్ట్ సూరిగారికి ధన్యవాదాలు. ఈ 'కరదీపిక'కు అసలైన అలంకారం చేసి, ముస్తాబు చేసిన 'మేడమ్' శ్రీమతి ప్రభగారి సహకారం మరువలేనిది.

ఆర్థికవ్యవహారాల పట్ల అంతగా అవగాహన లేని నాకు, మా పబ్లికేషన్స్‌కు బ్యాంకింగ్ సంబంధిత గైడెన్స్ అందిస్తున్న బాల్యస్నేహితుడు శ్రీ గరికిపాటి వెంకటరమణ (ఆంధ్రాబ్యాంకు)కు థాంక్స్ చెప్పుకోవడం ఎలా మర్చిపోగలను?

పుస్తక ప్రచురణ విషయం చెప్పిన వెంటనే వెన్నుతట్టి ప్రోత్సహించడమే కాకుండా 'శుభాశీస్సులు' అందజేసిన మా రజనిమామయ్య ('కళాప్రపూర్ణ' డాక్టర్ బాలాంత్రపు రజనీకాంతరావుగారు)కు వినమ్రపాదాభివందనం-

మా తల్లితండ్రుల దివ్యస్మృతిగా ప్రచురించిన వేద ఉపనిషత్ ఇతిహాస పురాణ సంగ్రహం తెలుగువారింట **ఆర్షవిజ్ఞాన కరదీపిక** కాగలదని విశ్వసిస్తున్నాం.

**బుద్ధవరపు శివరామకృష్ణ**
ప్రకాశకులు



'కళాప్రపూర్ణ'
డా॥ బాలాంత్రపు రజనీకాంతరావు

# శుభాశీస్సు

**చి॥** బుద్ధవరపు శివరామకృష్ణ తన తల్లిదండ్రుల పేర పురాణేతిహాస విషయాలలో సామాన్య పాఠకులైన గృహస్థులకు శ్రద్ధాభక్తులూ గౌరవాదరాలూ కలిగించే విధంగా ఒక ధార్మికోపదేశాత్మకమైన చేతిపుస్తకాన్ని (హ్యాండ్ బుక్) తయారుచేయిస్తున్నాననీ, దానికి నా ఆశీస్సులు ఇవ్వాలని అడుగుతూ నాలో అపూర్వమైన ఆనందోత్సాహాలను రేకెత్తించినందుకు హృదయపూర్వకంగా సంతోషిస్తూ ఇందుమూలంగా నా శుభాశీస్సుల్ని తెలియజేసుకుంటున్నాను.

హైదరాబాదు (బాలాంత్రపు రజనీకాంతరావు)



**పి. ప్రభాకరరెడ్డి**
రాజ్యసభ మాజీ సభ్యులు
చైర్మన్-మేనేజింగ్ డైరెక్టర్,
వైస్‌రాయ్ హోటల్స్
హైదరాబాద్.

## సత్కార్యాలు భగవత్ సంకల్పమే!

సత్కార్యాలు చేయాలనుకోవడం భగవత్ సంకల్పమే. అసలు అటువంటి ఆలోచన కలిగినపుడు ఆ సత్కార్యం భగవంతుడి కృపతో సజావుగా పూర్తవుతుంది.

ప్రతివారికి, ప్రతి ఒక్కరికి సాయపడడం సాధ్యం కాకపోవచ్చు. అలాగే అడిగిన ప్రతి ఒక్కరికి సహాయం చేయడం వీలుకాకపోవచ్చు. మరీ ముఖ్యంగా ప్రస్తుత యాంత్రికయుగంలో, ఎవరి హడావుడిలో వారుండి, తోటివారి గురించి ఆలోచించే తీరిక చేసుకోవడం లేదు. అందువల్లనే ఎవరికైనా సాయపడాలంటే కూడ భగవత్ సంకల్పం అవసరమేమో!

రెండున్నర దశాబ్దాలుగా పాత్రికేయవృత్తిలో ఉన్న బి.ఎస్. రామకృష్ణ ఒక మంచిపని కోసం తలపెట్టిన ఈ పుస్తకం అందరికి ఉపయోగపడాలని ఆశిస్తున్నాను. శ్రీరామాయణం, మహాభారతం, భాగవతం, పురాణాలు, వేదాలు, ఉపనిషత్తుల గురించి సమగ్ర గ్రంథాలు ఎన్నో ఉన్నాయి. అయితే వాటిలో సారాన్ని ఏర్చి, కూర్చి ఒక చిన్న పుస్తకంగా తీసుకురావాలన్న ఈ ప్రయత్నం వెనుక అంతర్లీనంగా ఓ సత్కార్యం ఉందని తెలిసి ఎంతో సంతోషించాను.

ఈ సత్కార్యాన్ని భుజాన వేసుకున్న బి.ఎస్. రామకృష్ణ, వారి కుటుంబసభ్యులకు సదా శ్రీ వేంకటేశ్వరస్వామి దీవెనలు ఉంటాయని అభిలషిస్తూ...

హైదరాబాదు

(పి. ప్రభాకరరెడ్డి)

# రచయిత పరిచయం



| | |
|---|---|
| పేరు | బాచంపల్లి సంతోషకుమార శాస్త్రి |
| తండ్రిపేరు | నరహరిగారు |
| పుట్టిన తేది | 11-02-1976 |
| పుట్టిన ప్రదేశం | ధర్మపురి, కరీంనగర్ జిల్లా |
| విద్యార్హతలు | బి.ఎ. (తెలుగు సాహిత్యం), ఎం.ఎ. (సంస్కృతం) ఉస్మానియా విశ్వవిద్యాలయం ఎం.ఎ. (తెలుగు) కాకతీయ విశ్వవిద్యాలయం, (పిహెచ్.డి) ఉస్మానియా విశ్వవిద్యాలయం (ప్రస్తుతం తెలుగు విభాగంలో కొనసాగుతున్నది), ఎం.ఎ. (తెలుగు)లో మూడు స్వర్ణపతకములు. యూనివర్సిటి ఆర్ట్స్ విభాగంలో ప్రథమ ర్యాంకు, కంప్యూటర్ విద్యలో ప్రవేశం |
| ప్రత్యేక విద్య సంప్రదాయ విద్య | వేదము (కృష్ణయజుర్వేదములో కొంతభాగము), ధర్మపురిలో అధ్యయనం; 'పౌరాణిక సార్వభౌమ' శ్రీ మల్లాది చన్ద్రశేఖరశాస్త్రివద్ద శ్రీశారదాపీఠం, శృంగేరివారి పాఠశాలలో 'పురాణశాస్త్ర' అధ్యయనం, 'సంస్కృత, రామాయణ, భారత, భాగవత, అష్టాదశ పురాణా'లలో విశేష శిక్షణ, ఆగమశాస్త్రంలో ప్రవేశం. |
| తెలిసిన భాషలు | తెలుగు, సంస్కృతం, హిందీ, ఆంగ్లం |
| ప్రత్యేకతలు | అతిచిన్నతనంలోనే శ్రీశృంగేరి శారదాపీఠంలో ఆస్థానపౌరాణికుడిగా శ్రీశ్రీశ్రీ భారతీతీర్థస్వామివారిచే నియామకం; ధర్మపురి, శ్రీలక్ష్మీనృసింహస్వామి దేవస్థాన గౌరవ ఆస్థాన పండితుడిగా స్వచ్ఛందసేవ; ఇప్పటివరకు కొన్నివేల ప్రవచనములు చేసిన అనుభవం. |
| పొందిన బిరుదులు | 1997లో శ్రీ శృంగేరి శారదాపీఠాధీశ్వరులు శ్రీశ్రీశ్రీ భారతీ తీర్థస్వామివారిచే 'పౌరాణిక ప్రవర'గా పట్టా పొందడం; 2000లో 'అఖిలబ్రాహ్మణ సేవాసంఘం'వారిచే 'పురాణ వాచస్పతి' బిరుదు ప్రదానం, 2001లో మెట్టుపల్లిలో 'పౌరాణికరత్న' బిరుదు ప్రదానం. |
| ధర్మప్రచారార్థం ప్రవచనములు చేసిన ముఖ్య ప్రదేశములు | శృంగేరి, హైదరాబాద్, విజయవాడ, అనంతపురం, కరీంనగర్, గుంటూరు, చండీఘర్, ముంబాయి, అమృతసర్, బెంగుళూరు వంటి అనేక ప్రదేశాలలో పురాణప్రవచనాలు, సుందరకాండపై 30 జ్ఞాన యజ్ఞములు, అనేక భాగవత సప్తాహములు, అష్టాదశ పురాణములపై ప్రవచనములు. |
| ప్రత్యేకత | ప్రాచీన సంప్రదాయపద్ధతిలో శ్రీ భాగవత సప్తాహములు చేయడం, వివాహ వ్యాఖ్యానములు. |
| మీడియా అనుభవం | దూరదర్శన్‌లో ప్రవచనములు, సంవత్సరకాలంగా ఈటీవీలో నృసింహవైభవంపై ప్రవచనం, జెమిని టీవీలో వివిధ సందర్భాలలో ప్రవచనములు, తేజ న్యూస్ ఛానల్లో తిరుప్పావై ప్రవచనములు. |
| రచనావ్యాసంగం | శంకరకృప, ఋషిపీఠం, ఆంధ్రభూమి మొ॥ పత్రికలలో ధార్మికవ్యాసములు, దర్శనమ్ పత్రికకు సంపాదకీయ బాధ్యతలు. |
| లక్ష్యం | సనాతన ధర్మపు, మన సంస్కృతి గొప్పదనం, మన పురాణ ఇతిహాసములకు ఆధునికతను జోడించి, సామాన్యులకు సైతం అర్థమయ్యే సులభశైలిలో ప్రవచనములు చెప్పి, అందరిలో, ముఖ్యముగా యువతలో ఆధ్యాత్మికచైతన్యం కలిగించడం. |
| చిరునామా | బాచంపల్లి సంతోషకుమారశాస్త్రి ప్లాట్ నెం. 101, గరుడాద్రి ఎన్‌క్లేవ్, 12-1-508/10, లక్ష్మీనగర్, లాలాపేట్, సికింద్రాబాద్-17. ఫోన్: 94405 30663, 040-5596 2624. |

# ప్రస్తావన

**ఋ**షీశ్వరుల సంస్కృతితో జ్ఞానమందు ప్రకాశిస్తున్న భారతీయుల దేశం మనది. 'భా' అనగా జ్ఞానం, దానియందు రతులు అనగా ఇష్టులు భారతీయులు. స్వామి వివేకానందులవారు ఒకసారి ఇతరదేశంలో సంచరిస్తుంటే, వివేకానందుని చూసి ఆ దేశస్థులు 'భారతీయ సన్యాసి' అని కించపరుస్తూ 'మీ దేశంలో సన్యాసులు తప్ప ఇంకెవరుంటారు, మీకంటూ చెప్పుకోవడానికి విలువైన ఆస్తులు ఏం ఉన్నాయి" అని అనగా స్వామి వివేకానంద మా దేశంలో "ఎవరూ కూడ దోచుకోలేని రామాయణ, భారత, భాగవత ఇతిహాస పురాణాలున్నాయి, అవే మా విలువైన ఆస్తి" అని సమాధానం చెప్పారట. ఈ అనంతమైన సృష్టిలోని ప్రతి అణువును ప్రశ్నించి, పరిశోధించి, మనిషిలోని నిద్రాణమైన అనంత అమోఘశక్తిని జాగృతం చేసి, తద్వారా లభించిన అతీంద్రియశక్తితో శాశ్వతసత్యాలను దర్శించినవాడే 'ఋషి' అని అంటారు. అట్టి ఋషుల నుంచి వచ్చినవే రామాయణ, భారత, భాగవత, ఇతిహాస పురాణాలు. ఋషులకు మూలం వేదం. వేదాన్ని సాక్షాత్కరింప చేసుకున్నవారు ఋషులు మాత్రమే. అందుకనే దుర్గాచార్యులవారు **"సాక్షాత్కృతధర్మిణః ఋషయో బభూవుః"** అని ధర్మాన్ని సాక్షాత్కరింపచేసుకున్నవారు కనుక ఋషులు అన్నారు. అట్టి వేదసంస్కృతే ఈనాటివరకు భారతీయులకు మూలమని చెప్పవచ్చు. వేదోపబృంహణమే ఆర్షగ్రంథాల ప్రయోజనం.

ఆర్షగ్రంథాలను ఎందుకు చదవాలి, వాటివల్ల ప్రయోజనం ఏమిటని నేడు చాలామంది ప్రశ్నిస్తుంటారు. రామాయణం చదవడం ద్వారా పుట్టుక ఎలా ఉండాలో, జీవనం ఎలా ఉండాలో తెలుస్తుంది. మహాభారతం ఎలా ధర్మబద్ధంగా జీవించాలో, యుక్తాయుక్త విచక్షణాజ్ఞానాన్ని ఎలా పొందాలో వివరించింది. మహాభాగవతం మానవుడు ఎలా ముక్తి పొందగలడో బోధిస్తుంది. పురాణాలు అనంతసత్యచరిత్రను, మహనీయులను చూపి, వారిని ఎలా అనుసరించాలో వివరించాయి.

ఆర్షగ్రంథాలను చదివించడమే ఈ చిన్న పుస్తకం ప్రయోజనమని సవినయంగా మనవి చేస్తున్నాను. సనాతన సంప్రదాయం, విలువలు, మన ఆర్షసాహిత్యవిజ్ఞానం ముఖ్యంగా నేటి యువతకు అందించి, వారందరిచేత ప్రాచీన ఆర్షగ్రంథాలను చదివించి, తద్వారా పొందే జ్ఞానంతో సంఘపరిరక్షణ చేయించాలనే తాపత్రయమే ఈ పుస్తకరచనకు ప్రేరణ. వేదం, రామాయణం, భారత, భాగవతాలపై ఒక సమగ్ర అవగాహనను ఈ పుస్తకం కలిగిస్తుంది. నేటి కాలంలో చాలామందికి భారత, భాగవతాలకు తేడా తెలియడం లేదు. అది చెప్పడమే మా లక్ష్యం.

పత్రికారంగంలో సుపరిచితులైన శ్రీ బి.ఎస్.రామకృష్ణగారు ఈ పుస్తకరచనకు ప్రేరేపించి, సమస్త బాధ్యతలు తీసుకున్నారు. వారి మనస్సులో ఉన్న భావాన్ని గ్రహించి, తదనుగుణంగా నేను ఈ పుస్తకం రచించడం జరిగింది. సంస్కృతీ అభిమానులకు, జిజ్ఞాసువులకు ఆర్షగ్రంథాలలోని యథార్థవిషయాలు చెప్పాలని మా ప్రయత్నం. సద్గురువుల కటాక్షం, మా గురుదేవులు మల్లాది చన్ద్రశేఖరశాస్త్రిగారి పురాణ శిక్షణవల్ల ఈ గ్రంథం వ్రాయగలిగాను. భ్రమ, ప్రమాదాలవల్ల ఏవైనా దోషాలు దొర్లినట్లయితే, సహృదయులు నా దృష్టికి తీసుకవస్తే కృతజ్ఞతాభివందనాలతో సవరించుకొంటానని మనవి.

– రచయిత

# ఇవి ప్రాచీన విజ్ఞానసర్వస్వాలు



కల్లూరి భాస్కరం

**మ**న ప్రాచీన మహర్షులు తాము మథించిన విజ్ఞానాన్ని, తమ అనుభవాలను, అనుభూతులను, ఆదర్శాలను, మానవజీవితానికి సంబంధించిన అన్ని అంశాలను ఒకచోట రాశి పోయగా అవతరించినవే మన వేదాలు, ఉపనిషత్తులు, రామాయణ మహాభారత ఇతిహాసాలు, భాగవతాది పురాణాలు. పాశ్చాత్యులను కూడా ముగ్ధుల్ని చేసిన మన జాతి మూలధనం ఇవి. మనజాతి నిర్మించినవే అయినా ఇవి కేవలం మనకే పరిమితమయ్యేవి కావు. సార్వజనీనమైన, సార్వకాలికమైన అంశాలు వీటిలో ఉన్నాయి.

ప్రకృతివర్ణనలు, మానవ అనుభూతి చిత్రణతో కూడిన కవిత్వం, ధర్మాధర్మనిర్ణయం, ఆధ్యాత్మికవిజ్ఞానం, ఖగోళ, జ్యోతిష, గణిత, భౌతిక, రసాయనికశాస్త్ర విజ్ఞానంతో సహా మానవజీవితానికి, విశ్వసృష్టికీ సంబంధించిన అన్ని విచారణలూ ఒకేచోట కనిపించే ఈ ఆర్షగ్రంథాలను 'ప్రాచీనవిజ్ఞానసర్వస్వాలు' అనవచ్చు. వీటిని విశ్వసించేవారేకాక, విశ్వసించనివారు సైతం తెలుసుకోవలసిన అమూల్యవిజ్ఞానం వీటిలో ఉంది.

దురదృష్టవశాత్తు మన ఆర్షగ్రంథాలు కేవలం ఆధ్యాత్మిక సంబంధమైనవనీ, మతసంబంధమైనవనే ఒక అపోహ చాలామందిలో ఉంది. అది వాస్తవం కాదు. వాటిని చదవకపోవడంవల్ల, చదివినా ఒక పూర్వనిర్ధారిత అభిప్రాయంతో (Pre-conceived Notion) చదవడంవల్ల కలిగే అపోహ ఇది. ఎంతో నిర్మమ (objective) దృష్టినుంచి అధ్యయనం చేసినప్పుడు కానీ వీటి లోతు తెలియదు.

ఇటువంటి ఆర్షవిజ్ఞానసారాంశాన్ని, అందులో నిక్షిప్తమైన ముఖ్యమైన వైజ్ఞానికవిశేషాలను ఈ చిన్నపుస్తకంలో రచయిత బాచంపల్లి సంతోషకుమారశాస్త్రిగారు వీలైనంత సమగ్రంగా అందించడానికి చేసిన ప్రయత్నం అభినందనీయం. ఆర్షసారస్వత సారాంశాన్ని సంగ్రహంగానే అయినా బహుకోణాలనుంచి విపులీకరించడంలో రచయిత కృతకృత్యులయ్యారనే చెప్పవచ్చు. మన ఆర్షసాహిత్య సంపూర్ణ వివరణ ఎంత విస్తృతిగలిగిన గ్రంథాలలోనైనా సాధ్యమా? చెప్పలేం. పాఠకులలో వాటిపట్ల జిజ్ఞాస కలిగించడానికి, మౌలికంగా వాటిలో ఏముంది, వాటిని ఏ కోణంనుంచి చదవాలన్నది గ్రహించడానికి ఈ పుస్తకం ఎంతగానో తోడ్పడుతుంది.

మిత్రులు బి.ఎస్. రామకృష్ణగారు తమ జననీజనకుల పవిత్రస్మృతికి అంకితంగా ఈ గ్రంథం వెలువరించడం మరింత హృద్యమైన అంశం. తల్లిదండ్రుల దివ్యస్మృతికి ఇంతకంటె పవిత్రమైన నీరాజనం మరొకటి ఉండదు. ఆయన సంకల్పశుద్ధి గొప్పది కనుకనే ఈ గ్రంథం ఇంత ఉత్తమంగా రూపుదాల్చింది.

ఆయనకూ, రచయితకూ హృదయపూర్వక అభినందనాలు.

కల్లూరి భాస్కరం

# అనుక్రమణిక



# వేదాలు - వేదాంగాలు

భారతీయ సంస్కృతికి మూలం వేదాలు. ప్రతి మతానికి ప్రధానంగా ప్రధానమైన గ్రంథం అంటూ ఒకటి ఉంటుంది. ప్రతి ధర్మానికి ఒక స్థాపకుడు అంటూ ఉంటాడు. ప్రపంచంలో ప్రతి సంస్కృతిలో ఇది కనిపిస్తుంది. అయితే భారతీయులకు ప్రత్యేకమైన గ్రంథం అంటూ ఒకటి లేదు. కొందరికి రామాయణం మూలం అయితే మరికొందరికి భగవద్గీత మూలం. కారణం ఏమిటంటే భారతీయ హైందవులకు ప్రాథమికమైన ధార్మిక విద్యాబోధన అంటూ ఏం లేదు. ఆ కారణంచేత సనాతన గ్రంథాలను విమర్శించటం అధికమైంది. కనుక బాల్యంలోనే ముఖ్యమైన గ్రంథాల గురించి బోధన ఉన్నట్లయితే పవిత్ర గ్రంథాలను సందేహించి ఉండేవారు కాదు. అయితే భారతీయ సంస్కృతిలో అన్నింటికి ఆధారం వేదాలే అని చెప్పవచ్చు.

**'అంగాని వేదాశ్చత్వారో మీమాంస న్యాయవిస్తరః**
**పురాణం ధర్మశాస్త్రంచ విద్యాహేతశ్చతుర్దశ'**

అంటే 14 విద్యల గురించి శాస్త్రాలు వర్ణించాయి. నాలుగు వేదాలు, ఆరు వేదాంగాలు (ఋక్, యజు, సామ, అధర్వ, శిక్షా, వ్యాకరణ, ఛందో, నిరుక్త, జ్యోతిష, కల్పములు) మీమాంస అంటే వేదాలకు వ్యాఖ్య. తర్క పురాణ, ధర్మశాస్త్రాలు మొత్తం 14 విద్యా స్థానాలు. వేదాలను ఈ ఆరు అంగాలతో నాలుగు ఉపాంగాలతో కలసి అధ్యయనం చేయాలి. వేదాలు 'అనాది'. అంటే కాలపరిమితిలో ప్రారంభం అంటూ లేనివి. అంటే ఇవి ఎప్పుడూ ఉంటూనే ఉన్నాయి. వేదాలను 'అపౌరుషేయాలు' అంటారు. అపౌరుషేయం అనగా పురుష ప్రమేయం లేకుండా వచ్చినవని అర్థం. పౌరుషేయం అంటే మానవకల్పితమని అర్థం. మన సంప్రదాయంలో ఋషులను 'మంత్రద్రష్టలు' అంటారు. అనగా మంత్రాలను దర్శించటం అని అర్థం. కొలంబస్ అమెరికాను కనుగొన్నాడు అనే మాటకు అతడు అమెరికాను సృష్టించాడని అర్థం కాదు. ఉన్న అమెరికానే లోకం దృష్టికి తీసుకువచ్చాడు. అలాగే సంస్థితమైన మంత్రాలనే ఋషులు దర్శించి లోకానికి అందించారు.

**'యుగాంతే అంతర్హితాన్ వేదాన్ సేతిహాసాన్ మహర్షయః**

**లేభిరే తపసా పూర్వం అనుజ్ఞాత స్వయంభువా'** అని స్మృతి వచనం. యుగాంతంలో అంతర్హితాలైన వేదాలను మహర్షులు బ్రహ్మచేత అనుజ్ఞాతులై తపోమహిమతో తిరిగి పొందారు.



పరమేశ్వరుని ఉచ్ఛ్వాస, నిశ్వాస రూపంలో వేదాలు అవతరించినట్లుగా బృహదారణ్యకోపనిషత్తులో ఉంది. నిశ్వాసితం అంటే ఊపిరి విడవటం అని అర్థం. అంటే 'వేదాలు పరమాత్ముని ఊపిరే అన్నమాట'. ఆద్యంతాలు లేని పరమాత్ముడు నిత్యుడు అయినట్టే అయితే ఆయన ఊపిరి అయిన వేదాలు కూడ అటువంటివే.

**'అస్యమహతో భూతస్యనిశ్వసితా మేవైతద్య దృగ్వేదోయజుర్ వేద...'** అని శ్రుతి బోధిస్తోంది.

## వేదనిర్వచనం

'సత్తాయ విద్యతే జ్ఞానే వేత్తి వింతే విచారణే విందతే విదంతి ప్రాప్తే వేదమ్' అంటే పరమేశ్వరుడని అర్థం. వేదయతి ఇతివా వేదః. భగవంతుడి గురించి చెప్పేది వేదం అని అర్థం. ప్రత్యక్ష అనుమానాది ప్రమాణాలచేత తెలియబడని, అలౌకికమైన లౌకికమైన శ్రేయస్సుకు కూడ సాధనభూతమైన రూపమైన అలౌకిక ఉపాయాన్ని చెప్పేది వేదం.

వేదాలు అనంతాలు. 'అనంతావై వేదాః'. వేదాలు విస్తృతమైనట్టివి. వేదాలు అనంతమని చెప్పడానికి ఒక కథ ఉంది. భరద్వాజమహర్షి మూడుజన్మలలో వేదాలను అధ్యయనం చేశాడు. పరమేశ్వరుడు ప్రత్యక్షమై నీకు ఇంకొక జన్మనిస్తాను, ఏం చేస్తావు అని అడిగితే దానిని కూడ వేదాధ్యయనానికి వినియోగిస్తాను అని భరద్వాజుడు చెప్పాడు. అప్పుడు భగవంతుడు అన్ని వేదాలను అనంతమైన జన్మలలో కూడా అధ్యయనం చేయటం అసాధ్యం అని చెప్పడానికి మూడు పెద్ద పర్వతాలను సృష్టించి, వాటినుండి గుప్పెడు మట్టి తీసుకొని 'ఓ భరద్వాజ! నువ్వు ఈ మూడు జన్మలలో అధ్యయనం చేసినది ఈ పిడికెడు మట్టితో సమానం. నీవు ఇంకా అధ్యయనం చేయవలసింది ఆ మూడు పర్వతాలతో సమానం' అని అన్నట్లు వేదాలలో ఖాఠకభాగంలో ఉంది. కనుక వేదాలు అనంతమైనవి అని ఈ కథద్వారా తెలుస్తోంది. అనంతంగా ఉన్న వేదాలను కృష్ణద్వైపాయనుడు నాలుగు భాగాలుగా విభజించి వేదవ్యాసుడనే సార్థకనామధేయాన్ని ధరించాడు.

## ఋగ్వేదం

ఋగ్వేదం అంతా పద్యరూపమే. వీటిని ఋక్‌లు అనే పేరుతో పిలిచేవారు. 'అగ్నిమీళే పురోహితం' అన్న సూక్తంతో ప్రారంభమై దానితోనే ఆఖరవుతుంది. ఋక్ అంటే ఒక్కొక్క మంత్రం అని అర్థం. కొన్ని ఋక్‌ల సమూహాన్ని సూక్తం అని అంటారు. ఈ ఋక్సంహితలో పదివేల నూట డెబ్బై ఋక్‌లు ఉన్నాయి. ఋగ్‌వేదంలో ఒక వేయి ఇరవై ఎనిమిది సూక్తాలున్నాయి. సకల దేవతాస్తోత్రాలు కలిగి ఉండడం ఋగ్వేదం విశిష్టత అని చెప్పవచ్చు. వ్యాసుడు ఈ ఋగ్వేదాన్ని 'పైలుడు' అనే శిష్యునికి ఉపదేశించాడు. ఋగ్వేదానికి ఉపవేదంగా ఆయుర్వేదాన్ని చెబుతారు. ఆత్రేయ గోత్రోద్భవంగా దీనిని వర్ణిస్తారు. ఈ వేదానికి దేవత 'బ్రహ్మ'. గాయత్రీ ఛందస్సులో వర్ణితమయింది.

ఈ ఋగ్వేదంలో చర్చ, శ్రావకం, చర్చకం, శ్రవణీయ పాఠం, క్రమపాఠం, జటా, రథక్రమం, దండక్రమం అను 8 భేదాలున్నాయి. వీటిని పారాయణం చేయటం

ద్వారా పాపాలను తొలగించుకోవచ్చు. దీనిలోనే ఆశ్వలాయని, సాంఖ్యాయని, శాకల, బాస్కల, మాండుకేయ అనే పంచశాఖలున్నాయి.

**యజుర్వేదం**

యజుస్ అన్న పదం 'యజ్' అను ధాతువునుంచి వచ్చింది. అంటే ఆరాధించుట, లేక పూజించుట అని అర్థం. యజ్ఞం అనే పదం ఈ ధాతువునుంచి వచ్చింది. ఋగ్వేదంలో స్తోత్రరూపంలో ఉన్న మంత్రాలకి యజ్ఞం చేయటానికి వీలైన రూపం కల్పించింది యజుర్వేదం. అనగా రకరకాల యజ్ఞాలను ఎలా చేయాలో యజుర్వేదం నిర్దేశిస్తోంది. యజుర్వేదంలో ప్రధానమైనవి రెండు శాఖలు. వాటిని కృష్ణయజుర్వేదం, శుక్ల యజుర్వేదం అంటారు. శుక్ల అంటే తెల్లనిది అని అర్థం. కృష్ణ అంటే నల్లనిది అని అర్థం. శుక్ల యజుర్వేదసంహితను వాజసనేయసంహిత అని కూడ పిలుస్తారు. యజుర్వేదాన్ని వ్యాసుడు వైశంపాయనుడు అనే శిష్యునికి ఉపదేశించాడు. యజుర్వేదానికి ఉపవేదం ధనుర్వేదం. భారద్వాజగోత్రోద్భవంగా దీనిని చెబుతారు. యజుర్వేదానికి అధిదేవత రుద్రుడు. త్రిష్టుప్పు ఛందస్సులో వర్ణితమయింది. వేదాలలో రెండవ వేదంగా దీనిని కీర్తిస్తారు. ఈ వేదంలో 86 భేదాలున్నట్లు తెలుస్తోంది. చరకాలు, ఆహ్వరకాలు, కఠాలు, ప్రాచ్యకఠాలు, కపిష్ఠాలు, శారాయణీయాలు, వారాయణీయాలు, వార్తాంతలేయాలు, శ్వేతతరాలు, మైత్రాయణీయాలు అని పది విశేషంగా చెబుతారు. అలాగే వాజసనేయంలో 18 భేదాలు కనబడుతున్నాయి. తైత్తిరీయంలో ఔఖ్యాలు, కాండికేయాలు అనే రెండు భేదాలు కనబడుతున్నాయి. వీటిలో కాండికేయాలు 5 విధాలుగా ప్రసిద్ధం. వాటిలో 'ఆపస్తంభీయశాఖ' విశేషం.

యజుర్వేదానికి మూలశాఖగా మంత్రరూపాలుగా ఉన్న వాటిని బ్రాహ్మణాలు అంటారు. బ్రాహ్మణాలు కర్మకాండను వర్ణించి, కర్మకాండలో విశేషంగా ఉపయోగపడతాయి. బ్రాహ్మణకాండలో అంతర్గతమయినదే 'ఆరణ్యకం'. జ్ఞానకాండను వర్ణించేవి ఉపనిషత్తులు. యజ్ఞాది కర్మలలో ఈ వేదం ప్రధానంగా ఉపయోగం.

**సామవేదం**

సామం అంటే మనస్సుకు శాంతినివ్వడం అని అర్థం. 'సామదాన భేద దండ ఉపాయాల'లో సామం అంటే శత్రువును ప్రేమతో లొంగదీసుకోవడం అని అర్థం. ఋగ్వేదంలోని ఋక్‌లకు సామవేదంలో సంగీతం కూర్చబడింది. ఋక్‌వేదంలోని మంత్రాలను ఉదాత్త అనుదాత్త స్వరాలతో పఠిస్తారు. కాని సామవేదాన్ని దీర్ఘస్వరాలతో మాత్రమే గానం చేస్తారు. భారతీయ సంగీతానికి సామవేదమే ఆధారం అని చెప్పచ్చు. యజ్ఞం చేసేటప్పుడు సామవేదంలో ఉన్న మంత్రాలను గానం చేస్తూ సకలదేవతలను తృప్తిపరచవచ్చు. సామాన్ని గానం చేసేవాడిని 'ఉద్గాత' అనే పేరుతో పిలుస్తారు. ఋగ్వేదంలోని మంత్రాలను అధ్యాత్మిక ఉన్నతికి భగవంతుని అనుగ్రహాన్ని పొందటానికి స్వరపరచబడినట్టుగా విద్వాంసులు చెబుతారు. వేదాలలో మూడవది అయిన సామ వేదానికి గాంధర్వవేదాన్ని ఉపవేదంగా చెబుతారు. విష్ణువు దేవత. జగతీఛందస్సులో కాశ్యపగోత్రోద్భవంగా వర్ణిస్తారు. సామవేదంలో ఏడు భేదాలున్నాయి. అవి:
1) ఆసురాయణీయాలు 2) వార్తాంతవేయాలు 3) వాసురాయణీయాలు 4) ప్రాంజలులు



వేదాలు
వేదాలు
గీతోపదేశం వేదాలు
ఇతిహాసాలు
పురాణాలు
ఉపనిషత్తు



5) ఋగ్విధానాలు 6) ప్రాచీనయోగ్యాలు 7) జ్ఞానయోగ్యాలు. ఈ వేదాలలో అంతర భేదాలన్నీ కలిపితే సహస్రాధిక భేదాలు కనిపిస్తాయి. వ్యాసుడు సామవేదాన్ని జైమినీమహర్షికి ఉపదేశించినట్లు పురాణకథనం. ఈ సామవేద వైశిష్ట్యాన్ని వ్యాసుడు వర్ణిస్తూ, 'ఈ వేదాన్ని పూర్తిగా తెలిసినవాడు ఒక్క నారాయణుడు మాత్రమే' అని వర్ణించడం వల్ల అది రహస్య, విస్తార వేదం అని తెలుస్తోంది.

**అధర్వణ వేదం**

అధర్వణుడు అంటే పురోహితుడు, ఆచార్యుడు అని అర్థం. అధర్వణుడు అనే పేరుతో ఒక ఋషి ఉండేవాడని, అతని వలన లోకానికి ఈ మంత్రాలు తెలిశాయని విద్వాంసులు అంటారు. ఆపదలు కలిగినపుడు శత్రువులను సంహరించడానికి ఉపయోగపడే మంత్రాలు ఈ వేదంలో ఉన్నాయి. ఇతరవేదాలలో పేర్కొనబడని దేవతలకు సంబంధించిన మంత్రాలు ఈ అధర్వణవేదంలో పేర్కొనబడడం విశేషం. అధర్వణవేదంలో ఈ చరాచరసృష్టికి సంబంధించిన మంత్రాలు అనేకం ఉన్నాయి. సృష్టి ఎంత అద్భుతమైనదో వర్ణించే 'పృథ్వీ'సూక్తం ఈ అధర్వణవేదంలోదే. యజ్ఞాల నిర్వహణను పర్యవేక్షించే 'బ్రహ్మ' ఈ వేదానికి ప్రతినిధి అని చెప్పవచ్చు. వేదాంతంలో కీలకమైన ముండక, ప్రశ్న, మాండుక్య ఉపనిషత్తులు ఈ వేదంలోనివే. ఈనాటి సమాజానికి కావలసిన అనేక వైజ్ఞానిక శాస్త్రవిశేషాలను ఈ వేదంలో దర్శించవచ్చు. ఒకప్పుడు అధ్వరణవేదం ఉత్తరభారతదేశంలో ఎక్కువ ప్రాచుర్యంలో ఉండేది. దక్షిణభారతంలో ఈ వేదానికి ప్రాచుర్యం తక్కువ. సుమంతుడు అనే మహర్షికి వ్యాసుడు ఈ వేదాన్ని ఉపదేశించాడు. దీనికి ధనుర్వేదమే ఉపవేదం. బైజాన గోత్రాలలో, ఇంద్రదేవతాకంగా, త్రిష్టుప్పు ఛందస్సులో ఈ వేదం వర్ణితమయింది. పైప్పలములు, దాంతములు, ప్రదాంతములు, స్తౌతములు, ఔతములు, బ్రహ్మదావలములు, శౌనకేయములు, దేవర్షులు, చరణవిద్యలు అనేవాటితో ఈ వేదం ప్రసిద్ధం. విద్యాకల్పం, నక్షత్రకల్పం, సంహితాకల్పం, శాంతికల్పం, విధివిధానకల్పం అనే ఐదు కల్పాలతో వ్యాసుడు భారతదేశంలో ఈ వేదాన్ని ప్రకాశింపచేశాడు.

**వేదవిజ్ఞానం**

వేదంలో అనంతమైన విజ్ఞానశాస్త్రాలు గోచరిస్తాయి. వేదంలో భౌతికశాస్త్రం (ఫిజిక్స్), రసాయనశాస్త్రం (కెమిస్ట్రీ), వృక్షశాస్త్రం (బోటనీ), జంతుశాస్త్రం (జువాలజీ), శిల్పవిజ్ఞానం (ఆర్కిటెక్చర్), వ్యవసాయశాస్త్రం (అగ్రికల్చర్ సైన్స్), గణితశాస్త్రం (మేథమేటిక్స్), జ్యోతిశ్శాస్త్రం (అస్ట్రానమీ), పర్యావరణశాస్త్రం (ఎకోలజీ), భూగర్భశాస్త్రం (జియాలజీ), మేఘాలకు సంబంధించిన వర్షశాస్త్రం (మెటిరియాలజీ) వంటి అనేక విషయాలు వేదాలలో దర్శనమిస్తాయి.

వేదంలో వైద్యానికి సంబంధించిన అనేకవిషయాలు చెప్పడం జరిగింది. బృహదారణ్యక ఉపనిషత్తులో ఒక ఔషధం స్థూలరూపంలో ఉన్నప్పుడు ఏ లక్షణాలను కలిగిస్తుందో అదే ఔషధం సూక్ష్మరూపంలో తీసుకుంటే ఆ లక్షణాలుగల రోగాన్ని తగ్గిస్తుందనే హోమియోపతి వైద్యమూలసూత్రాలను వర్ణించింది.

ఋగ్వేదంలో ఒకటో మండలంలోని అశ్వినసూక్తంలో వర్ణించిన అశ్వినీదేవతలు చేసిన చిత్ర విచిత్రమైన పనులు ఈనాటి ఆధునికవైద్యులు ఆచరించేవే. ఖేలుడు అనే రాజు భార్య విష్పల. యుద్ధంలో ఆమె కాళ్ళు తెగిపోయాయి. అగస్త్యుడు వచ్చి స్తుతించగా అశ్వినీదేవతలు ఆమెకు ఇనుప కాలు అతికిస్తారు. వర్తమానకాలంలో ఇటువంటివి మనకు తెలుసు. శిరస్సును నరికి దానిస్థానంలో అదే శిరస్సును సరిగ్గా అతికితే మనిషి జీవించినట్లు ఋగ్వేదంలో వర్ణించబడింది. ఇంద్రుడు దధీచికి ప్రవర్గ్య అనే విద్యను ఉపదేశించి, ఇది ఇతరులకు చెబితే నీ తలను నరికేస్తా అని బెదిరించాడు. ఆ తరువాత అశ్వినీదేవతలు దధీచి తల నరికి దానిని దాచి అతనికి గుఱ్ఱం తల అతికించారు. ఆ శిరస్సుతో దధీచి ప్రవర్గ్యకి చెందిన మంత్రశాస్త్రరహస్యాలను అశ్వినీదేవతలకు ఉపదేశించాడు. అప్పుడు ఇంద్రుడు వచ్చి దధీచి తల నరకగా అశ్వినీ దేవతలు అతని పూర్వశిరస్సును తిరిగి అతికించారు. ఇలా సూక్ష్మాతిసూక్ష్మమైన శస్త్రచికిత్సలను వేదంలో వివరించడం విశేషం. వైద్యశాస్త్రానికి సంబంధించిన కొన్ని రహస్యాలు కృష్ణయజుర్వేదంలో కనిపిస్తాయి.



సంతానహీనతకు కారణాలను సూచిస్తూ, మేతకు వెళ్ళే జీవులను అనుయంత్రణం చేసే సందర్భంలో 'ప్రజావతీ రణమీవా అయక్ష్మా మావస్తేన ఈషత' – 'ఓ గోవులారా మీరు ఎక్కువ సంతానం కలవారు, క్రిమిరోగాలు లేనివారుగా ఉండండి' అని ఉంది. దీనికి సాయనాచార్యులవారు భాష్యం రాస్తూ 'వంధ్యాత్వేన క్రిమిదోషేన రోగాంతరేచ నాస్తి ప్రజోత్పత్తిః' వంధ్యత్వం వల్ల క్రిమిదోషాలవల్ల సంతానం కలుగదు అని చెప్పాడు.

**వేదంలో గణితశాస్త్రం**

గణితం సమస్త శాస్త్రాలకు ఆధారం. గణనం చేయటం గణితం ప్రత్యేకత. వేదాలు గణితం అనే శబ్దానికి బదులుగా ఇతర పదాలతో నిర్వచించటం జరిగింది. ఋగ్‌వేదంలో వ్రాతం వ్రాతం, గణం గణం, యజుర్‌వేదంలో గణపతి, గణస్త్రీ, గణినం మొదలైన శబ్దాలతో నిర్వచించాడు.

సంఖ్యాసూచక శబ్దాలుగా ఏకా 1, దశ 10, శతం 100, సహస్రం 1000, అయుతం 10,000, నియుతం ఒక లక్ష, ప్రయుతం 10 లక్షలు, అర్బుదం ఒక కోటి, న్యర్బుదం 10 కోట్లు. ఈ విధమైన సంఖ్యా సూచకశబ్దాలను వేదం తెలియజేసింది.

**వేదాలలో ఎక్కాలు**

కృష్ణయజుర్వేదంలో అశ్వమేధ ప్రకరణంలో ఏడవ అష్టకంలో రెండవ ప్రవాటకంలో 11వ అనువాకం నుండి 10 అనువాకలలో సంఖ్యేయవాచక పదాలతో హోమమంత్రాలు ఉన్నాయి. వీటిలో విశిష్టపద్ధతిలో గణితశాస్త్రంలోని ఎక్కాలు కనబడుతాయి.

11వ అనువాకంలో 'ఏకస్మై స్వాహా, ద్వాభ్యాగ్ం స్వాహా, త్రిభ్య స్వాహా' అని వరుసగా 19 సంఖ్యేయాల వరకు చెప్పి 29, 39, 49, 59, 69, 79, 89, 99, 100 సర్వం అనే సంఖ్యేయాలు స్వాహాంతంగా పేర్కొనబడ్డాయి. హవనపద్ధతిలో బేసి అంకెల మంత్రాలతో ఆజ్యహోమాలు, సరి అంకెల మంత్రాలతో అన్న హోమాలు చేసే పద్ధతిలో వీటిని వర్ణించారు.

వేదంలో గణితశాస్త్రాన్ని గురించి దయానందులవారు పేర్కొన్నారు. 'వేదగణితం' అనే పేరుతో జగద్గురు శ్రీ భారతీకృష్ణతీర్థస్వామివారు రాశారు. అది ప్రస్తుతం లండన్ నగరంలో అధ్యాపనం చేయబడుతోంది. వేదంలోని ఎక్కాలలోని మూడవ నిలువు పంక్తి 20 సంఖ్య వచ్చేవరకు ఇవ్వగా వాడుకలో 20 పంక్తులు ఒక ఎక్కంగా గుర్తించారు. వేదంలో ఇరవైకి, వందకు నడుమ ఉన్న సంఖ్యలను క్లుప్తం చేశారు. కాని వాడుకలో 20 పంక్తులు ఎక్కంగా నియతం చేయడంవల్ల చిన్న ఎక్కాలలో 100 లోపు సంఖ్యలు, పెద్ద ఎక్కాలలో 100కు మించిన సంఖ్యలు కూడ వస్తాయి. ఉదా: 4వ ఎక్కం 80తో సమాప్తమయితే, 6వ ఎక్కం 120తో సమాప్తమవుతుంది. 5వ ఎక్కం మాత్రం వేదంలో, లోకంలో సమానంగా ఉంటుంది. ప్రాకృతంలో కూడా ఈ ఎక్కాల సంప్రదాయం ఉన్నట్లు తెలుస్తోంది. వేదాన్ని ఉపబృంహణం చేసిన శ్రీమద్రామాయణంలో సంఖ్యావాచకాలను 'అర్బుదం, శంఖం, మహాశంఖం, బృందం, మహాబృందం, పద్మం, మహాపద్మం, ఖర్వం, మహాఖర్వం, సముద్రం, ఓఘం, మహౌఘం అని వర్ణించడం విశేషం. సంఖ్యలలో 1కి ప్రక్క 60 సున్నాలు చేరితే అది మహౌఘం అవుతుందని రామాయణం చెబుతోంది.

వేదాలలో అంకెలకు కొన్ని ప్రత్యేకమైన సంకేతాలు ఉపయోగించినట్లు తెలుస్తోంది. వాటిని పరిశీలిద్దాం!

0 – శూన్యం, అంబరం, అనంతం
1 – చంద్రుడు, ఇందు, సోముడు, గోవు, తనూ
2 – యముడు, అశ్వినులు, నేత్రాలు, కర్ణాలు, చేతులు, యుగళం, అయనం
3 – రామ్, గుణ, త్రిగుణ, భువన, అగ్ని, త్రినేత్ర, లోకాలు, పురం
4 – వేదం, శ్రుతి, సాగరం, ఆశ్రమం, యుగం, దిశలు
5 – బాణం, శరం, ఇషు, భూతం, ప్రాణం, తత్త్వం, ఇంద్రియాలు
6 – రసం, రంగం, ఋతువు, దర్శనం, అరి, తర్కం, కారకం, షణ్ముకం
7 – నగం, అగం, పర్వతం, ఋషి, ముఖి, వారం, స్వరం, ఛందస్సు
8 – వసు, అహి, నాగం, గజం, సర్పం, సిద్ధుడు, అనుష్టుప్పు
9 – అంక, నంద, నిధ, గ్రహ, రంధ్ర, ఛిద్ర, ద్వార, దుర్గాలు
10 – దిశలు, దిశాః, అంగుళి, పంక్తి, కకుభం, రావణుడు, అవతారం,
11 – రుద్ర, సూర్య, హర, ఈశ, భవ, అక్షౌహిణి
12 – రవి, సూర్య, అర్క, మాస, రాశి, రావ్యయ, భాను, దివాకర
13 – విశ్వేదేవాః, విశ్వ, కామ, అతిజగతి
14 – మన, విద్యా, ఇంద్ర, శక్ర, లోకాలు
15 – తిథి, దిన, అహన
16 – నృప, భూప, భూపతి, అష్టి, కలా
17 – అత్యష్ఠి
18 – ధ్రుతి, పురాణ
19 – అతిధ్రుతి

20 – నఖ, కృతి
21 – ఉద్రుతి
22 – ఆకృతి
23 – వికృతి
24 – గాయత్రి, జిన, అర్హత
(25, 26 సంఖ్యలను పేర్కొనలేదు)
27 – నక్షత్ర

ఈ విధంగా సంకేత పరిభాషలో గణితశాస్త్ర విషయాలు వేదంలో చాలాచోట్ల కనబడుతాయి.

**వేదంలో రేఖాగణితవిషయాలు**

వేదంలో రేఖాగణిత విషయాలు సూత్రరూపంలో కనబడుతాయి. వీటిని శుల్బసూత్రాల రూపంలో వర్ణించారు. అయితే ప్రతి విషయం సంకేతంగా మాత్రమే చెప్పబడటం విశేషం. వర్తమానకాలంలో కూడ ఈ విధంగా సంకేతంగా చెప్పడమే గొప్ప అంటారు. ఋగ్వేదంలో కొన్ని మంత్రాలు రేఖాగణిత విషయాలను వర్ణిస్తాయి.

'కాసీత్ ప్రమా ప్రతిమా కింనిదానం, ఆ్యం, కిమాసేత్ పరిధిః క ఆసీత్ ఛందః కిమాసీత్' (2.10.130.3)

ఈ మంత్రంలో రేఖాగణితంయొక్క శబ్దాలు కనిపిస్తాయి.

1. ప్రమా – నాపం, పరిమాణం (Measurement)
2. ప్రతి మా – నక్షా, రూపురేఖలు (Outline)
3. నిదానం – కారణం, మూలసిద్ధాన్తం (Basic Principles)
4. పరిధి – (Circumference)
5. ఛంద – కొలవటానికి సాధనం
6. ప్రవుగ – సమద్విభాగ్య త్రిభుజం (Isosceles Triangle)

మరియు ఋగ్వేదంలో ఒక మంత్రంలో వృత్తం (Circle) గురించి వివరణ ఉంది.

'చతుర్భిః సాకం నవతిం చ నామభిః
చక్రం నవృత్తం వ్యతీంరవీవిపత్' – (ఋ. 1.155.6)

ఈ మంత్రంలో ఒక వృత్తంలో $4 \times 90 = 360$ అంగాలుంటాయి. దీనిని కాలచక్రమని అంటారు. కనుక సంకేతంలో ఒక వృత్తంలో 90 అంగాలతో 4 ఖండాలు (Radius) ఉంటాయి అని చెప్పటం విశేషం.

ఈ విధంగా వేదంలో ఈనాడు చెప్పబడే 'పైథాగరస్ సిద్ధాంతం' కూడా శుల్బసూత్ర రూపంలో కనబడుతుంది. కావున గణితశాస్త్రప్రియులు వేదాధ్యయనం చేయటం ద్వారా ఎన్నో గణితరహస్యాలు పొందవచ్చు.

**వేదంలో జంతువిజ్ఞానం (Zoology)**

నాలుగువేదాలలో జంతువుల పేర్లు, వాటి వర్గీకరణం, వాటి స్వభావం మొదలైన విషయాలు విస్తృతంగా చెప్పబడి ఉన్నాయి. పశుపాలన, పశుసంరక్షణ, పశుసంవర్ధనం, పశుచికిత్స మొదలైన పదప్రయోగాలు కనిపిస్తాయి. అధర్వణవేదంలో 'పశువు' అనగా

'పశ్యతి ఇతి పశుః', అంటే ఏదయితే చూడగలుగుతుందో అది పశువుగా చెప్పబడింది. అంటే మానవుడు కూడా పశుశబ్దవాచ్యుడే. కారకసంహిత గ్రామాలలో నివసించేవాటిని 'గ్రామ్యపశువులుగా', అరణ్యాలలో నివసించేవాటిని 'ఆరణ్య'ములుగా వర్ణించింది. శతపథ బ్రాహ్మణంలో పశువులను ఐదు విధాలుగా 1) పురుషుడు 2) గోవు, 3) మేక 4) అశ్వం 5) వృషభం - అని వర్ణించటం జరిగింది. ఆధునిక జంతుశాస్త్రంలో ప్రోటోజోవ, మెటోజోవా, పోరిఫెరా, సిలెంట్రిటా, నిమెటోడా, ఎనిలీడా, అర్థోపేడా, మోలస్కా, ఎకినోడెర్మెటలుగా జంతువులను వర్గీకరించారు. వేదాలలో ప్రథమంగా ఆవిర్భవించిన జీవులను ఆధునికులు 'ప్రోటోజోవా'గా అభివర్ణించారు. అమిబా మొదలైన ఏకకణజీవులు వీటి క్రింద వస్తాయి. శతపథబ్రాహ్మణంలో వీటి ప్రస్తావన ఉంది.

జంతువిజ్ఞాన విషయంలో యజుర్వేదంలోని 24వ అధ్యాయంలో ఎన్నో విశేషాలు ఉన్నాయని పరిశోధకుల అభిప్రాయం. అనేక మంత్రాలలో వివిధ జీవుల ప్రస్తావన రావటం అద్భుతం. జలసంబంధ జీవులు, సరీసృపాలు, పక్షులు, క్షీరదాలు, అడవి జంతువులు, క్రిమికీటకాలు మొదలైనవి వర్ణించబడ్డాయి. జలజీవులలో మత్స్యం, అజగరం, ఝషం (మకరవిశేషం), (కచ్ఛపం) మొదలైనవాటి ప్రస్తావన ఉంది. యజుర్వేదంలో (24.1-40) 60 పక్షుల పేర్లను ఉల్లేఖించటం ఒక అద్భుతం. వేదాలలో దాదాపు కొన్ని కోట్ల జీవుల విశేషాలు వర్ణించటం ఆశ్చర్యకరమైన విషయం.

**వేదంలో రసాయనశాస్త్రం (Chemistry)**

అథర్వణవేదంలో రసాయనశాస్త్ర విషయాలను బాగా వర్ణించటం జరిగింది. జలం ఉత్పత్తి, జలం గుణాలు, జలం ద్వారా సృష్టి, వివిధ ధాతువులు, లవణాదులు, రత్నాలు మొదలైన విషయాలు వేదాలలో దర్శనమిస్తాయి. అథర్వణవేదం జలంలో అగ్ని (Oxygen), సోముడు (Hydrogen) ఉంటాయని వర్ణించింది. అయితే వేదం ఆక్సిజన్‌ను 'అగ్ని, వైశ్వానర, ప్రాణ' మొదలైన శబ్దాలతో పేర్కొంది.

'అగ్నిషోమౌ భిభ్రతి ఆప ఇత్ తాః'

'అప్సు ఆసీన్ మాతరిశ్వా ప్రవిష్టః' - (అథర్వవేదం 3.13.5, 10.8.40)

యజుర్వేదంలో హైడ్రోజన్‌ను, హీలియమ్ గాస్‌ను సంకేతంగా చెప్పారు. మంత్రాలలో హైడ్రోజన్‌ను 'అపాం రసం', హీలియంను 'అపాం రసస్యయో రసః' అనే మాటలతో సూచించారు. హీలియంను నీటి సారంగా, హైడ్రోజన్‌ను సూక్ష్మరూపంగా వర్ణించారు. ఈ రెండూ సూర్యునిలో ఉన్నట్లు చెప్పారు.

'అపాం రసమ్ ఉద్వయసం సూర్యేసన్తం సమాహితమ్' (య. 9.3)

ఆధునికవిజ్ఞానశాస్త్రవేత్తలు సూర్యునిలో 90 శాతం హైడ్రోజన్, 8 శాతం హీలియం, 2 శాతం ఇతర ద్రవ్యాలు ఉన్నాయన్న విషయాన్ని ఈ మంత్రాలు ధ్రువీకరిస్తున్నాయి.

ప్రాచీన భారతీయ సంస్కృతిలో రసాయనశాస్త్రవికాసం ఎంత అద్భుతంగా ఉన్నదో డా॥ స్వామి సత్యప్రకాశ్ సరస్వతీ తన 'వైజ్ఞానిక్ వికాస్‌కీ భారతీయ పరంపరా' అనే గ్రంథంలో బాగా వివరించాడు. క్షారాలు, పాదరసం, బంగారం నిర్మాణం మొదలైన విషయాలు వేదాలలో నిగూఢంగా ఉన్నాయి.

**వేదంలో భౌతికశాస్త్రం (Physics)**

చతుర్వేదాలలో అగ్నివిద్యతో సంబంధమైన అనేక మంత్రాలు ఉన్నాయి. ఆధునిక

విజ్ఞానంలో భౌతికశాస్త్రంలో శక్తి (Force), గతి (Motion), విద్యుత్తు (Energy), సామర్థ్యం (Power), ఉష్ణము (Heat), కాంతి (Light), అయస్కాంతత్వం (Magnetism), అణుశక్తి (Nuclear Energy) మొదలైనవాటిని వేదాలు సూచించాయి. వేదాలలో శక్తిని అగ్నిరూపంలో వివరించారు. ఋగ్వేదంలో అగ్నిని ఇంద్రుడు, బ్రహ్మ, వరుణుడు, అర్యమా, రుద్ర, మరుత్ స్వరూపాలలో వివరించడం జరిగింది.

త్వమగ్న ఇంద్రః, త్వం విష్ణః - ఋ. 2.13

శక్తిని సర్వవ్యాపకంగా వేదాలలో వర్ణించారు. ఇది ద్యులోకం, అంతరిక్ష, భూమిలలో ప్రత్యేకంగా వ్యాపించిఉంది.

విశ్వస్యకేతుః, భువనస్యగర్భః ఆరోదసీ ఆపుణాత్ - (యజు. 12.23)

యజుర్వేద మంత్రాలలో అగ్నిని, దేవతల దూతగా చెప్పారు. అంటే మనం యజ్ఞం ద్వారా ఆహుతిగా వేసిన వస్తువులను అగ్ని ఆయా దేవతలకు చేరవేస్తూ ఉంటాడు. విశ్వస్య దూతమమృతమ్, సదుద్రవత్ అని వర్ణించింది. అగ్నిలోని అనగా శక్తిలోని సంప్రేషణాత్మకస్థితిని వర్ణించడం ద్వారా ఈనాటి రేడియోతరంగాలు, ఫోన్, టీవి ప్రసారాలను సూచించినట్లయింది. యజుర్వేదం 'శ్రుత్కర్ణ' అనే శబ్దంతో విద్యుత్తు తరంగాల ద్వారా ధ్వని తరంగాలు ప్రసరిస్తాయంటూ టెలీఫోన్ మూల స్వరూపాన్ని వర్ణించడం విశేషం. (శ్రుధి శ్రుత్కర్ణ వహ్నిభిః - 44.13).

వేదాలలో సౌరశక్తి (సోలార్ ఎనర్జీ) విషయాలను అధికంగా చర్చించటం జరిగింది. సూర్యుడిని 'జగత్తుకు ఆత్మగా, జగచ్చక్షువు'గా వర్ణించటం విశేషం. సూర్యకిరణాల శక్తిని బ్రాహ్మణాలు విశేషంగా వర్ణించాయి. ఈనాటి ఆధునికశాస్త్రజ్ఞులు చెప్పే సిద్ధాంతాలను వేదం ఆనాడే చెప్పడం అద్భుతం.

## వేదంలో వ్యవసాయం (Agricultural Science)

మానవజీవితం మొత్తం అన్నంపై ఆధారపడి ఉంది. అటువంటి అన్నాన్ని వ్యవసాయం ద్వారా మానవుడు పొందగలుగుతున్నాడు. సృష్టి ప్రారంభమే అన్నంతో అయిందని వేదం అంటోంది. శతపథ బ్రాహ్మణంలో 4 శబ్దాలలో కృషికర్మను వర్ణించారు. 1) కర్షణం (భూమిని దున్నటం) 2) వపనం (విత్తనం నాటడం) 3) లవణం (పంటను కోయటం) 4) మర్దనం అనగా స్వచ్ఛమైన ఆహారాన్ని పొందడం. (కృషంతః, వపంతః లునంతః మృణంతః - శ.బ్రా. 1.6.13)

కృష్ణయజుర్వేదంలో ఆవహనీయ చయనం కోసం భూమి దున్నడం, విత్తనాలు నాటడం మొదలైన విషయాలను పేర్కొనడం జరిగింది.

'సీరాయుఞ్జన్తి కవయో యుగా వితన్వతే పృథక్'

వ్యవసాయ నిపుణులైన కర్షకులు నాగలిని కట్టుదురుగాక, వాటికి కాడులను అమర్చుదురు గాక. 'యజుషా యునక్తి యజుషా కృషతి వ్యావృత్త్యై, షడ్గవేనకృషతి' మొదలైన మంత్రాలతో యజ్ఞంలో మంత్రంతో నాగలినే కట్టి, మంత్రోచ్చారణతో భూమిని దున్నాలి. ఆరు ఎడ్లను కట్టిన నాగలితో దున్నితే పంట విశేషంగా ఉంటుంది. నాగలి ఎలా ఉండాలో వేదం వివరించింది. 'లాఙ్గలం పవీరవగ్ం సుశేవగ్ం సుమతిత్సరు.

ఉదిత్కృషతి' - వజ్రంవలె అతితీక్షణమైన నాగలి అయితే మంచిది. ఈ నాగలి పెద్ద మట్టిబెడ్డలు పైకి వచ్చేలా దున్నుతుంది. దానివల్ల కర్షకులకు ఆయాసం ఉండదు. ఆధునికంగా ఇటువంటి వాటిని ట్రాక్టర్లకు అమర్చి పొలాలు దున్నుతున్నారు.

ఋగ్వేదంలో, అథర్వణవేదంలో వ్యవసాయానికి ఉపయోగించే పశువుల పాలనను చక్కగా వివరించడం జరిగింది. గోశాల ఏర్పాట్లు, ఎరువుల తయారి, ధాన్యవిశేషాలన్నింటిని వేదం అద్భుతంగా వర్ణించింది. వేదంలో మొత్తం 14 రకాల ధాన్యాల ప్రసంగం వస్తుంది. గ్రామాలలో దొరికే విత్తనాలు ఏడు. అడవులలో దొరికే విత్తనాలు ఏడు. 'చతుర్దశభిర్వపతి సప్తగ్రామ్యా ఓషధయ స్సప్తారణ్యా ఉభయీషామవరుద్ధ్యై' అని నువ్వులు, మినుములు, వరి, యవలు, కొఱ్ఱలు, చిరువడ్లు, గోధుమలు గ్రామాలలో పండించేవి. వెదురుబియ్యం, నెవ్వరి ధాన్యం, కారునువ్వులు, అడవిగోధుమలు, మర్కటాలు, గార్ముతౌలు అడవిధాన్యాలు అని పేర్కొంది. ముఖ్యంగా వేదం వ్యవసాయానికి చాలా ప్రాధాన్యత ఇచ్చింది. భూమిని దేవతాస్వరూపంగా భావించి, ప్రతి పూజలో 'భూపూజ'ను ఏర్పాటుచేసి వ్యవసాయ ప్రధానమైన భారతదేశంలో భూమిని సమస్తమైన కోరికలు తీర్చే లక్ష్మీస్వరూపంగా వర్ణించింది. వేదసంస్కృతి వ్యవసాయాన్ని బాగా ప్రోత్సహించింది.

**వేదంలో జ్యోతిషం (Astronomy)**

వేదానికి ఒక అంగం జ్యోతిషం. వేదాన్ని ఒక పురుషునిగా భావిస్తే జ్యోతిషం ఆయనకు నేత్రం. కృష్ణయజుర్వేదంలో జ్యోతిశ్శాస్త్రానికి సంబంధించిన అనేక విషయాలు కనబడతాయి. నక్షత్రాలను, వాటి అధిష్ఠానదేవతలను వేదం పేర్కొంది. నేటి వాడుకలో 'అశ్వనీ' నక్షత్రంతో లెక్క ప్రారంభించడం జరుగుతోంది. కాని వేదంలో 'కృత్తికా' నక్షత్రంతో లెక్క మొదలైంది. జ్యోతిష విషయంలో 'వేదాంగజ్యోతిషం' అనే ప్రాచీన గ్రంథం ఒకటుంది. ఇది రెండు భాగాలుగా మనకు లభిస్తోంది. 1) ఆర్చజ్యోతిషం (ఋగ్వేద జ్యోతిషం), 2) యజుర్వేద జ్యోతిషం. ప్రథమ భాగంలో 36 శ్లోకాలు, రెండవభాగంలో 43 శ్లోకాలున్నాయి. ఇవి అర్థం చేసుకోవటం చాలా కష్టమని పండితుల అభిప్రాయం. ఋగ్వేదంలో ఒక మంత్రంలో 'ప్రధి' అనే శబ్దం ద్వారా రాశిచక్రం ప్రస్తావన ఉంది. ప్రథి అంటే మాసమని కూడ అర్థం. ఋగ్వేదానుసారం మొత్తం 12 రాశులున్నాయని కథనం. ప్రథ అంటే 'రాశి' అని కూడ అర్థం ఉంది.

వేదజ్యోతిషంలో ఋతువుల పేర్లు మనకు ప్రముఖంగా కనిపిస్తాయి. 'మధుశ్చ మాధవశ్చ వాసంతికా వృతూ' అని కృష్ణయజుర్వేదంలో తైత్తిరీయసంహితలో మాసాలను, ఋతువులను పేర్కొన్నారు. కృష్ణ యజుర్వేదంలోనే తైత్తిరీయ బ్రాహ్మణంలో 3వ అష్టకంలో నక్షత్రాలకు సంబంధించిన వాక్యాలున్నాయి. కొన్ని నక్షత్రాలు కొన్ని ప్రత్యేక కర్మలకు మంచివని వేదం చెబుతోంది. 'యం కామయేత దుహితరం ప్రియాస్యాదితి' - తన కుమార్తె భర్తకు ఎక్కువగా ప్రియురాలు కావలెనని కోరిన తండ్రి స్వాతినక్షత్రంలో కన్యాదానం చేయాలి. అప్పుడు ఆమె భర్తను వదిలి పుట్టింటికి గూడ రాలేనంత ఇష్టురాలవుతుంది. జయింపశక్యంగానివాడిని జయించాలంటే 'అభిజిత్తు'లో యుద్ధానికి బయలుదేరమని వేదం చెప్పింది. దేవనక్షత్రాలు, యమనక్షత్రాలు అనే విభాగాన్ని

శ్రుతి పేర్కొంది. కృత్తికనుండి విశాఖ వరకు దేవలోక సమీప నక్షత్రాలు, అనూరాధ నుండి భరణి వరకు యమలోక సమీప నక్షత్రాలని చెప్పింది. వేదం చెప్పిన ప్రకారమే ప్రస్తుతం కాలగణనం నడుస్తోంది. వేదంలో జ్యోతిషానికి సంబంధించి అనేక రహస్యాలు కనబడుతున్నాయి.




అలాగే పర్యావరణానికి సంబంధించిన రహస్యాలు. కృత్రిమ వర్షాలు ఎలా కురిపించాలో వేదంలో బాగా వివరించారు. మేఘాలు ఎలా ఉంటాయో ఋగ్వేదం పేర్కొంది. ఎటువంటి మేఘాలు వర్షిస్తాయో బృహత్‌సంహితలో వర్ణించారు. భూగర్భవిజ్ఞానం ఋగ్వేదంలో విశేషంగా ఉంది. భూమి పొరలు ఎన్నో, ఎక్కడ నీరు, విలువైన ఖనిజాలుంటాయో వేదం పేర్కొంది. అధర్వణవేదంలో వాణిజ్యం, వర్తకవిషయాలు కనిపిస్తాయి. కనుక వేదాలు ఈ విశ్వమానవాళికి భగవానుడు అందించిన అపురూపకానుకలు అని చెప్పవచ్చు.

**వేదాంగాలు**

పరతత్త్వాన్ని బోధించే వేద, ఉపనిషత్తులను తెలుసుకోవటంలో ఉపయోగపడేవి వేదాంగాలు. అంగ అనే శబ్దానికి 'ఉపకారక'మనే అర్థం ఉంది. 'అంగ్యంతే జ్ఞాయంతే, అమూభిరితి అంగాని'. ఒక వస్తు స్వరూపాన్ని తెలుసుకోవటానికి సహాయపడేవి అంగాలు అని చెప్పవచ్చు. వేదాన్ని అర్థం చేసుకోవడం చాలా కష్టం. వేదార్థాన్ని, వేదప్రతిపాదిత కర్మకాండలను గ్రహించటానికి జరిగిన ప్రత్యేకశాస్త్రాల సృష్టి వేదాంగాలు అని చెప్పవచ్చు. కారణం ఏమిటంటే కలియుగంలో అల్పప్రజ్ఞతో, బుద్ధితో వేదాలను ఇష్టంవచ్చినట్లు అర్థకల్పన చేసి చెబుతున్నారు. వేదాల సరియైన అర్థం తెలియాలంటే వేదాంగాల అధ్యయనం తప్పనిసరి. ఋషిప్రోక్త వేదాంగాలు మొత్తం ఆరు. 1) శిక్ష 2) కల్పం 3) వ్యాకరణం 4) ఛందస్సు 5) నిరుక్తం 6) జ్యోతిషం. వేదాంగాల ప్రస్తావన గోపథబ్రాహ్మణం, గౌతమసూత్రాలు, రామాయణ, భారత గ్రంథాలలో కనిపిస్తుంది. పాణిని వేదాంగాల ప్రత్యేకతను వర్ణిస్తూ బ్రహ్మస్వరూపమైన వేదాలకు వేదాంగాలు ఆరు శరీరఅంగాల వంటివని పేర్కొన్నాడు. వేదపురుషుడికి శిక్ష నాసికగా, కల్పసూత్రాలు హస్తాలుగా, వ్యాకరణం నోరుగా, నిరుక్తం చెవులుగా, ఛందస్సు పాదాలుగా, జ్యోతిషం నేత్రాలుగా వర్ణించారు.

**1. శిక్ష:** వేదాంగాలలో మొదటిది శిక్ష. అంటే వైదికమంత్రాలను సరైన ఉచ్చారణతో చెప్పటానికి శిక్షగ్రంథాలు సృష్టించబడ్డాయి. సంస్కృతభాషలో ప్రతి శబ్దానికి వ్యుత్పత్తి అర్థం ఎలా ఉందో, ప్రతి పదానికి ప్రత్యేకమైన ఉచ్చారణ ఉంది. వేదానికి ప్రత్యేకంగా శబ్దఉచ్చారణతో బాటు స్వరాలకు ప్రత్యేకస్థానం చెప్పబడింది. గురువు ఏ పద్ధతిలో ఉచ్చరిస్తాడో అదే పద్ధతిలో శిష్యుడు ఉచ్చరించాలి. అందుకే వేదాలకు 'అనుశ్రవః' అని పేరు ఉంది. స్వరాలు మూడుగా ఉదాత్త (ఉచ్చైస్వరంతో), అనుదాత్త (తక్కువ స్వరం), స్వరితం (సమానం) అని శిక్షాశాస్త్రం చెబుతుంది. ముఖ్యంగా వేదశబ్దార్థం గ్రహించడానికి స్వరం తప్పనిసరి. మహాభారతంలో శాంతిపర్వంలో గాలవుడి శిక్షాశాస్త్ర ప్రస్తావన ఉంది. అయితే ప్రస్తుతం అది అలభ్యం. రెండోది భారద్వాజ శిక్షాశాస్త్రం. దీనికి నాగేశభట్టు టీక ఉంది. మిగిలినవాటిలో చారాయణీయ శిక్ష, అపిగలుని శిక్ష,

పాణినీయ శిక్ష ముఖ్యమైనవి. సామవేదానికి నారదీయశిక్ష, గౌతమీశిక్షలు ఉన్నాయి. అధర్వణవేదానికి మాండుకీశిక్ష ఉంది. ఇవే కాక శిక్షా గ్రంథాల లిఖితప్రతులు అనేక గ్రంథాలయాలలో పడి ఉన్నాయి. శిక్షాశాస్త్రం ఆరు విషయాలను వర్ణించింది. 1) వర్ణం (అక్షరం), 2) స్వరం 3) మాత్ర (కాలం) 4) బల (వాయుస్థానం) ప్రయత్నం, 5) సామ (దోషరహితంగా ఉచ్చరించటం) 6) సంతానం (సంధిరూప ఉచ్చారణ). వీటిని శిక్షాశాస్త్రం వర్ణించింది.

**2. కల్పం:** వేదాంగాలలో రెండవస్థానం కల్పసూత్రాలది. ఇవి అతి ప్రాచీనమైనవి. బ్రాహ్మణగ్రంథాల్లో యజ్ఞయాగాదుల వివరణ రాను రాను కఠినంగా దుర్గమంగా మారింది. వాటిని క్రమబద్ధం చేయటానికి రాసినవే కల్పసూత్రాలు. 'కల్పోవేదవిహితానాం కర్మణామానుపూర్వ్యేణ కల్పనాశాస్త్రమ్' వేదవిహితమైన కర్మలను క్రమబద్ధంగా వ్యవస్థితరూపంలో కల్పన చేసే శాస్త్రగ్రంథాలను కల్పాలు అంటారు. ఋత్విజుల ఉపయోగం కోసం ఇవి రాయబడ్డాయి. అయితే తక్కువ శబ్దాల్లో ఎక్కువ అర్థాన్ని చెప్పటానికి సూత్రరూపంలో వీటిని రాశారు. ఇవి మొత్తం 4 విధాలు. 1) శ్రౌతసూత్రాలు 2) గృహ్యసూత్రాలు 3) ధర్మసూత్రాలు 4) శుల్బసూత్రాలు.

1) శ్రౌతసూత్రాలలో శ్రుతి ప్రతిపాదితమైన 14 యజ్ఞాలు వివరించబడ్డాయి.
2) గృహ్యసూత్రాలలో షోడశ (16) సంస్కారాల కర్మకలాపాల వివరణ, పంచమహాయజ్ఞాలు, గృహప్రవేశ, ముహూర్త విషయాలు ఉన్నాయి.
3) ధర్మసూత్రాలలో చాతుర్వర్ణ్యాశ్రమాలు, వాటి పద్ధతులు వివరించారు.
4) శుల్బసూత్రాలలో యజ్ఞవేది నిర్మాణాలు, శిల్పశాస్త్రరహస్యాలు వివరించారు.

చరిత్రకారులు సూత్రాలకాలం క్రీ.పూ. 900-400 మధ్య అని చెప్పారు.

**వ్యాకరణం:** 'వ్యాక్రియంతే వ్యుత్పాద్యంతే శబ్దా అనే నేతి వ్యాకరణమ్' శబ్దాల వ్యుత్పత్తిని గురించి చెప్పేది వ్యాకరణం. వేదాంగాలలో మూడవది. 'ముఖం వ్యాకరణం స్మృతమ్' వేదపురుషుడికి వ్యాకరణం ముఖం వంటిది. కనుకనే అతి ముఖ్యమైన వేదాంగం వ్యాకరణం. శబ్దాల వ్యుత్పత్తిని కాక పదస్వరూపం, అర్థస్వరూపం మొదలైనవి నిర్ణయించేది వ్యాకరణమే. వ్యాకరణాలలో 'పాణీనీయ వ్యాకరణం' చాలా పురాతనమైనది. పాణిని తన వ్యాకరణంలో 'ఇంద్రవ్యాకరణ' ప్రస్తావన చేశాడు. కాని అది అలభ్యం. పాణిని వ్యాకరణంలో 4000 అల్పాక్షర సూత్రాలు ఉన్నాయి. ఈ వ్యాకరణంలో 8 అధ్యాయాలు ఉండటం వల్ల దీనికి 'అష్టాధ్యాయి' అనే పేరు వచ్చింది. ప్రపంచమంతా ఈ వ్యాకరణాన్ని చూసి ఆశ్చర్యపడింది. పాణిని క్రీ.పూ. 500 నాటివాడని పండితుల అభిప్రాయం. పాణిని వ్యాకరణానికి పతంజలి మహాభాష్యం రాశాడు.

**నిరుక్తం:** వేదాంగాలలో నాలుగవది నిరుక్తం. 'అర్థావబోధా నిరజాక్షతయా పదజాతం యత్ర ఉక్తం తద్ నిరుక్తం' అని సాయనుడు వివరించాడు. అర్థాన్ని బోధించే పదసమూహం యొక్క సంగ్రహమే నిరుక్తం అని అర్థం. వేదార్థాన్ని తెలుసుకోవడానికి నిరుక్తం తప్పనిసరి. 'నిరుక్తం' అంటే వ్యుత్పత్తి అని అర్థం. శబ్ద వ్యుత్పత్తిని చెప్పటం నిరుక్తశాస్త్ర ప్రయోజనం. వేదమంత్రాలను అర్థం చేసుకోవడానికి వాటిలోని పదాల

వ్యుత్పత్త్యర్థం తెలుసుకోవటం చాలా అవసరం. నిరుక్తం కేవలం వేదశబ్దాలను వివరించటానికే పుట్టింది. అయితే నిరుక్తం తెలియాలంటే వ్యాకరణం తప్పనిసరిగా రావాలి. నిరుక్తకారులు 12 మంది అని యాస్కుడు అన్నాడు. అయితే వర్తమానకాలంలో ఒక్క యాస్కనిరుక్తం మాత్రమే లభ్యం. నిరుక్తంలో మొత్తం 12 అధ్యాయాలున్నాయి. చివర రెండు పరిశిష్టరూప అధ్యాయాలున్నాయి. మహాభారత శాంతిపర్వంలో యాస్కుడు స్మరించబడ్డాడు. నిరుక్తం అధ్యయనం చేస్తే భాషావిజ్ఞానం, సాహిత్యం, సామాజికశాస్త్రం, చరిత్ర మొదలైనవాటిలో పరిజ్ఞానం లభిస్తుంది.

**ఛందస్సు:** వేదాంగాలలో ఐదవది ఛందస్సు. 'ఛందః పాదౌతు వేదస్య' అని ఛందస్సు వేదానికి పాదమని చెప్పబడింది. వేదాల విశుద్ధమైన, లయబద్ధమైన ఉచ్చారణకు, పఠనానికి ఛందస్సు తప్పనిసరిగా రావాలి. ఇది లేకుండా మంత్రాల ఫలం లభించదని ప్రాచీనుల విశ్వాసం. ఛందస్సు అనగా 'ఛందయతి పృణాతి రుచతే ఇతి ఛందః' - ఏ వాణి వింటే మనస్సు ఆహ్లాదాన్ని పొందుతుందో ఆ ఛందోమయ వాణివేదం అని అర్థం. అసురసంబంధమైన విఘ్నాలనుంచి వేదాన్ని రక్షించే కవచం ఛందస్సు. వైదిక ఛందస్సులు అక్షరగణంమీద ఆధారపడ్డాయి. వాటిల్లోని అక్షరాల గురు, లఘువుల్లో ఒక క్రమంగాని, విశేషనియమంగాని లేదు. వైదిక ఛందస్సులో పాదనియమం లేదు. మూడు పాదాల ఛందస్సులు వేదంలో చాలా ఉన్నాయి. గాయత్రి 24, ఉష్ణిక్ 28, అనుష్టుప్ 32, బృహతీ 36, పంక్తి 40, త్రిష్టుప్ 44, జగతి 48, అతిజగతి 52, శక్వరి 56, అతిశక్వరి 76, కృతి 80, ప్రకృతి 84, ఆకృతి 88, వికృతి 92, సంస్కృతి 96, అభికృతి 100, ఉత్కృతి 104 ఇలా వర్ణసంఖ్యలు ఉన్నాయి. ఛందశ్శాస్త్రానికి ప్రథమ ప్రవర్తకుడు శివుడే. పూర్తిగా ఛందస్సులను తెలిపే గ్రంథం పింగళుని ఛందశ్శాస్త్రం. ఇది సూత్రరూపంలో 8 అధ్యాయాలలో రాయబడింది.

**జ్యోతిషం:** వేదాంగాలలో ఆరవది జ్యోతిషం. వేదపఠనానికి జ్యోతిషం అత్యావశ్యకమైనది. పవిత్ర యజ్ఞయాగాలను మొదలుపెట్టాలంటే సుముహూర్తం కోసం జ్యోతిషం అవసరం. వేదాంగాలలో జ్యోతిషం చివరిదైనా నెమలికి శిఖ శిరస్సుమీద ఉన్నట్లు వేదాంగాలల్లో మూర్ధన్యస్థానం వహించిందని వేదాంగ జ్యోతిషంలో వర్ణించారు. కాలగణనం, నక్షత్ర సహాయంతో కాలగణనం, భూభ్రమణాదుల రహస్యాలు జ్యోతిషం ద్వారానే తెలుస్తాయి. వేదాంగ జ్యోతిషంలో రెండు గ్రంథాలు. 1) ఋగ్వేద జ్యోతిషం 2) యజుర్వేద జ్యోతిషం. వేదాంగ జ్యోతిష రచయిత 'లగధుడు' అని పండితులు అంటారు. ఆర్యభట్ట, వరాహమిహిర, బ్రహ్మగుప్త, భాస్కరాచార్య మొదలైన జ్యోతిషవేత్తలు ప్రపంచఖ్యాతిని పొందారు.

ఈ విధంగా వేదం అర్థం కావాలంటే ఈ వేదాంగాలు తెలియాలి అని విద్వాంసులు నిర్ణయించారు.



# ఉపనిషత్తులు

**ఆ**ధ్యాత్మిక వాఙ్మయంలో ఉపనిషత్తులు శిరోమణులుగా విరాజిల్లుతున్నాయి. బ్రహ్మవిద్యా ప్రతిపాదకాలే ఉపనిషత్తులు. వేదవాఙ్మయంలో ఆరణ్యకాల్లో ఉండే భాగాలు ఇవి. వేదం అంతిమభాగాలు కాబట్టి 'వేదాంత'మనే పేరుతో పిలువబడుతున్నాయి. ఉపనిషద్ అనే శబ్దం 'ఉప', 'ని' అనే సర్గలు చేరి 'సత్' అనే ధాతువునుండి వచ్చింది. 'సత్' అనే ధాతువుకు అనేకార్థాలున్నాయి. 'షట్ల్పవిశరణగత్య వసాదనేషు' అని విశరణ, గతి, అవసాదన అనే అర్థాలున్నాయి. విశరణ = నాశం చెందుట; గతి= ప్రాప్తి (లభించుట), అవసాదన = శిథిలం సమాప్తిచెందుట అనే అర్థాలు వస్తాయి. 'ఉపనిషన్నం అస్యాం శ్రేయః ఇతి' – వేటియందు మానవుల శ్రేయస్సు ఉందో, అవి ఉపనిషత్తులు. ఉప+ని అంటే కూర్చొని సంపాదించే జ్ఞానంతో ఉపనిషత్తులు కూడినవని, అందుకే వాటికి ఆ పేరు కలిగిందని వివరణ.

బ్రహ్మవిద్యను బోధించే ఉపనిషత్తులను ఎవరు గ్రహిస్తారో వారికి గర్భవాస, జనన, మరణ, జర, రుజాది సంసారదుఃఖాలు నశిస్తాయని శంకరుల వారి అభిప్రాయం. ఆధ్యాత్మిక విద్యారహస్యాలను బోధిస్తుంది కనుక దానిని ఉపనిషత్తు అన్నారు. ఉప = వ్యవధానం లేకుండా; ని = సంపూర్ణంగా; షత్ = జ్ఞానప్రాప్తిని కలిగించేవి కాబట్టి ఈ గ్రంథాలకు ఉపనిషత్తులని పేరు వచ్చింది. దేశకాలవస్తు పరిచ్ఛేదం లేకుండా బ్రహ్మజ్ఞానాన్ని బోధించేవని మరొక అర్థం ఉంది. అయితే ఉపనిషత్తుల సంఖ్యలో అనేక భిన్నాభిప్రాయాలున్నాయి. ముక్తికోపనిషత్తు ప్రకారం మొత్తం ఉపనిషత్తులు 108. మద్రాసులో అడయార్ లైబ్రరీవారు ప్రచురించిన ఉపనిషత్తులు 179 వరకు ఉండటం విశేషం. గుజరాతి ప్రింటింగ్ ప్రెస్ ప్రచురించిన ఉపనిషత్ వాక్యమహాకోశంలో మొత్తం 223 వరకు ఉపనిషత్తులుండటం విశేషం. ప్రజలలో ధార్మికబుద్ధి, సంప్రదాయాలు పెరిగేకొద్దీ ఉపనిషత్తుల సంఖ్య పెరిగింది. కాని శంకరభగవత్పాదులు విస్తృతంగా ఉన్న ఉపనిషత్తులలో కేవలం కొన్నింటికి మాత్రమే భాష్యం రాశారు.

ఈశకేన కఠప్రశ్న ముండమాండూక్యతైత్తిరిః
ఐతరేయం చ ఛాందోగ్యం బృహదారణ్యకం దశ॥

ఈశోపనిషత్తు, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండుక్య, తైత్తిరి, ఐతరేయ, ఛాందోగ్య,

బృహదారణ్యక అనే పది ఉపనిషత్తులకు భాష్యం రాసి, ఆ తర్వాత నృసింహపూర్వ, నృసింహ ఉత్తర ఉపనిషత్తులకు కూడా శంకరులు భాష్యం రాశారు. ఇవిగాక కౌషీతకి, శ్వేతాశ్వతర, మైత్రాయిణీ అనే మూడు ఉపనిషత్తులను కూడ పేర్కొన్నారు. ఇవికూడ చాలా ప్రాచీనాలు. వేదాలలో అంతిమభాగాలైన ఈ ఉపనిషత్తులలో వైదిక, యజ్ఞ, యాగాది కర్మలు, వాటి వివరణ అసలు కనిపించదు. అంటే ఉపనిషత్తులు కేవలం తత్త్వజ్ఞాన సంబంధమైన విద్యను మాత్రమే ప్రతిపాదించాయి. కర్మ, ఉపాసన మొదలైన విషయాలను సంహిత, బ్రాహ్మణ గ్రంథాలు చెబుతున్నాయి. సంహిత, ఆరణ్యకాలలో ఉపాసన చెప్పబడింది. కేవలం జ్ఞానసంబంధమైన విషయాలు మాత్రమే ఈ ఉపనిషత్తులలో ప్రతిపాదించబడ్డాయి. విద్యలలో అతిశ్రేష్ఠమైన పరావిద్యనే బ్రహ్మవిద్య అంటారు. ఈ పరావిద్య అయిన బ్రహ్మవిద్యను మాత్రమే ఉపనిషత్తులు ప్రతిపాదించాయి. తత్త్వచింతన ప్రధానంగా ఉపనిషత్తులలో కనిపిస్తుంది. ప్రకృతి, పురుష, పరమాత్మల వివేచన ఈ ఉపనిషద్గ్రంథాలల్లో చర్చించబడింది. ఉపనిషత్తులలో పరబ్రహ్మాన్ని గురించిన నిర్గుణ, సగుణ భేద వర్ణనలున్నాయి. పరా, అపరా విద్యలను సమన్వయం చేయడానికి శంకరభగవత్పాదులవారు ప్రయత్నం చేశారు. మాయను జయించి మోక్షం పొందే విధానాన్ని ప్రధానంగా ఈ ఉపనిషత్తులు పేర్కొన్నాయి. ఉపనిషత్తులలో ప్రతిపాదించబడిన ఆధ్యాత్మిక విషయాలే దర్శనాలుగా వికాసం చెందాయి. ఇవే షడ్దర్శనాలు.

క్రీ.శ. 1640లో షాజహాన్ చక్రవర్తి కుమారుడు దారాషికో కాశ్మీర్‌లో ఉపనిషత్తుల గూర్చి విని, వాటిని అధ్యయనం చేశాడు. తమ పవిత్రగ్రంథమైన ఖురాన్‌లోని కొన్ని ప్రశ్నలకు ఉపనిషత్తులలో సమాధానాలు దొరికినట్లు తను రాసిన 'కితాబిల్ మక్నునిన్' అనే పారసీ పుస్తకంలో రాయడం విశేషం. అయితే ఉపనిషత్తులు ప్రధానంగా ప్రతిపాదించింది 'అద్వైతమేనని' సర్వులూ అంగీకరించారు. శంకరభగవత్పాదులు దీనిని నిరూపించారు. కనుక ధార్మికైక్యతకు, సర్వమానవ తాత్త్వికచింతనకు పట్టుగొమ్మగా నిలిచినవి ఉపనిషద్గ్రంథాలు అని ఘంటాపథంగా చెప్పవచ్చు.

## అనుబంధము

### ఉపనిషత్తులు (108)

| | | |
|---|---|---|
| ఈశావాస్యోపనిషత్ | కేశోపనిషత్ | కఠోపనిషత్ |
| ప్రశ్నోపనిషత్ | ముండకోపనిషత్ | |
| మాండూక్యోపనిషత్ | | |
| తైత్తిరీయోపనిషత్ | ఐతరేయోపనిషత్ | ఛాందోగ్యోపనిషత్ |
| బృహదారణ్యకోపనిషత్ | శ్వేతాశ్వతరోపనిషత్ | |
| బ్రహ్మబిందూపనిషత్ | | |
| కైవల్యోపనిషత్ | జాబాలోపనిషత్ | హంసోపనిషత్ |

| | | |
|---|---|---|
| ఆరుణికోపనిషత్ | గర్భోపనిషత్ | |
| నారాయణోపనిషత్ | | |
| అమృతనాదోపనిషత్ | బ్రహ్మోపనిషత్ | |
| మహానారాయణోపనిషత్ | | |
| మైత్రేయ్యుపనిషత్ | కౌషీతకీబ్రాహ్మణోపనిషత్ | |
| బృహజ్జాబాలోపనిషత్ | | |
| నృసింహపూర్వతాపిన్యుపనిషత్ | నృసింహోత్తరతాపిన్యుపనిషత్ | |
| కాలాగ్నిరుద్రోపనిషత్ | మైత్రేయ్యుపనిషత్ | |
| సుబాలోపనిషత్ | క్షురికోపనిషత్ | యంత్రికోపనిషత్ |
| సర్వసారోపనిషత్ | తేజోబిందూపనిషత్ | |
| నాదబిందూపనిషత్ | | |
| ధ్యానబిందూపనిషత్ | బ్రహ్మవిద్యోపనిషత్ | యోగతత్వోపనిషత్ |
| ఆత్మబోధోపనిషత్ | నారదపరివ్రాజకోపనిషత్ | |
| త్రిశిఖబ్రాహ్మణోపనిషత్ | సీతోపనిషత్ | |
| యోగచూడామణ్యుపనిషత్ | | |
| నిర్వాణోపనిషత్ | మండలబ్రాహ్మణోపనిషత్ | |
| దక్షిణామూర్త్యుపనిషత్ | శరభోపనిషత్ | |
| స్కంధోపనిషత్ | త్రిపాద్విభూతిమహానారాయణోపనిషత్ | |
| అద్వయతారకోపనిషత్ | రామరహస్యోపనిషత్ | |
| రామపూర్వతాపిన్యుపనిషత్ | రామోత్తరతాపిన్యుపనిషత్ | |
| వాసుదేవోపనిషత్ | ముద్గలోపనిషత్ | |
| శాండిల్యోపనిషత్ | పైంగలోపనిషత్ | |
| భిక్షుకోపనిషత్ | మహోపనిషత్ | |
| శారీరకోపనిషత్ | యోగశిఖోపనిషత్ | |
| తురియాతీతోపనిషత్ | సన్యాసోపనిషత్ | |
| పరమహంసపరివ్రాజకోపనిషత్ | అక్షమాలోపనిషత్ | |
| అవ్యక్తోపనిషత్ | ఏకాక్షరోపనిషత్ | |
| అన్నపూర్ణోపనిషత్ | సూర్యోపనిషత్ | |
| అక్ష్యుపనిషత్ | అధ్యాత్మోపనిషత్ | |
| కుండికోపనిషత్ | సావిత్ర్యుపనిషత్ | |
| ఆత్మోపనిషత్ | పాశుపతబ్రహ్మోపనిషత్ | |
| పరబ్రహ్మోపనిషత్ | అవధూతోపనిషత్ | |
| త్రిపురాతాపిన్యుపనిషత్ | దేవ్యుపనిషత్ | |
| త్రిపురోపనిషత్ | కఠరుద్రోపనిషత్ | |
| భావనోపనిషత్ | రుద్రహృదయోపనిషత్ | |
| యోగకుండిన్యుపనిషత్ | భస్మజాబాలోపనిషత్ | |

రుద్రాక్షజాబాలోపనిషత్ గణపత్యుపనిషత్
జాబాలదర్శనోపనిషత్ తారసారోపనిషత్
మహావాక్యోపనిషత్ పంచబ్రహ్మోపనిషత్
ప్రాణాగ్నిహోత్రోపనిషత్ కృష్ణోపనిషత్
యాజ్ఞవల్క్యోపనిషత్ గోపాలపూర్వతాపిన్యుపనిషత్
గోపాలోత్తరతాపిన్యుపనిషత్ వరాహోపనిషత్
శాట్యామనీయోపనిషత్ హయగ్రీవోపనిషత్
దత్తాత్రేయోపనిషత్ గరుడోపనిషత్
కలిసంతరణోపనిషత్ సరస్వతీరహస్యోపనిషత్
బహ్వృచోపనిషత్ ముక్తికోపనిషత్

## లోకములు (14)

| | | |
|---|---|---|
| భూలోకః | భూవర్లోకః | సువర్లోకః |
| మహాలోకః | జనలోకః | తపోలోకః |
| సత్యలోకః | అతలలోకః | వితలలోకః |
| సుతలలోకః | తలాతలలోకః | రసాతలలోకః |
| మహాతలలోకః | పాతాళలోకః | |

## సప్తసముద్రములు (7)

| | | |
|---|---|---|
| లవణసముద్రము | ఇక్షుసముద్రము | సురాసముద్రము |
| సర్పిస్సముద్రము | దధిసముద్రము | క్షీరసముద్రము |
| శుద్ధోదకసముద్రము | | |

## సప్తద్వీపములు (7)

| | | |
|---|---|---|
| జంబూద్వీపము | ప్లక్షద్వీపము | కుశద్వీపము |
| క్రౌంచద్వీపము | శాకద్వీపము | శాల్మలీద్వీపము |
| పుష్కరద్వీపము | | |

## నవఖండములు (9)

| | | |
|---|---|---|
| ఇంద్రఖండము | కశేరుఖండము | తామ్రఖండము |
| గభస్తిఖండము | పున్నాగఖండము | గంధర్వఖండము |
| సౌమ్యఖండము | వరుణఖండము | భరతఖండము |







# 'శ్రీమద్రామాయణ సందేశము'

భారతీయ సనాతన సంస్కృతికి ఆధారాలు వేదాలు. వేదాలలో ఉన్న భాష అతిప్రాచీనమైనది కనుక విద్వాంసులకు అయినా వేదాలను అర్థం చేసుకోవటం అంత సులభంగా సాధ్యమయ్యే పని కాదు. మానవులలోని అల్పజ్ఞత్వమును, అలసత్వమును, అల్పాయుష్షును గుర్తించిన మాననీయ మహత్తర మహర్షులు వేదసారాన్ని, వేదాలలో దాగిఉన్న నీతి, ధర్మతత్త్వాదులను, విధినిషేధాలను, శుభాశుభాలను, కర్తవ్యఅకర్తవ్యాలను అందరికి సుబోధాలు చేయడానికి లౌకిక సంస్కృతభాషలో ఆదర్శకథా, ఉపాఖ్యానాలతో కూడిన అనేక గ్రంథాలను రాయడం మొదలుపెట్టారు. వేదసారాన్ని అందరికీ పంచడమే వారి ప్రధానోద్దేశం. ఆ విధంగా లౌకిక సంస్కృతభాషలో మొట్టమొదట కావ్యరచన సాగించినవారు వాల్మీకిమహర్షి. అందువల్లనే సంస్కృతసాహిత్య జగత్తులో వాల్మీకిని ఆదికవి అని, ఆయన రచించిన శ్రీమద్రామాయణాన్ని ఆదికావ్యమని అన్నారు.

పురాణాలను శోధించి చూస్తే వాల్మీకి బ్రహ్మదేవుని అంశగా కనబడతారు.[1] వాల్మీకి ఒక బోయవాడు, మృగాలను వేటాడి చంపి అమ్మి బతికేవాడు అని లోకకథనం. కాని లోకానికి దారిచూపే ఒక అసామాన్య గ్రంథాన్ని అందించినవారు ఇలాంటి నీచమైన పనులు చేశారంటే మనస్సు అంగీకరించదు. అలా చేయటానికి గల కారణాలు సమన్వయాత్మకదృష్టితో చూస్తే అవగతమవుతాయి. స్కాంధపురాణంలో, అవంతీఖండంలో వాల్మీకి చరితాన్ని వ్యాసులవారు వర్ణించారు. త్రేతాయుగంలో కౌశికసగోత్రంలో జన్మించిన అగ్నిశర్మ అనే బ్రాహ్మణుడు భయంకర క్షామం ఏర్పడిన సమయంలో కుటుంబపోషణకు వేరే మార్గాలు లేక అరణ్యాలు పట్టుకొని తిరుగుతున్నప్పుడు ప్రారబ్ధకర్మవల్ల దుష్టులైన దొంగలతో స్నేహం ఏర్పడింది. ప్రారబ్ధభోగం కోసం దొంగతనాలు చేస్తూ హింసామార్గంలో తిరుగుతూ, తాను బ్రాహ్మణుడిని అనే మాట మరిచాడు.[2] ఒకరోజు దైవికంగా సప్తఋషులు తారసపడగా వారిని బెదిరించి దొంగతనం చేయాలని ప్రయత్నించగా అత్రిమహర్షి ఆ అగ్నిశర్మతో 'ఈ వస్తువులతో నీవు ఎవరిని పోషిస్తావు? ఈ పాపాన్ని ఎవరు అనుభవిస్తారు?'

[1] "వాల్మీకిరభవద్బ్రహ్మావాగభూత్తస్యరూపిణీ" - స్కాంధ

[2] 'స్మృతిర్నష్టాగతా వేదాః గతంగోళంగతాశ్రుతిః - (స్కాందం)

వేదాలు

గీతోపదేశం వేదాలు

ఇతిహాసాలు

పురాణాలు

ఉపనిషత్

అని ప్రశ్నించాడు. దానికి సమాధానంగా 'నాకు తల్లి, తండ్రి, కుమారుడు, భార్య ఉన్నారు. ఈ వచ్చే ధనంతో వాళ్లను పోషిస్తాను' అని చెప్పగా అత్రిమహర్షి, 'మిమ్మల్ని పోషించుకోవడానికి నేను చేసిన సంపాదనలో పాపముంటే అది ఎవరికి వస్తుందో చెప్పమను. వారికి సంబంధము లేదని చెబితే నువ్వు ఈ పాపం చెయ్యకు' అని చెప్పగా, కించిత్ జ్ఞానోదయం అయిన అగ్నిశర్మ ఇంటికి వెళ్లి అడగగా... వారంతా ఏకకంఠంతో 'ఈ పాపంతో మాకు ఎటువంటి సంబంధం లేదు. నీవు ఏమి చేసి సంపాదించుచున్నావో మాకవసరం లేదు. నీ పాపపుణ్యాలు నీవే ఆలోచించుకోవాలి' అని అన్నారు. అది విన్న అగ్నిశర్మ బాధపడి సప్తఋషులకు విషయం చెప్పగా, దయాసముద్రుడైన అత్రిమహర్షి సర్వపాపాల నివారణ కొరకై అతనికి ఒక ధ్యానయోగాన్ని ఉపదేశించాడు. ఒక చెట్టుక్రింద కూర్చుని, జపించమని ఆదేశించి వెళ్లిపోయాడు. 13 సం.ల తర్వాత సప్తఋషులు తిరిగి వెడుతుండగా ఒక పెద్దపుట్టలో కూర్చొని తపస్సు చేస్తున్న అస్థిరూపంలో ఉన్న అగ్నిశర్మ కనిపించాడు. మహర్షులు అనుగ్రహించగా, లేచి అగ్నిశర్మ వారిని స్తుతించాడు. 'మా ఉపదేశంతో సంపూర్ణధ్యానయోగాన్ని పొంది దృఢచిత్తుడవై ఒకే నియమంతో పుట్టలో చిరకాలం కూర్చున్నావు కనుక 'వాల్మీకి'గా ప్రసిద్ధిని పొందగలవు'[3] అని చెప్పి ఋషులు వెళ్లిపోయారు. ఆ తర్వాత కుశస్థలీ అనే ప్రాంతానికి వెళ్లి, పరమశివుని విశేషంగా అర్చించి శివానుగ్రహంతో రామాయణం రచించినట్లు స్కాంధపురాణంలో స్పష్టమైన ప్రస్తావన ఉంది. అందువల్ల లోకంలో చెప్పుకునే కథకు ఈ కథకు సంబంధం లేదు. అత్రిమహర్షి ఉపదేశించిన ధ్యానయోగం శివమంత్రమని, అందువల్లనే నారదుడు వచ్చి రామాయణాన్ని ఉపదేశించాడని, శివాభిన్న విష్ణు స్వరూపమే రామస్వరూపమని మనకు తెలుస్తున్నది.

వాల్మీకి మహర్షి రామాయణాన్ని మూడు పేర్లతో వ్యవహరించవచ్చని తెలిపాడు.

'కావ్యం రామాయణంకృత్స్నం - సీతాయాశ్చరితం మహత్
పౌలస్త్యవధ మిత్యేవ చకార చరితవ్రతః'

లోకోత్తరుడయిన శ్రీరాముని ఆదర్శచరిత్రను చెబుతున్నది కనుక ఇది 'రామాయణం'. సౌశీల్య సౌజన్య చరిత్రతో ఆదర్శభూత అయిన సీతాదేవి పవిత్రచరిత్రను వర్ణించినందువల్ల 'సీతాచరితం', లోకకంటకుడై అధర్మవర్తనుడైన రావణుని కథను చెప్పడంవలన 'పౌలస్త్యకథ'.

### 1. శ్రీరామ అవతారకాలం

సృష్టికర్త బ్రహ్మకు 30 కల్పాలు . ఈ కల్పాలలో శ్వేతవరాహకల్పంలో, ఏడవదైన వైవస్వత మన్వంతరంలో, 24వ మహాయుగంలో త్రేతాయుగం చివర శ్రీరాముడు అవతరించాడని మహాత్ముల పరిశోధనలవల్ల తెలుస్తున్నది. 24వ మహాయుగంలో సంధి, సంధ్యంశలలో, అనగా త్రేతాయుగంలో 30వేల సంవత్సరాలు మిగిలిఉండగా శ్రీరామమూర్తి అవతరించాడు. అలాగే ప్రతి మహాయుగానికి ఒక వ్యాసస్థానాన్ని నిర్దేశించారు. 24వ మహాయుగంలో అధికారిక వ్యాసుడు వాల్మీకిమహర్షి అని

[3] **'వల్మీకౌ అస్మిన్‌స్థితః పుత్ర యతస్త్వమేక చిత్తతః'
వాల్మీకిరితి తేనామ భువిఖ్యాతం భవిష్యతి.'**



విష్ణుపురాణంలో ఉంది. వాల్మీకి మహర్షి శ్రీరాముడు అవతరించి రావణ, కుంభకర్ణసంహారం చేసిన తర్వాత, పట్టాభిషిక్తుడైన తర్వాతే రామాయణాన్ని రచించినట్లు తెలుస్తోంది.

ఇలా విచారించగా 28 మహాయుగంలోని ప్రస్తుత కలియుగానికి పూర్వం ఒక కోటి 81 లక్షల 47 వేల సంవత్సరాలకు ముందు రామావతారం జరిగినట్లు ఊహించబడుతోందని ప్రసిద్ధ పౌరాణిక సార్వభౌములు మల్లాది చంద్రశేఖరశాస్త్రిగారు సప్రమాణికంగా నిరూపించారు.

కోటి సంవత్సరాల కింద జరిగిన రామాయణాన్ని చదివితే ప్రస్తుతకాలానికి ప్రయోజనమేమిటన్న ప్రశ్న ప్రధానంగా ఉత్పన్నమవుతుంది. దీనిని సప్రమాణంగా పరిశీలిద్దాం. ఈ జగత్తులో మానవజాతి ఉత్తమమైన మనుగడకు దోహదం చేసే వివిధ వ్యవస్థలను, మర్యాదలను ఆదర్శవంతంగా ఆచరించి చూపించడానికి పరమాత్మ శ్రీరామావతారాన్ని కల్పానికి ఒకసారి పొందుతాడు. అవతారాలలో రామావతారం ప్రధానంగా మానవుల శిక్షణ కోసం వచ్చిందని శ్రీమద్భాగవతంలో శుకుడంటాడు.[4] రాముడు భారతీయులకు మాత్రమే కాక ప్రపంచమంతటికీ ఆదర్శం. ప్రపంచమంతటికీ ఒక కొత్త వెలుగును ప్రసాదించిన గ్రంథం మన రామాయణం.

**2. రామాయణం ప్రాచీనత**

ప్రపంచంలోవే రామాయణం ఆదికావ్యం అని చెప్పుకుంటున్నాం. కారణం ఏమిటంటే పాణిని వ్యాకరణంలో కోసల, కౌసల్యా, కేకయ, వైశ్రవణ, వాల్మీకి వంటి శబ్దాలకు వ్యుత్పత్తులు చెప్పబడ్డాయి. బౌద్ధుల దశరథ జాతకం, సామజాతకం, వెస్సంతర జాతకం, లంకావతార సూత్రాలలో రామకథ ఉంది. క్రీ.శ. ప్రథమశతాబ్దిలో జైనకవి విమలసూరి రామకథగల 'ప - ఉమ - చరి త' (పద్మచరిత)ను రాశారు. బౌద్ధుల అవధానకథలో రామకథను క్రీ.శ. 472లో చైనా భాషలోకి పరివర్తనం చేశారు. భారత అరణ్యపర్వంలో రామోపాఖ్యానాన్ని క్రీ.శ. 700లో టిబెట్‌భాషలో రచించారు. ప్రపంచంలో ప్రాచీన దేవాలయమూ, పెద్దదీ అయిన అంకోర్‌వాట్ దేవాలయ ప్రాంగణంలో రామాయణగాథాశిల్పం చెక్కారు. ఋగ్వేదంలో రామాయణకథ ప్రస్తావన ఉంది. ఈ విధంగా శ్రీరామాయణం భారతీయ వైదిక ధర్మానుయాయులకే కాక జైన, బౌద్ధాది నాస్తికులకు, విదేశీయులకు ఆదరణీయమైంది. క్రీస్తుశకం ఆరంభానికి ముందే జావా, సుమత్రా, కాంబోడియా, లావోస్, వియత్నాం, మలేసియా మొదలైన సుదూరదేశాలలో రామాయణం వ్యాపించిందని చరిత్రకారులు రాశారు.

**3. శ్రీమద్రామాయణఅవతరణం**

'తపస్స్వాధ్యాయనిరతం తపస్వీవాగ్విదాంవరమ్
నారదం పరిపప్రచ్ఛ వాల్మీకిర్మునిపుంగవమ్'

'వర్తమానకాలంలో, ఈ లోకంలో ఉత్తమోత్తమమైన గుణవంతుడు, వీర్యవంతుడు, ధర్మజ్ఞుడు, కృతజ్ఞుడు, సత్యవ్రతుడు, ప్రియదర్శనుడు, ఆత్మవంతుడు,

---

[4] 'మర్త్యావతారః ఖలు మర్త్యశిక్షణం రక్షోవధాయైవ న కేవలం హరేః'

అసూయారహితుడు, తన కోపంతో దేవతలను సైతం భయపెట్టే మహాశక్తిసంపన్నుడైన పురుషుడెవరైనా ఉన్నాడా అని వాల్మీకిమహర్షి నారదుని ప్రశ్నించాడు. అప్పుడు నారదమహర్షి అటువంటి సుగుణాలన్నీ ఇక్ష్వాకువంశ ప్రభువైన శ్రీరామచంద్రుడిలో ఉన్నాయని చెప్పి, శ్రీరామాయణకథను సంక్షిప్తంగా నూరు శ్లోకాలలో చెప్పి వెళ్లిపోతాడు. ఈ కథను మనస్సులో స్మరిస్తూ తమసా నదీతీరానికి శిష్యసమేతుడుగా వెళ్లిన వాల్మీకి, అక్కడ క్రౌంచపక్షుల జంటలో మగపక్షిని చెట్టుచాటునుండి కొట్టిన ఒక విషాదకరసంఘటనలో ఒక కిరాతకుడిని తనకు తెలియకుండానే శపిస్తాడు. ఆ సమయంలో వాల్మీకి నోటినుంచి వచ్చిన వాక్ప్రవాహాన్ని శిష్యుడైన భరద్వాజుడు కంఠస్థం చేసి రాయగా అది సరిగ్గా అనుష్టుప్ ఛందస్సులో ఉంది.[5] ఇంటికి వచ్చిన వాల్మీకి దగ్గరకు బ్రహ్మదేవుడు వచ్చి, నా ఆదేశానుసారంగానే నీ నోట ఈ వాక్కు వెలువడింది, నారదుపదేశంగా లభించిన చరిత్రను తనివితీరా వర్ణించు. శ్రీరామచంద్రుని పవిత్ర చరిత్రను లౌకికభాషలో సంతరించు. అందువల్ల నీకు బ్రహ్మలోక ప్రాప్తి కలుగుతుంది. నీవు రచించిన పవిత్రమైన రామకథ ఆచంద్రార్కం ఈ భూలోకంలో ప్రచారంలో ఉండగలదు అని చెప్పి వెళ్లిపోతాడు. శోకరూపంలో బయటకు వచ్చిన వాల్మీకి అంతరంగం శ్లోకరూపాన్ని సంతరించుకొని, మానవుల శోకాన్ని పోగొట్టటానికి శ్రీమద్రామాయణరూపంలో ఈ అఖండ భారతావనిలో అవతరించింది.

**శ్రీమద్రామాయణ రచనావిధానం**

శ్రీమద్రామాయణాన్ని వాల్మీకి మహర్షి అనుష్టుప్ ఛందస్సులో, 24 వేల శ్లోకాలలో 500 సర్గలు, 7 కాండలుగా, ఉపాఖ్యానాలతో రచించాడు. రామాయణం లోకంలో ప్రాచుర్యం పొందడానికి సర్వోత్కృష్టమైన గాయత్రీ మంత్రాన్ని[6] స్వీకరించి 24 బీజాక్షరాలను ప్రతి వెయ్యి శ్లోకాలకు ఒకటి చొప్పున వేసి 24వేల శ్లోకాలు రచించడం కారణం. శ్రీమద్రామాయణంలోని కాండలకు 1) బాలకాండ, 2) అయోధ్యకాండ, 3) అరణ్యకాండ, 4) కిష్కింధాకాండ, 5) సుందరకాండ, 6) యుద్ధకాండ 7) ఉత్తర కాండ అని పేర్లు పెట్టడం జరిగింది. రామాయణకథ సహజరమణీయం. దానిని కూర్చటంలో మహర్షి ప్రదర్శించిన కౌశలం నాన్యతోదర్శనీయమని దివాకర్లవారి మాట. ప్రతి కాండలో అనేక విశేషాలు, మొదటినుండి చివరివరకు ఉత్కంఠ రేకెత్తించే సన్నివేశాలతో కూడి, పఠించేవారికి అవిచ్ఛిన్నమైన ఆనందాన్ని కలిగిస్తుంది. ఒక్కొక్క కాండలో ఉన్న ప్రత్యేకతలేమిటో ఒకసారి ఆలోకిద్దాం.

**1. బాలకాండ**

శ్రీరాముడి బాల్యలీలావిశేషాలను వర్ణించిన కాండ కావడంవల్ల దీనికి వాల్మీకి బాలకాండ అనే పేరు పెట్టాడు. రాముడి జన్మంనుండి పరిణయం వరకు ఈ కాండలో వర్ణించాడు. వాల్మీకి మహర్షి రామాయణాన్ని రచించి, దానిని ప్రచారం చేయటానికి

---

[5] మానిషాదప్రతిష్ఠాంత్వమగమ శ్శాశ్వతీ స్స మాః
యాత్క్రౌంచ మిథునాదేక మవధీః కామమోహితమ్॥

[6] గాయత్ర్యాః మంత్రం న మాతుః పరదైవతమ్.

మొదట శ్రీరామకుమారులైన లవకుశులకు నేర్పారు. ఆ విధంగా రామాయణాన్ని మొదట గానం చేసింది లవకుశులు. అయితే శ్రవణం చేసింది ఎవరు అనే సందేహం కలుగుతుంది. రామాయణాన్ని మొదట శ్రవణం చేసినవాడు శ్రీరామచంద్రుడే. లవకుశులు గానం చేస్తే రాముడు వింటున్నట్లుగా మనకు ఈ కావ్యంలో కథ మొత్తం తెలుస్తుంది.

కోసలదేశంలో అయోధ్యను రాజధానిగా చేసుకొని దశరథుడు పరిపాలిస్తున్నాడు. ఇతరులు జయించటానికి వీలులేని పట్టణమే అయోధ్య. 12 యోజనాల పొడవు, 3 యోజనాల వైశాల్యం కలదై చక్కని రాజమార్గాలతో అది శోభిస్తోంది. సంతానం లేని దశరథుడు తన మంత్రి సుమంత్రుడి ప్రేరణతో వశిష్ఠుడి ఆజ్ఞతో అశ్వమేధయాగం చేస్తాడు. బాలకాండలో అశ్వమేధయాగం వర్ణన విశేషంగా ఉంది. భారతభూమి కర్మభూమి. యజ్ఞాలు చేయడంవల్ల వర్షాలు కురుస్తాయని మన విశ్వాసం. ఈ యజ్ఞభావన భారతీయ ఋషుల ఉదారచింతనకు, లోకకళ్యాణ ఆకాంక్షకు, మహోన్నతమైన ఆధ్యాత్మికవిచారానికి ప్రతీక. దశరథుడు సంతానరహితుడై సర్వపాప ప్రాయశ్చిత్తార్థం అశ్వమేధయాగాన్ని చేశాడు. భారతీయులందరిలో సంతానలోపానికి కారణం జన్మాంతరంలో, లేదా ఈ జన్మలో చేసిన ప్రబలమైన పాపమని భావిస్తారు. అందుకే దశరథుడు సంతాన విషయమై పుత్రకామేష్టి చేయాలి కాని, దానికి ముందుగా పాపాన్ని పోగొట్టే అశ్వమేధయాగం చేసి, అవబృధస్నానంతో పునీతుడై అప్పుడు ఋష్యశృంగమహర్షిని 'కులవర్ధనమగు' క్రతువును చేయించమని ప్రార్థించాడు.[7]

మనువు మానవజీవితంలో ముఖ్యమైన ప్రయోజనాలను నాల్గింటిని పేర్కొన్నాడు. అవి 1) వేదాధ్యయనం అనగా బ్రహ్మచర్యాశ్రమం 2) సుతోత్పాదనం 3) గృహస్థాశ్రమం (యజ్ఞయాగాదులు ఆచరించడం) 4) మోక్షప్రాప్తికి సాధన చేయడం (వానప్రస్థ, సన్యాస ఆశ్రమాలు). వీటన్నింటిని రామాయణంలో వాల్మీకి మహర్షి వివరించాడు. భారతీయులు పరలోకాన్ని గాఢంగా విశ్వసిస్తారు. సంతానహీనులైనవారికి ఉత్తమలోకాలు లభించవని తలుస్తారు. అందుకే వివాహసంకల్పంలో కూడ 'ధర్మప్రజాసంపద్యర్థం స్త్రియముద్వహేత్' అంటే ధర్మరూపమైన సత్సంతానం కోసమే వివాహమని చెప్పారు. వేదం ఈ విషయాన్నే ప్రతిపాదిస్తోంది.[8] అటువంటి గృహస్థాశ్రమ ప్రాధాన్యతను బాలకాండలో వాల్మీకి మహర్షి వివరించాడు.

దశరథుని ప్రార్థనపై ఋష్యశృంగమహర్షి అధర్వశిరఃప్రోక్తాలైన మంత్రాలతో పుత్రకామేష్టిని వైభవంగా చేయించాడు. దేవతలంతా తమ హవిస్సులకోసం వచ్చారు. ఆ తర్వాత దివ్యాభరణభూషితుడై, ప్రజాపతిచే పంపబడ్డ ప్రాజాపత్యపురుషుడు యజ్ఞకుండంలో ఆవిర్భవించి దివ్యపాయసపాత్రను దశరథుడికిచ్చి, 'నీకు అనుకూలవతులైన భార్యలతో దీనిని సేవింపచేస్తే సంతానం కలుగుతుంది' అని చెప్పి అంతర్ధానమయ్యాడు. ఈ ఘట్టం వల్ల మనకు తెలిసేదేమిటంటే, వైదిక కర్మకాండ శాస్త్రోక్తవిధిగా చేసినట్లయితే దాని ఫలితం సత్వరమే కలుగుతుంది.

---

[7] **కులస్యవర్ధనం త్వంతు కర్తుమర్హసి సువ్రత.**

[8] **ప్రజననం వై ప్రతిష్ఠాలోకే సాధు ప్రజయాస్తంతుం తన్వానః పితౄణామ**

దశరథమహారాజు ఆ పాయసంలో మహాభాగాన్ని కౌసల్యకు ఇచ్చాడు. ఆ భాగంనుంచి కొద్ది భాగాన్ని తీసి సుమిత్రకు ఇప్పించాడు. కౌసల్యకు ఇవ్వగా మిగిలిన భాగాన్ని, కౌసల్యా భాగానికి కొంత తక్కువభాగాన్ని కైకేయికి ఇప్పించాడు. మిగిలిన భాగంలో సగభాగాన్ని కైకేయిచేత సుమిత్రకు ఇప్పించాడు. ఈ పాయస విభాగంవల్ల పరిపూర్ణ విష్ణుస్వరూపంగా శ్రీరాముడు, అంశలుగా భరతలక్ష్మణశత్రుఘ్నులు ఆవిర్భవించారు. విళంబినామసంవత్సర ఉత్తరాయణ వసంత ఋతు చైత్రమాస శుక్ల నవమీ పునర్వసు నక్షత్రయుక్త అభిజిత్‌సహిత కర్కాటక లగ్నంలో, ప్రధాన గ్రహాలు ఐదు ఉచ్చస్థాయిలో ఉండగా గురుచంద్ర సంయోగంలో శ్రీరామచంద్ర జననం జరిగింది. భరతుడు పుష్యమీ నక్షత్రంలో, లక్ష్మణుడు, శత్రుఘ్నుడు ఆశ్లేషా నక్షత్రంలో జన్మించారు. తర్వాత సకల విద్యాబుద్ధులు గ్రహించిన శ్రీరామభరత లక్ష్మణశత్రుఘ్నులకు దశరథుడు వివాహం గురించి ఆలోచిస్తూ ఉండగా విశ్వామిత్రమహర్షి వస్తాడు. శ్రీరామజననం, విశ్వామిత్ర ఆగమనం, ఈ రెండు ఘట్టాలు 18వ సర్గలో వర్ణించడాన్ని బట్టి సీతారామకళ్యాణాన్ని వీలైనంత తొందరగా జరిపి, శ్రీరామ అవతార ప్రత్యేకతను లోకానికి చాటాలనే కవిహృదయం కనిపిస్తుంది. మహాభారతంలో ఉన్నన్ని ఉపాఖ్యానాలు రామాయణంలో లేవు. కాని ఉన్న ఉపాఖ్యానాలు మొత్తం బాలకాండలో ఉండటం విశేషం. శ్రీరాముడియందు దశరథుడి పుత్రవాత్సల్యం, బ్రహ్మర్షి విశ్వామిత్రుడి యందు రాముడి భగవత్తత్త్వజ్ఞానం[9], ఆ రెండింటికీ సంఘర్షణాత్మకమైన స్థితి, చివరకు విశ్వామిత్రుడి భగవత్‌జ్ఞానం రామలక్ష్మణులను వెంట తీసుకువెళ్ళటం, విశ్వామిత్రుడు రామలక్ష్మణులకు కుమారస్వామి వృత్తాంతం, గంగావతరణం మొదలైన కథలు చెప్పటం, తాటకిని, సుబాహుని చంపి, మారీచుని పారద్రోలి యజ్ఞాన్ని పూర్తిచేయడం, జనకుని యాగానికి వెళ్లడంతో కథ పతాకస్థాయికి వెడుతుంది. అక్కడ శతానందుడు విశ్వామిత్రుడి కథను చెప్పటంలో చక్కని ఉపదేశం కనిపిస్తుంది. సామాన్యమానవులకు, జితేంద్రియులైన మహర్షులకు గల భేదాన్ని ఆ కథలో చక్కగా ప్రదర్శించారు. మానవులు ఒక్కసారి కామపరవశులయినట్లయితే దానినుంచి బయటపడడం చాలా అరుదు. మహర్షులు అలా కాదు. ఒకసారి దానికి వశులయినప్పటికీ వెంటనే తెలుసుకొని నిగ్రహం వహించి, లక్ష్యసిద్ధిని పొందుతారు. అలాగే అహల్య శాపకథలో శ్రీరాముడి భగవత్తత్త్వం పరిపూర్ణంగా నిరూపించబడింది. ఆ తర్వాత శివధనుర్భంగం, సీతారామకళ్యాణం వంటి అద్భుతమైన ఘట్టాలను వర్ణించారు. భారతీయ సనాతన సంప్రదాయంలో వివాహానికి చాలా ప్రాధాన్యత ఉంది. దానిని మహర్షి చక్కగా విశదీకరించాడు. ప్రాజాపత్యవివాహ వైశిష్ట్యాన్ని చూపించాడు. ఉత్తరఫల్గునీనక్షత్రంలో సీతారామకళ్యాణం జరిగింది. సీతారామకళ్యాణంతోపాటు మాండవీ-భరతుడు, ఊర్మిళా-లక్ష్మణుడు, శ్రుతకీర్తి-శత్రుఘ్నుల కళ్యాణం జరిగింది. ఆ తర్వాత పరశురాముడు రావడం, ఆయనకు గర్వభంగం జరగడం, పరశురాముడిలోని

[9] **అహంవేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమమ్**

**వశిష్ఠోపి మహాతేజా యేచేమే తపసిస్థితాః॥ (19-74 బాల)**

ఆవేశాన్ని రాముడు స్వీకరించడం, పరశురామ అవతార సమాప్తిని వాల్మీకి చూపించాడు. తర్వాత సీతారాముల దాంపత్యవైభవాన్ని వర్ణించాడు. దీనితో బాలకాండ ముగుస్తుంది.

సీత రామునికి ప్రియురాలు. తండ్రిచేత నిర్ణయించబడిన భార్య కావడంవల్ల, పాతివ్రత్యసద్గుణాలవల్ల, సౌందర్య సౌకుమార్యాలవల్ల ఆమె రామునికి ప్రీతిపాత్రమైనదని వర్ణించాడు. ఆర్షధర్మంలో తండ్రిచేత నిర్ణయింపబడ్డ ఉత్తమకన్యను వివాహం చేసుకోవడంవల్ల ప్రేమ ప్రారంభమై, ఆమె సద్గుణాలచేత, ప్రవర్తనచేత, సౌందర్యంచేత ప్రేమ పెరగడం శ్రీరామకళ్యాణంలో వాల్మీకిమహర్షి చూపిన శాస్త్రసమ్మత మార్గం. ఇదే సీతారాముల ఆదర్శదాంపత్యధర్మం. దీనిని సమస్త మానవులు అనుసరించాలని కవిహృదయం. కేవలం సౌందర్యంతో ప్రేమ ప్రారంభమైతే ఆ సౌందర్యం నశిస్తే ప్రేమ పోతుంది. సీతారాములు చూపిన మార్గమే స్థిరమైన, సుఖమైన సంసారజీవనానికి ప్రధానమన్న మహనీయసందేశాన్ని వాల్మీకి బాలకాండలో అందించాడు.

**2. అయోధ్యాకాండ**

సీతారాముల వివాహానంతరం 12 సం.లు అయోధ్యలో గడిపిన తర్వాత శ్రీరామపట్టాభిషేక ప్రయత్నాన్ని వివరించబోతూ వాల్మీకి మహర్షి అయోధ్యకాండను ప్రారంభించాడు. శ్రీరాముడు మూర్తీభవించిన ధర్మస్వరూపమని వాల్మీకి అభిప్రాయం.[10] దశరథకుమారుడిగా అవతరించిన పరమాత్మ విలాసాలతో గృహస్థాశ్రమం వరకు అనేక ధర్మాలు ప్రతిపాదించి, అనంతరం గృహస్థ ధర్మాన్ని, రాజ్యాధికారి పాటించవలసిన సకల ధర్మాలను ఈ కాండలో వర్ణించాడు.

మానవప్రవృత్తుల్ని నియమబద్ధం చేయడానికి, అదుపులో ఉంచడానికి శాసన వ్యవస్థ తప్పనిసరి. మనం ఈనాటికీ రామరాజ్యం అంటూ రాముడి రాజ్యపరిపాలనను స్మరించుకుంటాం. రాజు అయ్యేవాడు ఎలా ఉండాలో ఈ అయోధ్యకాండలో మహర్షి వర్ణిస్తాడు. మొదటి సర్గలోనే శ్రీరామగుణాలను వర్ణిస్తాడు. సర్వప్రజలకు శ్రీరాముడు అభిరాముడయ్యాడు. సర్వవిద్యావ్రతస్నాతుడిగా రాముడిని చెప్పటంతోనే మహర్షి దృష్టిలో రాజు ఎలా ఉండాలో మనకు తెలుస్తుంది. రామరాజ్యం నిజమైన ప్రజాస్వామ్యరాజ్యం. దశరథుడు శ్రీరాముని యువరాజుగా నిర్ణయించి పట్టాభిషేకం చేయటానికి మొదట ప్రజలందరినీ సమావేశపరచి వారి వారి అభిప్రాయాలు తెలుసుకున్నాడు. ఆ కాలంలో ఓటుహక్కు ఉండేది. కాని అందరికీ కాదు. ఆర్థికంగా ఇతరులపై ఆధారపడనివారు, విద్యావంతులు, సంస్కారవంతులైనవారికి ఓటిచ్చే సంప్రదాయం ఉండేది. అందరికంటె ముందు ఋషులు రాముని బలపరచారు. మంత్రులు అంగీకరించారు, స్త్రీలు, పురుషులు, పెద్దలు, పిల్లలు, సేనాధిపతులు ఇలా ప్రతి ఒక్కరూ రాముని రాజుగా చూడాలని కలలు కన్నారు. ఎందుకంటే రాముడిలో ఉన్న గుణాలు ఇతరులలో లేవు.

[10] రామో విగ్రహవాన్ ధర్మః

యావత్ప్రజలు ఏకగ్రీవంగా రాముని అంగీకరించిన తర్వాత సుమంత్రుడు వెళ్లి రాముని తీసుకొనిరాగా తండ్రి ఈ విషయాన్ని రాముడికి చెబుతాడు. రాముడు పట్టాభిషేకానికి సిద్ధం కాగా, మంథర అనే ఒక దాసి కైకేయికి దుర్బోధలు చేసి ఆమె మనస్సును మార్చి యువరాజ్య పట్టాభిషేకాన్ని భంగపరస్తుంది. ఈ ఘట్టం ద్వారా, దుస్సంగం త్యజించాలనీ,[11] చెప్పుడు మాటలు వినకూడదనీ వాల్మీకి బోధించాడు. 14 సం.లు అరణ్యవాసానికి తండ్రి ఆజ్ఞాపించగా రాముడు మనస్ఫూర్తిగా రాజ్యాన్ని త్యజించి నారచీరలు ధరించి అరణ్యవాసానికి సిద్ధపడతాడు. సుఖదుఃఖాలను సమానంగా చూడడమే కాకుండా, తండ్రి ఆజ్ఞ పరిపాలించే కుమారుడిగా రాముడు అందరికీ మార్గదర్శకుడయ్యాడు. వేదంలోని అంశాలకు చెందిన వాదాలను అయోధ్యాకాండలోని ఈ ఘట్టంలో రాముడు పరిష్కరించడం విశేషం.

శ్రీరాముడు, సీత, లక్ష్మణుడు అరణ్యాలకు వెళ్లగా, పుత్రశోకంతో దశరథుడు మరణిస్తాడు. మేనమామల ఇంటినుంచి భరతుడు వచ్చి తల్లిని, మంథరను నిందించి, తాను కూడా నారచీరలు ధరించి, అరణ్యాలలోకి వెళ్లి శ్రీరామపాదుకలతో తిరిగివచ్చి రాజ్యాన్ని శ్రీరామపాదుకల అనుగ్రహంతో పాలిస్తాడు. రాజధర్మాలతోపాటు, తల్లిదండ్రుల గురించిన విచారణ, దైవం, పురుష ప్రయత్నాల రహస్యం, గుహుడి భక్తి, భరతుడి భక్తి మొదలైనవి సాకల్యంగా వర్ణించి మానవులకు ఎన్నో ఆదర్శమార్గాలు చూపించడం అయోధ్యకాండలో జరిగింది.

**3. అరణ్యకాండ**

శ్రీరామచంద్రుడు ఋషులు చూపించిన మార్గంలో దండకారణ్య ప్రవేశం చేస్తాడు. బ్రహ్మలోకం వలె ఉన్న ఆ అరణ్యంలో మృగాదులనుంచి, రాక్షసులనుండి మహర్షులకు భయాన్ని తొలగించడానికి ధనుస్సుకు అల్లికత్రాడు కట్టాడు. ఆదిగురువయిన ఆ నారాయణుని అవతారమే రామమూర్తి. అందువల్లనే మహర్షులందరూ శ్రీరాముడి రూపాన్ని చూసి ఆనందభరితులయ్యారు. అరణ్యకాండలో శ్రీరాముడి క్షాత్రధర్మపాలనను కవి చిత్రించాడు. ఋషులు రాముడితో 'నీవు రాజువు. ధర్మవ్యవస్థను నిలబెట్టడానికి దండాన్ని ధరించినవాడవు. ధర్మరక్షణం నీ కర్తవ్యం. మేము జితక్రోధులం, దండాన్ని త్యజించినవారం, తపోధనులం. కనుక నిన్ను శరణుజొచ్చుతున్నాం. మమ్ముల్ని ఈ రాక్షసబాధలనుంచి రక్షించు' అని వేడుకున్నారు. శ్రీరాముడు వారికి అభయం ఇచ్చాడు. తర్వాత విరాధుని చంపి, శరభంగమహర్షి ఆశ్రమానికి వెళ్ళగా, అక్కడ దేవేంద్రుడు రాముని దర్శించాడు. ఆ తర్వాత శరభంగుడు తన శరీరాన్ని అగ్నిలో త్యాగం చేసి ఉత్తమలోకాలను పొందిన తర్వాత, ఆ ఆశ్రమవాస ఋషులు రాముని ప్రార్థించగా, వారితో 'మిమ్మల్ని కాపాడడం నా కర్తవ్యం, మీ కోసమే నా తండ్రి ఆజ్ఞతో దండకారణ్యానికి వచ్చాను' అంటూ రాక్షససంహారం చేస్తానని వారికి అభయం ఇచ్చాడు. దీనినిబట్టి రాముని వినీతిత్వం, స్వధర్మనిర్వహణాసక్తి, సత్యపరాక్రమాదులు మనకు తెలుస్తాయి. ఇక్కడ సీతకు,

[11] దుస్సంగస్సర్వదైవత్యాజ్యః స్మృతిభ్రంశ బుద్ధినాశసర్వనాశ హేతుత్వాత్ (నారదుడు)

రామచంద్రుడికి ఈ విషయంలో కొంచెం భేదాభిప్రాయాలు వస్తాయి. వాల్మీకి ఇక్కడ వీరిద్దరి వాదంద్వారా హింసాయుతధర్మాన్ని అనుసరించడమా, లేక అహింసాయుతధర్మాన్ని అనుసరించడమా అన్న విషమప్రశ్నకు పరిష్కారం చూపించాడు.

రాముడు క్షత్రియుడు. క్షత్రియులు ఇతరులను రక్షించడానికే ధనుర్ధారణ చేస్తారు.[12] కనుక లోకకళ్యాణానికి తపస్సు ఆచరించే మునులను బాధిస్తున్న రాక్షసులను సంహరించడమే క్షత్రియుడనైన నాకు ధర్మం అని రాముడు స్వధర్మ ప్రాధాన్యాన్ని వివరించాడు.[13] ఆ విధంగా శ్రీరాముడు 14వేల రాక్షసపరివారాన్ని హతమార్చాడు. పంచవటీప్రాంతంలో నివసిస్తూ వనధర్మాన్ని చక్కగా ఆచరించాడు. అరణ్యకాండలో ఈ పంచవటీవాసం చాలా ప్రత్యేకమైన ఘట్టం. శ్రీరామ-సీతల సంయోగవియోగాలకు వేదిక. శూర్పణఖ ముక్కుచెవులను కోసింది ఇక్కడే. జటాయువును కలిసింది ఇక్కడే. మారీచసంహారం జరిగిందీ ఇక్కడే. సీతా అపహరణం కూడా ఇక్కడే జరిగింది. రామాయణకథకు కేంద్రంగా ఈ సీతాపహరణఘట్టాన్ని వాల్మీకి రచించాడు. రావణుడు త్రిదండిసన్యాసి రూపంలో వచ్చి సీతను అపహరించాడు. శ్రీరాముడు పంచవటీనివాస సమయంలోనే జనస్థానంలో ఉన్న రావణుడి సమస్త పరివారాన్ని సంహరించడం, త్రిలోకకంటకుడైన రావణుడు సీతను అపహరించడం జరిగాయి. శ్రీరాముడు ఉత్తరాన్ని విడిచి దక్షిణభారతదేశం వచ్చి వానరులతో స్నేహం చేసి లంకపై దండయాత్ర చేశాడు.

అరణ్యకాండలో మహాపురుషసందర్శనం, ఋషిజనసేవ, పరమ సత్పురుషులైన తపఃపరాయణులైన, ఋషులను రక్షించడం క్షత్రియుల ధర్మమని శ్రీరాముడు ఆచరణలో చూపిస్తాడు. 'యత్కరోషియదశ్నాసి యజ్జుహోసి, దదాసియత్...' అను గీతావచనాన్ని బట్టి నిష్కామధర్మతపస్సంపన్నులైనవారివద్దకు పరమాత్మ సగుణసాకారుడిగానే రాగలడనే ఆధ్యాత్మికవిశేషాన్ని స్పష్టంగా ప్రదర్శించాడు. అలాగే అరణ్యకాండలో అనేక ధర్మసూక్ష్మాలు కనబడతాయి. తిర్యగ్జంతువు అయిన జటాయువుకు శాస్త్రవిధిగా దహన, తర్పణ, పిండప్రదానాలు చేయడంద్వారా, తిర్యగ్జంతువుల కర్మాధికార ప్రస్తావనను రహస్యంగా దర్శింపచేశాడు. తిర్యగ్జంతువులకు అధికారం లేకపోయినా సమర్థత, జ్ఞానవైశిష్ట్యం కలిగిన తిర్యగ్జంతువులకు కర్మాధికారమున్నట్లు మహర్షి వాల్మీకి రాముడిద్వారా దర్శింపచేయటం అరణ్యకాండలో ప్రధానవిశేషం.

### 4. కిష్కింధకాండ

సీతాపహరణం జరిగిన తర్వాత శ్రీరామలక్ష్మణులు సీతను అన్వేషిస్తూ కిష్కింధ ప్రాంతంలో అడుగు పెడతారు. వీరిద్దరినీ చూసిన సుగ్రీవుడు శంకితుడై హనుమంతుని పంపి వివరాలు సేకరించి, రామలక్ష్మణులుగా నిర్ధారణైన తర్వాత శ్రీరాముడు-సుగ్రీవుడు అగ్నిసాక్షిగా స్నేహం చేసుకున్నారు. ఈ కాండలో మైత్రి వైశిష్ట్యాన్ని

---

[12] 'క్షత్రియైర్ధార్యతే చాపః నార్తశబ్దో భవేదితి.'

[13] స్వధర్మేని ధనం శ్రేయః పరధర్మోభయాపహః
స్వేస్వే కర్మణి భారతస్సంసిద్ధిం లభతే నరః॥

చూపించాడు. ధనవంతుడుగాని, దరిద్రుడుకాని, కష్టపడేవాడుగాని, లేక సుఖపడేవాడు గాని, దోషరహితుడుగాని, దోషయుక్తుడుగాని స్నేహితుడే పరమశరణ్యుడు.[14] మిత్రత్వమనేది వ్యక్తుల పరస్పర అవగాహన, సద్భావనల మీద ఆధారపడి ఉంటుంది. మానవుడు తన కష్టసుఖాలను చెప్పుకోడానికి ఉచితమైన స్థానం మిత్రత్వమే. సుగ్రీవునితో మైత్రి ఏ విధంగా ఇద్దరికీ ప్రయోజనాన్ని కలిగించిందో వివరించాడు. శ్రీరాముడు హనుమంతుని సంభాషణాచాతుర్యాన్ని ప్రశంసిస్తాడు. ఉత్తమోత్తముడైన వక్తకు ఉండాల్సిన లక్షణాలను ఈ కాండలో వాల్మీకి చూపించాడు. మహాత్ములను శంకించడం ఎటువంటి ఫలితాన్ని ఇస్తుందో సుగ్రీవుడికి రాముడు వేసిన శిక్షద్వారా చూపాడు. అలాగే, అప్రమేయ బలసంపన్నుడు, అమితపరాక్రమవంతుడైన వాలి వధ ఈ కాండలోనే వర్ణించబడింది. శ్రీరాముడు వాలి వధ చేయడం వెనుక ఉన్న రహస్యాలను, కారణాలను వాలికి వివరించినపుడు వాలి తృప్తిపడతాడు. అందువల్ల ఆ విషయంలో విమర్శలకు తావులేదు.

సీతాన్వేషణకు వానరులను పంపుతున్న ఘట్టంలో సుగ్రీవుడు చేసిన భౌగోళిక విచారణ ఈ కాండలో విశేషంగా చెప్పుకోదగినది. సమగ్రమైన భారతఖండ వర్ణన ఇందులో కనిపిస్తుంది. హిమవద్వింధ్య పర్వతాల మధ్యగా వలయాకారంగా శరావతి అనే నది ప్రవహిస్తుంటుంది. ఆ నదినుంచి దిక్కులను నిర్దేశిస్తూ సుగ్రీవుడు తన భూగోళ, ఖగోళ విజ్ఞానాన్ని ప్రదర్శించాడు. ఎన్నోవేల సం.ల కింద అవతరించిన రామాయణంలో ఇంత భౌగోళిక విచారణ చేయడం నేటి ఆధునికులకు అందని రహస్యం. అదే ఆధ్యాత్మిక రహస్యం. కిష్కింధాకాండలో ప్రధానంగా సద్గురువుల ఆశ్రయానుగ్రహాల చేతనే జీవి కృతార్థుడు కాగలడని, ఆచార్య అనుగ్రహమే భగవత్, భాగవత సాంగత్య సన్నిధులను చేకూరుస్తుందని స్పష్టంగా తెలియచేయబడింది. ఇందులో ఆచార్యపురుషుడిగా హనుమంతుడు నిరూపించబడ్డాడు.

### 5. సుందరకాండ

'రామాయణ మహామాలాం రత్నం వందే అనిలాత్మజామ్' అని హనుమంతుని ప్రార్థిస్తాం. ఈ ప్రస్తావన ఎందుకంటే, వాలి వధ, సుగ్రీవసంరక్షణ - అంటే దుష్టశిక్షణ శిష్టరక్షణ ధర్మాలను కిష్కింధలో చూపిన తర్వాత శ్రీరామునిచే పంపబడ్డ హనుమంతుని సీతాన్వేషణ ఘట్టాన్ని పూర్తిగా ఈ కాండలో వర్ణించి, హనుమంతుని కాండగా వాల్మీకి తీర్చిదిద్దాడు. రామాయణంలో సరిగ్గా 12,000వ శ్లోకంతో సుందరాకాండ మొదలవుతుంది. రామాయణంలో సరిగ్గా మధ్యభాగంలో మనం ఉన్నామని చెప్పడానికే ఇది. సుందరకాండ పేరులోనే ఒక విలక్షణతను వాల్మీకి ప్రదర్శించాడు. మిగతా కాండల్లా దీనికి పేరుపెడితే 'లంకాకాండ అని పేరు పెట్టాలి. కాని అలాకాక 'సుందర' అని పేరుపెట్టడమే ఒక సౌందర్యం ఈ కాండకు. సుందరుడనగా ఒక అర్థంలో వానరం అని అర్థం.[15] సుందరకాండలో కనిపించని రాముని సౌందర్యం వర్ణింపబడటం చేత, సీతాదేవి పాతివ్రత్య ప్రభావాదులు సుందరం కావడం చేత, కథకూడ సుందరం కావడం చేత ఈ కాండ పేరును కవి సార్థకం చేశాడు.

వేదాలు

వేదాలు

వేదాలు

గీతోపదేశం వేదాలు

ఇతిహాసాలు

పురాణాలు

ఉపనిషత్

---

[14] ఆఢ్యోవాపి దరిద్రోవా దుఃఖితస్సుఖితో-పివా
నిర్దోషశ్చ సదోషశ్చ వయస్యః పరమాగతిః॥

[15] సుందరః కపిః (నిఘంటువు)

కథాపరంగా పరిశీలిస్తే, జాంబవంతుని ప్రేరణతో హనుమంతుడు చేసే సముద్రలంఘనంతో ఈ కాండ మొదలవుతుంది. హనుమానుడి యోగశక్తిరహస్యాన్ని మొదటి సర్గలో వర్ణించాడు. ఉత్తమకార్యశీలి అయిన రామదూత కార్యనిపుణతను వర్ణించాడు. ముఖ్యంగా శ్రీమద్రామాయణంలో అయోధ్యనగర వర్ణనం కంటె లంకానగర వర్ణనం అధికంగా చేయడం కనిపిస్తుంది. కారణం ఏమంటే, లంకాపట్టణం ఆధునికభౌతికతకు నిదర్శనం. భౌతికమైనది ఎంత సుందరమైనప్పటికీ ఒకప్పుడు అది నశిస్తుందనే వేదాంతరహస్యాన్ని లంకానాశంలో కవి మనకు దర్శింపచేశాడు. లంకలో ఎన్నో ఆకర్షణలు, అద్భుతాలు చూసినప్పటికీ హనుమంతుని మనస్సు చలించకపోవడంలో కవి ఆయన జితేంద్రియత్వాన్ని నిరూపించాడు. మండోదరిని దర్శించిన హనుమంతుని చాపల్యం, వెనువెంటనే ఆ చాపల్యాన్ని పోగొట్టే ఆయన ధీశక్తి రహస్యం, సీతాదర్శనం కాకపోవడంతో ఆయన లోనైన నిర్వేదం, అనంతరం సీతాసందర్శనం మొదలైనవి ఈ కాండలో అద్భుతఘట్టాలు. త్రిజటాస్వప్నవృత్తాంతంలో స్వప్నశాస్త్రరహస్యాలను పరిపూర్ణంగా చూపించాడు. హనుమంతుడి 'కార్యోపాసన', సీతమ్మ 'రామోపాసన'లను సమగ్రంగా వర్ణించి సుందరకాండ 'ఉపాసనకాండ' ఎలా అయిందో చూపించాడు. అందువల్లనే సుందరకాండ పారాయణం చేస్తే అద్భుతఫలితాలు పొందవచ్చు. శ్రీరామసౌందర్యాన్ని సీతమ్మకు పరిపూర్ణంగా వర్ణించి చెప్పిన హనుమంతుడి 'ఏకాత్మికాభక్తి' విశేషం, వరాహమిహిరప్రోక్తసాముద్రికశాస్త్ర లక్షణాలు ఈ ఘట్టంలో దర్శనమిస్తాయి. అమ్మవారిదగ్గర హనుమంతుడి దాసాంజనేయతత్త్వం చూడవచ్చు. హనుమంతుడు అశోకవనధ్వంస సందర్భంలో ప్రదర్శించే ఎన్నోయుద్ధ విద్యలు మన సనాతనభారతీయయుద్ధ వైభవాన్ని స్ఫురింపచేస్తాయి. ఆంజనేయుడు రావణునికి చేసే ఉపదేశం చాలా అద్భుతఘట్టం. రాముడికి సీతమ్మ కుశలవార్తను చెప్పడంతో సుందరకాండ ముగుస్తుంది.

**6. యుద్ధకాండ**

శ్రీరాముడు హనుమంతుడు చెప్పిన సీతా విషయకమైన కుశలవార్తలను విని హనుమంతునికి తన ఆలింగనాన్ని ఇవ్వడంతో యుద్ధకాండ మొదలవుతుంది. హనుమంతుడు సాధించిన కార్యానికి ప్రతిఫలం వేరేమీ కాదని, భగవద్దేహం ఆనందస్వరూపమే కానుక, అపరిచ్ఛిన్న పరిపూర్ణ ఆనందస్వరూప ఆలింగనమే పరమపురుషార్థ స్వరూపం కనుక రాముడు దృఢంగా హనుమంతుని ఆలింగనం చేసుకున్నాడు.[16] ఉత్తమోత్తమైన దూత లక్షణాలను హనుమంతునిలో చూపడంలో, ఉత్తమోత్తములైన భృత్యులను ఉత్తమ కార్యానికి వినియోగించాలని సారాంశం. తదుపరి యుద్ధకాండలో ప్రధానమైన ఘట్టం విభీషణ శరణాగతి. శరణాగతిలోని ఆరు అంశాలను ఇందులో విస్తృతంగా చర్చించడం జరిగింది. అనుకూలస్థానాన్ని చేరాలన్న సంకల్పం, ప్రతికూలాన్ని విసర్జించటం, రక్షిస్తాడన్న విశ్వాసం, తనను రక్షించమని కోరుకోవడం, రక్షకుడైన భగవంతునికి తనను అర్పించుకోవడం, వినయంగా

---

[16] ఏషసర్వస్య భూతస్తు పరిష్వంగో హనూమతః
మయాకాలయమం ప్రాప్య దత్తస్తస్య మహాత్మనః

ప్రవర్తించడం అనేవి ఈ ఆరు అంశాలు. విభీషణుడు రాజ్యాధిపత్యం కోరినా, భగవంతుని కోరాడు కనుక ప్రశస్తమే కాని దూష్యం కాదు. శ్రీరాముని పరబ్రహ్మగా గుర్తించి, తదనుగ్రహంతో రాజ్యానుగ్రహం కోరడం భాగవతలక్షణమని ఈ ఘట్టంలో వాల్మీకి నిర్ణయం. శ్రీరాముడు దర్భశయనం చేయడం, సేతుబంధనం, రామరావణుల యుద్ధం, పాతాళహోమం, శ్రీరామవిశ్వరూపం, ఆదిత్యహృదయం మొదలైన ఎన్నో ఘట్టాలు ఈ కాండలో ఉన్నాయి. రావణుని బ్రహ్మదత్తమైన బాణంతో సంహరించి, సీతమ్మను స్వీకరించి, రామేశ్వరంలో రామలింగ ప్రతిష్ఠ చేసిన రామునికి పుష్యమీ నక్షత్రంలో వశిష్ఠాది మహర్షులు పట్టాభిషేకం చేస్తారు. శ్రీమద్రామాయణ ఫలశ్రుతితో కవి కథ ముగిస్తాడు. కుటుంబవృద్ధి, ధనధాన్య, సుఖ, ఆయురారోగ్య భాగ్యాలు సమస్తమూ రామానుగ్రహం వల్ల లభిస్తాయని మహర్షి వాల్మీకి ఫలశ్రుతిలో చెప్పాడు.

**ఉత్తరకాండ**

శ్రీమద్రామాయణంలో చివరి కాండను ఉత్తరకాండగా పిలుస్తారు. ఈ కాండలో మొత్తం 111 సర్గలు, సుమారు 3591 శ్లోకాలున్నాయి. కాని పండితలోకంలో ఈ కాండపై భిన్నాభిప్రాయాలున్నాయి. ఇది చాలావరకు ప్రక్షిప్తమనే వాదం ఒకటున్నది. శ్రీమద్రామాయణం పారాయణం చేయునపుడు కూడ దీనిని పఠించే సంప్రదాయం లేదు. శ్రీరాముని సభను మహర్షులు సందర్శించడం, వారిలో అగస్త్యమహర్షి శ్రీరాముడికి రావణజన్మవృత్తాంతం చెప్పడంతో ఈ కాండ ఆరంభమవుతుంది. మొత్తం 34 సర్గలలో రావణుడి చరిత్ర విస్తారంగా వాల్మీకి వర్ణించాడు. రావణుడి చరిత్ర తర్వాత 35వ సర్గనుండి హనుమంతుని జన్మవృత్తాంతం వర్ణించబడింది. శ్రీరాముడి రాజ్యపరిపాలనా విధానాన్ని ఈ కాండలో మనం చూడవచ్చు. 43వ సర్గలో సీతపైగల లోకాపవాదాన్ని శ్రీరాముడికి భద్రుడనే దూత తెలుపగా, లక్ష్మణుని పిలిచి సీతను అడవిలో వదలి రమ్మని రాముడు ఆజ్ఞాపిస్తాడు. వాల్మీకి ఆశ్రమంలో సీత నివసిస్తుంది.

ఈ కాండలోనే వశిష్ఠుని కథ, నృగమహారాజుకథ, శత్రుఘ్నుడు లవణాసురుని సంహరించడం, మధ్యలో వాల్మీకి ఆశ్రమంలో లవకుశులు జన్మించడం, శ్రీరాముడు అశ్వమేధయాగం చేయడం, ఆ సభలో కుశలవులు శ్రీరామాయణగానం చేయగా శ్రీరాముడు వినడం, సీతమ్మ రసాతలంలో ప్రవేశించడం తదితర ఘట్టాలు ఉన్నాయి. ఉత్తరకాండ శేషాన్ని రాముడు వింటాడు. కాలపురుషుడు రామునికి బ్రహ్మదేవుని సందేశం పంపగా మధ్యలో దూర్వాసుడు రావడం, లక్ష్మణుడు సశరీరంగా స్వర్గానికి వెళ్లడం, కుశలవుల పట్టాభిషేకం, శ్రీరాముడు పరమధామానికి చేరడం, అయోధ్యావాసులందరు స్వర్గలోకానికి చేరడంతో ఈ కాండ ముగుస్తుంది. ఉత్తరకాండలో కూడా శ్రీమద్రామాయణ మాహాత్మ్యం విశేషంగా వర్ణించబడింది. రామాయణం చదవడం ద్వారా ఆయుర్వృద్ధి కలుగుతుందని, వేయి అశ్వమేధయాగాల ఫలం లభిస్తుందని ఫలశ్రుతి చెప్పబడింది.

**నేటి సమాజానికి రామాయణ ప్రయోజనం**

శ్రీమద్రామాయణంలో వాల్మీకి మహర్షి భారతీయసంస్కృతికి ఒక విశిష్టస్థానాన్ని కల్పించి కృతార్థుడయ్యాడు. సాధారణంగా సంస్కృతి అనేది సంప్రదాయాలు, మతం, మతాచారాలు, సాహిత్యం, విద్య, కళలవంటి ఉపాధులను అనుసరించి దినదినం

వేదాలు
వేదాలు
వేదాలు
గీతోపదేశం వేదాలు
ఇతిహాసాలు
పురాణాలు
ఉపనిషత్

వర్ధమానమవుతూ ఉంటుంది. సంస్కృతంలో, 'ప్రయోజనమనుద్దిశ్య నమందోపి ప్రవర్తతే' అని సూక్తి. మానవుడు ఏ పని చేసినా, దానిలో ప్రయోజనాన్ని ఆశిస్తాడని దీని అర్థం. మానవుడు చేసే ప్రతి పనివల్ల, నేర్చిన ప్రతి విద్యవల్ల, తనకు, తన సంఘానికి ప్రయోజనముండాలి. లౌకికమైన ఈ సందేశాన్ని వాల్మీకి చక్కగా తన రామాయణ రచనలో పొందుపరిచాడు.

వాల్మీకి మహర్షి రామాయణాన్ని రచించిన తరువాత శ్రీరాముడి కుమారులైన కుశలవులకు దానిని నేర్పి, గానం చేసే విధానాన్ని తెలిపాడు. రాముడు చేసిన అశ్వమేధయాగాన్ని పురస్కరించుకొని అయోధ్యాపుర వీధులలో కుశలవులు గానం చేశారు. వారి గానాన్ని విన్న ప్రజలకు సీతాదేవిపై జాలి కలిగింది. ప్రజల అనాగరిక దుర్భాషణలే సీతాపరిత్యాగానికి కారణమని గ్రహించి పశ్చాత్తాపపడ్డారు. రామచంద్రమూర్తి ఆ గానాన్ని విని కన్నీరు కార్చాడు. చివరకు అంతా కలిసిన తర్వాత, కుశలవులు పట్టాభిషిక్తులయ్యారు.

రామాయణ కథ సమాజాన్ని మార్చింది. ముఖ్యంగా ఆదర్శవంతమైన కుటుంబవ్యవస్థను నెలకొల్పడానికి దోహదం చేసింది. దేశ ప్రగతి మూడు అంచెలలో ఉంటుంది. అవి: వ్యక్తి, కుటుంబం, సంఘం అయితే ఈ మూడు వ్యవస్థలకు వ్యక్తిత్వం అనేది తొలిమెట్టు. ఒక చొక్కా ఒంటికి తొడిగినపుడు, దాని మొదటి గుండీ తప్పుగా తగిలిస్తే తర్వాతవన్నీ తప్పులుగా ఉంటాయి. కనుక ఉత్తమ వ్యక్తిత్వం ముఖ్యం. దేశప్రగతికి ప్రధానంగా మానవుడు ఆదర్శజీవనాన్ని సాగించాలి. అందువల్లనే, ఎన్నో అవతారాలు దాల్చి దుష్టశిక్షణ చేసిన భగవంతుడు మానవులందరిని మాధవులుగా మార్చడానికి ఒక ఆదర్శమానవుడిగా శ్రీరాముని రూపంలో అవతరించి, ఉత్తమ మానవధర్మాలన్నింటిని ఆచరించి, ఒక పరిపూర్ణమైన మర్యాదావ్యవస్థను లోకంలో శాశ్వతంగా నిలిపి మర్యాదాపురుషోత్తముడయ్యాడు. వ్యక్తి తదుపరి కుటుంబమే దేశప్రగతికి ముఖ్యం. రామాయణంలోని గృహస్థధర్మాలను పరిశీలిద్దాం.

రామాయణంలోని ప్రతి కుటుంబం ఆదర్శప్రాయమైన గృహస్థాశ్రమానికి ఓ ప్రతీక. వాల్మీకి వర్ణించిన కుటుంబజీవనంలో వర్గభేదాలు, ధనికులు, పేదలు అనే భేదాలు లేవు. అందరూ గృహస్థాశ్రమఆనందాన్ని అనుభవించేవారు. ఇరుగు పొరుగువారిలో, బంధువులలో, అన్ని కులాల కుటుంబాల్లో ఎవరిని చూసినా బలహీనుడిగా, సోమరిగా కనిపించేవారు లేరు. పిల్లలు బుద్ధిమంతులుగా ఉంటారు. భర్త భార్యతో, భార్య భర్తతో వ్యంగ్యంగా, కటువుగా మాట్లాడరు. మిత్రులు దోచుకునేవారు కాదు. సుఖదుఃఖాలను రెంటినీ సమానంగా చూస్తారు. పరస్పరం సహకరించుకొంటారు. యజమాని, సేవకులు పరస్పరం ప్రేమతో ఉంటారు. డబ్బే సర్వస్వం కాదు. ప్రజలు వివాహనియమాల్ని చక్కగా ఆచరిస్తారు. కామోపభోగాలను ఏ విధంగా అదుపులో పెట్టాలో రామాయణం కూలంకషంగా చర్చిస్తుంది. వివాహ వ్యవస్థ ఏర్పడకముందు స్త్రీపురుష సంబంధాలలో ఒక కట్టుబాటు ఉండేది కాదు. ఫలితంగా స్త్రీ నానా వ్యధలకు గురయ్యేది. పురుషులు తప్పించుకుని తిరిగేవారు. అందుచేతనే స్త్రీ, పురుషుల్ని కట్టుబాటులో ఉంచడానికి వివాహవ్యవస్థ

రూపొందించబడింది. సమాజకల్యాణంకోసం, వ్యక్తి వికాసం కోసం వివాహవ్యవస్థ ఏర్పడింది. సామాజిక ప్రయోజనం మిళితమైన సుఖ, సంతోషాల కోసం ఏర్పరచిన వివాహబంధ ప్రాముఖ్యాన్ని నిరూపించిన ప్రథమకావ్యం రామాయణం. రామాయణంలో స్వచ్ఛమైన ప్రేమస్వరూపం కనబడుతుంది. సీతారాముల దాంపత్యంలో ఆ ప్రేమ ఎలా ఉందో అయోధ్యకాండలో స్పష్టం. ఇప్పటి యువతీ యువకుల సంబంధాలలో ప్రేమకు బదులు మోహం కనిపిస్తుంది. అందువల్లనే మోహం తీరగానే విడాకుల కోసం పరిగెత్తుతున్నారు. ముఖ్యంగా స్త్రీ శక్తిస్వరూపిణి. ప్రకృతి అనే దేవతగా స్త్రీని ఆరాధించారు. రామరాజ్యంలో స్త్రీలు పరిపూర్ణ స్త్రీలుగా, పురుషులు పరిపూర్ణ పురుషులుగా ఉండడంచేత కుటుంబవ్యవహారాలు చక్కగా సాగాయి. రామాయణకాలంలో స్త్రీలను చులకనగా చూడలేదు.

శ్రీరాముడు వనవాసానికి వెళ్లడానికి నిశ్చయించుకున్నప్పుడు వశిష్ఠుడు స్పష్టంగా ఇలా పలికాడు.

'ఆత్మాహిదారా సర్వేషాం దారసంగ్రహవర్తినామ్
ఆత్మీయమితి రామస్య పాలయిష్యతి మేదినీ.'

స్త్రీ మగని ఆత్మ. సీత రాముని ఆత్మ కావడంవల్ల శ్రీరాముడు వనవాసానికి వెడితే సీతయే రాజ్యభారాన్ని వహిస్తుంది. స్త్రీ రాజ్యమేలుతుంది... ఇలా చెప్పడానికి వశిష్ఠుడు వెనుకంజ వేయలేదు. భర్త రాజ్యంపై భార్యకు అధికారముంది. మగవారు చేసే పనులను స్త్రీ చేయగలదు. కాని స్త్రీలు చేసే పనులు మగవారు చేయలేరు. గర్భాన్ని ధరించడం, శిశుసంరక్షణ స్త్రీల హక్కు. స్త్రీలో ప్రేమించే శక్తి ఉంది. దేనిని ప్రేమిస్తుందో, దానికోసం సర్వస్వం అర్పించే శక్తి స్త్రీలో మాత్రమే ఉంది. స్త్రీ తల్లిగా, చెల్లిగా, ఇల్లాలుగా లేకపోతే ప్రపంచమే తలకిందులవుతుంది. ఇటువంటి వర్ణనలను రామాయణంలో మనం చూడవచ్చు.

ఈనాటికాలంలో ఉమ్మడి కుటుంబాలు అరుదుగా కనిపిస్తున్నాయి. రామాయణం ఉమ్మడి కుటుంబవ్యవస్థను చిత్రించింది. అత్త, మామలు, అన్నదమ్ములు, అక్కచెల్లెలు, కోడళ్లు, మనుమలు, మనుమరాండ్రు ఇలా అందరూ ఒకే గొడుగునీడలో కలసిమెలసి ఉండడం కనిపిస్తుంది. ఇంటికి పెద్ద తండ్రి. తండ్రి తర్వాత ఆ స్థానం ఇంట్లో పెద్దకుమారుడిది.[17] వదినెను మరుదులందరూ తల్లిలా గౌరవించేవారు. అన్నావదినల కోసం తన భార్యను సైతం వదిలిపెట్టిన మరిది లక్ష్మణుడు. అయాచితంగా వచ్చిన రాజ్యాన్ని తృణప్రాయంగా వదిలి శ్రీరామపాదుకలను సింహాసనంమీద ఉంచి రాజ్యం చేసిన తమ్ముడు భరతుడు. భరతుని గుణాలే కలిగినవాడు శత్రుఘ్నుడు... వీరందరినీ మాతృప్రేమతో చూసే వదిన సీతమ్మ. ఇది చాలా అందమైన కుటుంబం. ఒకరికోసం ఒకరు నిలబడే అద్భుతమైన ప్రేమమయ కుటుంబం దశరథకుటుంబం.

కిష్కింధలో సీత నగలను దెచ్చి రామునికి చూపిస్తే, రాముడు చూడలేక లక్ష్మణుని చూడమని ఆదేశిస్తే – 'నాహం జానామి కేయూరే, నాహం జానామి కుండలే, నూపురేత్వభిజానామి నిత్యం పాదాభివందనాత్' అని, 'ఆ సీతమ్మ పాదాలకు ఉన్న

---

[17] జ్యేష్ఠభ్రాతా పితుఃస్సమః

అందెలు మాత్రమే నాకు తెలుసు అన్నయ్యా! ఎందుకంటే రోజూ పాదాలకు నమస్కారం చేస్తాను కాబట్టి! మిగతా ఆభరణాలు నాకు తెలియదు' అన్న లక్ష్మణుని సమాధానంలో అతని శీలసంపదను దర్శించవచ్చు. ఇలాంటి ప్రసంగాల్ని చదువుతున్నప్పుడు లక్ష్మణుని పట్ల మన హృదయంలో ఆదరభావం ద్విగుణీకృతమవుతుంది. సారరూపంలో చెప్పాలంటే రామాయణంలో వికృత ఆధ్యాత్మిక కల్పనలు, కట్టుబాటులో లేని సుఖోపభోగాలు లేవు. మానవుని సంస్కారవంతునిగా చేయాలి. మానవుడు మాధవుడు కావాలి. కాని ఎలా చేయాలన్నదే సమస్య. దీనికి పరిష్కారమే శ్రీమద్రామాయణం. రామాయణంలోని వివాహాలు కేవలం బాహ్యవివాహాలు కావు, అంటే రూపాన్ని చూచి ప్రేమించడం లేదు. గుణప్రధానమైన ప్రేమ ఆనాడు ఉండేది.

శ్రీరామరాజ్యంలో స్త్రీలకు గౌరవం లేదనే వాదం ఒకటుంది. అది కల్పన. 'యత్రనార్యస్తు పూజ్యంతే రమంతే తత్రదేవతాః' అనే మనువాక్యాన్ని రామాయణంలో దర్శించవచ్చు. రాముని కాలంలో స్త్రీలు అత్యున్నతమైన స్థానాన్ని పొందారు. 'ధర్మేచ అర్థేచ కామేచ త్వయైషా నాతిచరితవ్యా.... నాతిచరామి' అని ప్రతిజ్ఞచేసి అన్నింటా సమానంగా ఉంటూ, కష్టాల్లో ఒకరికి ఒకరు తోడుగా, సుఖాన్ని పంచుకుంటూ జీవించడమే గృహస్థాశ్రమధర్మం. గృహస్థాశ్రమం సద్గుణాలను, సదాచారాలను అలవరచుకొనే స్థానం. కేవలం తినడానికి, నిద్రపోవడానికి సంసారం చేయాల్సిన అవసరం లేదు. దానికోసం ఇతర మార్గాలున్నాయి. కుటుంబంలో పవిత్రత, నిర్మలత్వం, మాంగల్యం లోపించకుండా శ్రద్ధ వహించాలి. ఒకే ఆచారం, ఒకే ఆలోచన కలిగినదే గృహస్థాశ్రమం. ఇటువంటి గృహస్థాశ్రమవైభవాన్ని శ్రీరాముని చరిత్రలో మనం దర్శించవచ్చు.

వేదాలలో నిక్షిప్తమైన అనేక రహస్యాలను రామాయణంలో ఆఖ్యానరూపంలో దర్శించవచ్చు. వేదం శాసనపూర్వకంగా చెప్పినవే శ్రీమద్రామాయణంలో శ్రీరామపాత్ర ద్వారా ఆచరణీయవిధానంలో వాల్మీకి మనకు చూపించాడు. ముఖ్యంగా వేదాలలో చెప్పిన 1) మాతృదేవోభవ, 2) పితృదేవోభవ 3) ఆచార్యదేవోభవ 4) అతిథిదేవోభవ వంటి వాక్యాలను దృష్టాంతపూర్వకంగా రామాయణంలో నిరూపించాడు. వేదం తల్లిని, తండ్రిని దైవాలుగా భావించమని ఆదేశించింది. అయితే తల్లి గొప్పనా, తండ్రి గొప్పవాడా, అనే పోటీ ఏర్పడితే ఇద్దరిలో ఎవరు గొప్ప అనేది రామాయణంలో మాత్రమే చెప్పబడింది. అయోధ్యకాండలో వనవాసానికి సిద్ధమైన శ్రీరాముని తల్లి కౌసల్య ఆపి –

'యథైవ రాజా పూజ్యస్తే గౌరవేణ తథాహ్యహం
త్వాం నాహమనుజానామి నగంతవ్యమితోవనం (అ.21-24, 25).

గౌరవంతో దశరథుడు నీకు ఏ విధంగా పూజ్యుడో, నేనూ అట్టి పూజ్యురాలనే గదా! నేను నీకు వనవాసానికి ఆజ్ఞ ఇవ్వడం లేదు. అందువల్ల నీవు వెళ్లవద్దు అని ఆదేశించింది. అప్పుడు శ్రీరాముడు నీ మాట పరిపాలించదగినదే, అయినా ఇద్దరి మాటలను ఒకమారే ఆచరించటానికి వీలు కలుగదు. మొదటిది తండ్రి ఆజ్ఞ కాబట్టి, ప్రబలమైన తండ్రి ఆజ్ఞను అతిక్రమించే శక్తి నాకు లేదు, పైగా నా తండ్రి నీకు భర్త. భార్యకు భర్తమాటే వేదవాక్కు. పతి ఆజ్ఞను అతిక్రమించడం అధర్మం. అందువల్ల

నీకు, నాకు, లక్ష్మణునికి దశరథమహారాజు గురువు అని వేదతాత్పర్యాన్ని రాముడు చూపించాడు. అయితే తల్లి జీవితాంతం పురుషుని చేత సేవించతగినదే. వందన, పోషణ, సేవాదులలో తల్లికే ఎక్కువ ప్రాధాన్యం కనబడుతోంది.

'పితురాజ్ఞా పరమోధర్మః స్వధర్మో మాతృరక్షణం
అనవజ్ఞా పితుర్యుక్తా ధారణం మాతృరక్షణం.' (మహాభారతం)

సేవాదులలో మాతృదేవతకు ఎంత ప్రాధాన్యమో, ఆజ్ఞా పరిపాలనలో తండ్రి ఆజ్ఞాపాలనే పరమధర్మం. తల్లికి కుమారుని శాసించే అధికారం లేదు. వీరిద్దరిని శాసించే అధికారం తండ్రికి మాత్రం ఉంది. సేవాదులలో తల్లి, ఆజ్ఞాపరిపాలనంలో తండ్రి అని, ఉభయుల గౌరవాలు ప్రత్యేకంగా గుర్తించదగినవని శ్రీరాముడు తన ఆచరణ ద్వారా చూపించాడు. భరద్వాజ ఆతిథ్యంలో, విశ్వామిత్రునికి దశరథుడు ఇచ్చిన ఆతిథ్యంలో 'అతిథిదేవోభవ'ను, విశ్వామిత్ర, వశిష్ఠులద్వార 'ఆచార్యదేవో భవ'ను నిరూపించి వేదహృదయాన్ని ఆవిష్కరించడమే రామాయణ ప్రయోజనమని వాల్మీకి నిరూపించాడు.

ఇవేకాక ఈనాటి సమాజానికి కావలసిన ఆధునిక అంశాలు అయోధ్య, కిష్కింధ, సుందరకాండలలో వాల్మీకి వర్ణించాడు. దశరథుడు మరణించినపుడు ఆయన భౌతికశరీరాన్ని తైలద్రోణిలో ఉంచి అనేక రోజులు కాపాడడం రూపంలో ఈనాటి అత్యాధునిక విధానాలను ఆనాడే చూపించడం విశేషం. కిష్కింధకాండలో సీతాన్వేషణానికి వెడుతున్న వానరసమూహానికి సుగ్రీవుడు చేసిన భౌగోళిక విచారణ చాలా ఆశ్చర్యకరం. సుందరకాండలో చిత్రించిన లంకాపట్టణవైభవాన్ని, రాక్షసవిలాసాలను, సంస్కృతిని నేటి అత్యాధునిక నగరాలలో చూడవచ్చు. హనుమంతుడు సీతాన్వేషణ కోసం రాత్రి సంచారం చేస్తుండగా ప్రతి ఇంట్లో నృత్యాలు జరుగుతున్నట్లు మద్యం సేవించే స్త్రీలు ఉన్నట్లు వాల్మీకి వర్ణించాడు. ముఖ్యంగా లంకాపట్టణ రావణసంస్కృతిని కన్నులకు కట్టినట్లుగా చూపించాడు. వాల్మీకి అయోధ్యకంటె లంకనే ఎక్కువగా వర్ణించాడు. అయోధ్య ఆధ్యాత్మికతకు తావైతే, లంక భౌతికసంపదకు ఆటపట్టు. హనుమంతుడు లంకాదహనం చేయడం ద్వారా భౌతికమైనది నశిస్తుందన్న నీతిని ఈనాటి భోగపుష్టికల మానవులకు బోధించాడు.

శ్రీరామచంద్రుడు మర్యాదాపురుషోత్తముడు. లోకాల మర్యాదను ప్రతిష్ఠించడానికే, లోకాలను రక్షించడానికి అవతరించిన మహాపురుషుడు. రాముని లోకోత్తరబంధువుగా, లోకోత్తరపుత్రుడిగా, లోకోత్తరశత్రువుగా, అత్యంత నమ్మకమైన మిత్రుడిగా, అత్యంత శ్రేష్ఠమైన శిష్యుడిగా, శ్రేష్ఠమైన రాజుగా, లోకోత్తర ధర్మనిష్ఠ కలిగిన మానవుడిగా దర్శింపచేసి అతని చరిత్ర మహత్తును వాల్మీకి చాటాడు. రాముడు ప్రతివారికి ఆదర్శం.

'న సర్వే భ్రాతరస్తాత, భవంతి భరతోపమాః
మాదృశాపితుః పుత్రోవా సుహృదోవా భవద్విధః'

అందరు సోదరులు భరతుడిలా ఉండరు, అందరు పుత్రులు నావలె ఉండరని శ్రీరాముడి వచనం. తండ్రి మాటను జవదాటని పుత్రుడిగా, తల్లికోసం తపించే పుత్రుడిగా తనను నిరూపించుకొన్నాడు. రాముడి కోసం విలపిస్తున్న దశరథుడు ఓ సందర్భంలో 'నా కుమారుడు నా మాటను పాటిస్తాడు, ఇదే నా దౌర్భాగ్యం' అని

అంటాడు. శ్రీరాముడు నా మాటను పాటించకుండా ఉంటే ఎంత బాగుండేది, అరణ్యానికి వెళ్లేవాడు కాదు కదా అని దశరథుడి అభిప్రాయం. రాముడు ఒక అలౌకికపుత్రుడిగా దర్శనమిస్తాడు. పుణ్యతీర్థంలో దుష్కరమైన తపస్సు చేసినవారికి వశ్యుడైన ధార్మికపుత్రుడు లభిస్తాడని మనుస్మృతిలో ఉంది. దశరథుడు, కౌసల్య ఎంత తపస్సు చేశారో? శ్రీరాముడు వారికి పుత్రుడిగా ఆవిర్భవించాడు.

శ్రీరాముని వంటి సోదరుడు దొరకటం చాలా కష్టం. అన్నదమ్ములు ఏ విధంగా ఉండాలో శ్రీరామభరతలక్ష్మణశతృఘ్నుల ద్వారా గ్రహించవచ్చు. అలాగే సీతాదేవి వంటి కోడలు ఉండడం కూడ అరుదు. దశరథమహారాజు సీతాదేవిని కూతురికంటె ఎక్కువ ప్రేమతో చూసేవాడు. సీతమ్మ అలాగే ప్రవర్తించేది.

**శ్రీమద్రామాయణ సందేశం**

ఈ లోకంలోగల మానవాళి సత్యప్రతిష్ఠితాలైన వేదాలచే ప్రతిపాదితమైన కర్మమార్గం ఏ విధంగా అనుసరించవచ్చో సోదాహరణంగా నిరూపించి, అటువంటి శ్రేయోమార్గంలో నడిచి సకలశ్రేయస్సులను పొందవలసిందిగా శ్రీమద్రామాయణం ప్రబోధిస్తోంది. మనది భారతభూమి. దీనిని కర్మభూమి అని కూడా అంటారు. మానవుడు కర్మను ఆచరించడానికే ఈ మానవలోకంలో పుడుతున్నాడు. మానవుడు కర్మపరతంత్రుడు. ఎన్నో జన్మలు ఎత్తిన తర్వాత మానవదేహం లభిస్తుందని సకలశాస్త్రాలు చెబుతున్నాయి. మానవుడు పరిమిత ఆయుర్దాయం కలిగిన జీవితాన్ని పశులక్షణాలను వదిలి మేధాబలాన్ని, మానసిక ఆధ్యాత్మిక శక్తులను సంపూర్ణంగా పెంపొందించుకోడానికే వెచ్చించవలసిఉంది. అప్పుడే మానవుడు మాధవుడు అవుతాడు.

ధర్మం ఒక మహత్తరమైన శక్తి. దానిని ఆశ్రయించి మానవుడు తన సకలశక్తులను వికసింపచేసుకొని ఇహలోక, పరలోక అభ్యుదయాలను పొందగలుగుతున్నాడు. సమస్త మానవజాతిని ఏకం చేసి, లోకంలో సుఖశాంతులను ప్రతిష్ఠించడానికి ఏకైకసాధనం ధర్మమే. దరిద్రులను, ధనవంతులను, దుర్బలులను, బలవంతులను, దీనులను, హీనులను, పతితులను, అనాథలను అందరిని కాపాడేది ధర్మమే. మానవుని దేవతగా మార్చేది ధర్మమే. అటువంటి ధర్మానుష్ఠానం శ్రేయస్సును కలిగిస్తుంది. అందువల్లనే 'రామో విగ్రహవాన్ ధర్మః' అన్నది రామాయణం.

ఇటువంటి ధర్మానికి ఆధారం సత్యం. సత్యం లేక ధర్మం లేదు.[18] సకల శుభకర్మలు సత్యమూలాలు. సత్యధర్మాలు పాటించిన మానవులకు ఇహలోక-పరలోక అభ్యుదయాలు రెండూ కరతలామలకాలు అవుతాయి. అందుకే శ్రీమద్రామాయణం శ్రీరామతత్త్వాన్ని ఈ రెండింటి ఉత్తమసమ్మేళనంగా చూపించింది. నిష్ఠతో సత్యధర్మాలను పాలించినప్పుడు మృత్యువువల్ల భయం లేక అమృతత్వాన్ని పొందుతామని శ్రీరామతత్త్వం మానవజాతికి ప్రబోధిస్తోంది. సత్యధర్మాభిరక్తులకు మృత్యుకృతమగు భయం లేదు. ఇదే శ్రీమద్రామాయణ సందేశం.



---

[18] **సత్యేధర్మః ప్రతిష్ఠితః, సత్యమూలాని సర్వాణి - 13, 109-2.**



# శ్రీమద్భాగవత మకరందం

అష్టాదశ మహాపురాణాలలో మోక్షశాస్త్రం అని ప్రసిద్ధిగాంచినది శ్రీమద్భాగవతం. వినడంవల్లనే మోక్షం ఇచ్చే గ్రంథం ఇది. విశేషంగా ఏడు రోజులలో (సప్తాహ) దీక్షాపూర్వకంగా భాగవతాన్ని వినాలని పద్మపురాణం చెబుతోంది. భాగవతం సాత్వతసంహిత, అనగా భగవంతుని ఉపాసించే భక్తుల చరిత్రలను వర్ణించిన గ్రంథం. పరిపూర్ణమైన భక్తిశాస్త్రమే భాగవతం. 'భజ' 'సేవాయాం' అనే ధాతువు నుంచి భక్తి శబ్దం వచ్చింది. అంటే శుద్ధమైన మనస్సుతో పరమేశ్వరుని సేవించడమే భక్తి. భాగవతానికి 'హయగ్రీవబ్రహ్మవిద్య' అనే పేరు ఉంది. హయగ్రీవరూపంలో భాగవతాన్ని బ్రహ్మకు ఉపదేశించడంచేత ఆ పేరు వచ్చింది. భాగవతాన్ని బ్రహ్మ నారదునికి, నారదుడు వ్యాసునికి, వ్యాసుడు శుకునికి, శుకబ్రహ్మ పరిక్షిత్తుకు ఉపదేశించారు. భాగవతాన్ని అర్థం చేసుకోవాలంటే భక్తి కావాలి. పాండిత్యం, టీకాతాత్పర్యాలు భాగవత ఆత్మను అర్థం చేసుకోవడానికి చాలవు.

'విద్యావతాం భాగవతే పరీక్షా
విపత్తికాలే గృహిణీ సంపరీక్షా
రణాంగణే శస్త్రభృతాం పరీక్షా
ధనంజయే హాటక సంపరీక్షా"

విద్వాంసులకు భాగవతం పరీక్ష. కష్టకాలంలో స్త్రీలకు పరీక్ష. యుద్ధరంగంలో వీరునికి పరీక్ష. అగ్నిలో బంగారానికి పరీక్ష అని ఈ శ్లోకానికి అర్థం. భాగవతం చదవడం ఎంత శ్రమో, ఎంత పాండిత్యం కావాలో ఇది చెబుతోంది. అయితే శుద్ధమైన భక్తిద్వారా భాగవతం అవగతం అవుతుంది. భాగవతం మొత్తం 18,000 ల శ్లోకాలతో 12 స్కంధాలతో ఉంది. 'భగవతః ఇదం భాగవతం, భగవతః ఇమే భాగవతాః భక్తాః' – అంటే భగవంతుని జనులు భాగవతులు. వారి చరిత్ర భాగవతం. వేద సంప్రదాయంలో కాలాన్ని భగవత్ స్వరూపంగా ఆరాధించడం, దానిలోని 12 నెలలను 'ఓం నమో భగవతే వాసుదేవాయ' అన్న వాసుదేవ మంత్రంలోని 12 అక్షరాలుగా స్వీకరించడం ఉంది. భాగవతంలో 12 స్కంధాలు ఉండడం దీనినే సూచిస్తుంది.

భాగవతంలో చర్చించబడిన దేవుడు శ్రీకృష్ణుడు కనుకనే కృష్ణచరిత్రగా వర్ణించారు. భాగవతం ఇంట్లో ఉంటే సాక్షాత్తు శ్రీకృష్ణపరమాత్మ ఉన్నట్లే అని పెద్దలు అంటారు.

శుక, పరీక్షిత్తు సంవాదరూపంలో భాగవతం అవతరించింది. పరీక్షిత్తుకు శుకుడు మొత్తం భాగవతాన్ని ఏడు రోజులలో చెప్పాడు. పరీక్షిత్తుకు ముక్తి కలిగింది. పరమాత్మలో లీనం అయ్యాడు. అందువల్లనే ఈనాటికీ విరక్తులైన భక్తులు ఏడురోజులు కఠోరనియమాలతో భాగవత శ్రవణం చేస్తారు.

ఇటువంటి శ్రీమద్భాగవతాన్ని తెలుగువారి పుణ్యవిశేషప్రభావంవల్ల సహజకవి పోతన ఆంధ్రీకరించాడు. నారదుని పూర్వజన్మ వృత్తాంతం, పరీక్షిజ్జననం, గాంధారి ధృతరాష్ట్రుల దేహత్యాగం, కృష్ణనిర్యాణం, ధర్మపాలకుడైన పరీక్షిన్మహారాజుకు శాపం అనే వృత్తాంతాలతో దైవోపాసన (దాస్యభక్తి), దైవసహాయం, బంధనివృత్తి, భగవంతుడు, జీవప్రజ్ఞను పొందడం, ఆత్మధర్మసంరక్షణ ప్రాధాన్యం అనే విషయాలు వివరించబడ్డాయి. తక్కిన చోట్ల భగవన్నామకీర్తనం (స్తుతి) ప్రాధాన్యం వహించింది. కర్మ జ్ఞాన, భక్తిమార్గాలలో సకలజనులకు సులభమైనది భక్తి. తద్వారా ముక్తి పొందడాన్ని భాగనతం బోధిస్తుంది. 'మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసి' అని, మోక్షసాధనసామగ్రిలో భక్తికి గొప్ప స్థానం ఇచ్చారు ఆదిశంకరులు. ఆ విషయం ప్రథమస్కంధంలో నిరూపించబడింది.

'అన్నిటికంటె ఉత్తమమైన సత్యాన్ని ధ్యానం చేస్తాయ'ని చెప్పే మంత్రమే గాయత్రి. దానితో ప్రారంభించి, గాయత్రి అనే పేర సర్వాంతర్యామి అయిన భగవంతుని వివరించడం మత్స్యపురాణంలో ఉంది. దానిని భాగవతం అన్నారు. ఆ విషయమే ఈ పురాణంలో కూడా ఉంది కాబట్టి దీనికి కూడా భాగవతం అని పేరుపెట్టారు. భాగవతం తాపత్రయాన్ని అణచి, సకల సుఖాలనూ ఇస్తుంది. 'గాయత్రి' అంటే గానం చేసేవారిని రక్షించేదని అర్థం. అందులో 'సోహం' అనే తత్త్వం ఇమిడి ఉంది. గాయత్రిని స్మరిస్తే జీవులలోని దేవుని స్మరించడమే అవుతుంది. ఈ సాధనామార్గాన్ని ప్రధానంగా చెప్పేదే భాగవతం.

సర్వవేదాంత సారంహి శ్రీమద్భాగవతమిష్యతే
తద్రసామృత తృప్తస్య నాన్యత్ర స్యాద్గతిః క్వచిత్

అని, సర్వవేదాంత సిద్ధాంత సారసంగ్రహంగా శ్రీమద్భాగవతాన్ని వర్ణించారు. ఈ గ్రంథంలోని రసం అమృతమనీ, దానిని ఆస్వాదించినవారికి మోక్షసిద్ధి కలుగుతుందని పైశ్లోక తాత్పర్యం. ముఖ్యంగా భారతీయుల జీవితాదర్శమై చివరి పురుషార్థంగా భావించబడే మోక్షాన్ని పొందడానికి భాగవతధర్మమే సులభ తరణోపాయమని చెప్పవచ్చు. గరుడపురాణంలో శ్రీమద్భాగవతం ప్రత్యేకతను చెబుతూ "భగవద్గీతలో ఉన్న అష్టాదశాధ్యాయాల సారమే భాగవతంలో అష్టాదశసహస్ర శ్లోకాలుగా వివరించబడి అష్టాదశ సాహస్రసంహితగా పేరు పొందింది" అని ఉంది. అందువల్ల ఒక రకంగా గీతార్థనిర్ణయసారమని భాగవతాన్ని చెప్పవచ్చు.

"నిగమకల్పతరోర్గళితం
ఫలం శుకముఖాదమృత ద్రవసంయుతం
పిబత భాగవతం రసమాలయం
ముహురహో రసికాభువి భావుకాః॥

అని భాగవత ప్రత్యేకతను వివరిస్తూ – "నిగమం అంటే వేదం. వేదమనే కల్పవృక్షానికి కాసిన అమృతరసఫలం శ్రీమద్భాగవతం. అది శ్రీశుకముఖమునుండి రాలిపడింది. ఓ రసికులారా! మీరు పరమాత్మలో లీనమయ్యేదాకా తనివితీరా ఈ పండును తాగండి" అని చెప్పారు. సాధారణంగా లోకంలో పండును తినమంటారు. కాని భాగవతం అనే పండును తాగమని చెప్పడంలో, ఇందులో విసర్జించే పదార్థం ఏదీ లేదని సూచించడమే. లోకంలో చిలుకకొట్టిన పండుకు విలువ ఎక్కువ. అదేవిధంగా శ్రీమద్భాగవతాన్ని అవధూత అయిన శ్రీ శుకులవారు మొదట తాగారు. పరమాత్మను పట్టుకోవాలంటే, పరమాత్మతో ఏకత్వాన్ని పొందాలంటే భాగవతం చదివి తీరాలని పండితుల అభిప్రాయం.

**ప్రథమస్కంధ వివరణ:**

భాగవత ప్రథమస్కంధం మొత్తం 19 అధ్యాయాలలో, దాదాపు 810 శ్లోకాలలో ఉంది. భగవంతుని రెండు పాదాలలో ఒక పాదం ఈ ప్రథమస్కంధం. 'జన్మాద్యస్య యతోన్వయా...' అనే ధ్యానశ్లోకంతో ఇది మొదలవుతుంది. 'జన్మాద్యస్యయతః...' అనే బ్రహ్మసూత్ర శ్లోకం ఇది. రెండవ శ్లోకంలో శ్రీమద్భాగవత శ్రేష్ఠత్వం, మూడవ శ్లోకంలో ఆశీర్వాదంతో కథ ప్రారంభమవుతాయి. ఋషులు వేసిన ఆరు ప్రశ్నలతో గ్రంథం మొదలవుతుంది. 1) జీవుని పరమ పురుషార్థం ఏది? 2) దేనివల్ల జీవుని బుద్ధి ప్రసన్నం అవుతుంది? 3) వాసుదేవుడు ఎందుకోసం దేవకీగర్భంలో అవతరించాడు? 4) ఏ అవతారాలతో ఏ కార్యాలు చేశాడు? 5) ఆ అవతారాల ప్రత్యేకత ఏమిటి? 6) శ్రీకృష్ణుడు వెళ్లిన తర్వాత ధర్మం ఎవరిని ఆశ్రయించింది? సూతులవారు వేసిన ఈ ప్రశ్నలకు శుక శౌనకుల సమాధానమే భాగవతగ్రంథం.

ప్రారంభంలో భగవానుని 21 అవతారాలు, వ్యాసులవారి మనోవేదన, ఆయనకు నారదులవారి ఉపదేశంతోపాటు నారద పూర్వజన్మవృత్తాంతం, సత్సంగత్వ మహిమ, శమ్యాప్రాసం అనే ఆశ్రమంలో శ్రీమద్భాగవతరచన చేయడం, శుకులవారికి ఉపదేశించటం, పరీక్షిత్తు జన్మకర్మల విషయాలు, పాండవుల మహాప్రస్థానం మొదలైన అంశాలున్నాయి. ప్రథమస్కంధంలో ఇంకా, కుంతీదేవి స్తోత్రం, భీష్ములవారి స్తోత్రం, భీష్ముడి చివరి దశ వైశిష్ట్యం, పరీక్షిజ్జననం, నారదతత్త్వోపదేశం, గో, వృషభ సంవాదం మొదలైనవి ఉన్నాయి. విశేషం ఏమిటంటే మహాభారత కథ ముగింపు, భాగవతకథ ఆరంభం అని చెప్పవచ్చు. అందువల్లనే పోతన ప్రథమస్కంధాన్ని 'లలితస్కంధం' అని వివరించాడు. సర్వస్కంధాలకు పునాది వంటిది ఇది. దివ్యమైన స్తోత్రాలు ఇందులో ఉన్నాయి.

**ద్వితీయస్కంధ వైశిష్ట్యం:**

'పాదౌయదీయౌ ప్రథమ ద్వితీయౌ' అనే పద్మపురాణ వచనాన్ని అనుసరించి భాగవతంలోని రెండవ స్కంధం భగవంతుడి రెండవ పాదం. ఈ స్కంధంలో మొత్తం 10 అధ్యాయాలు, 393 శ్లోకాలున్నాయి. రెండవ స్కంధంలో కథ చాల తక్కువ. కాని భాగవతంలో అతి కీలకమైన చతుశ్లోకి భాగవతం ఈ స్కంధంలోనే వస్తుంది. ఈ స్కంధంలో 9వ అధ్యాయంలో 30 నుండి 37 శ్లోకాలు చాలా ప్రాధాన్యతగలవి. మొదటి శ్లోకం 'అహమే వాసమేవాగ్రే' ఋగ్వేదంలోని మొదటి మంత్రవివరణ. రెండవ శ్లోకం 'ఋతౌర్థంయత్ ప్రతీయేత' యజుర్వేదంలోని మొదటి మంత్రానికి వ్యాఖ్యానం, మూడవ శ్లోకం 'యథామహాన్తి భూతాని' అని అధర్వణవేదంలోని మొదటిమంత్రానికి వివరణ, నాలుగవశ్లోకం 'ఏతావదేవ' అనేది సామవేదంలోని 'అగ్న్య ఆయాహివీతయే' అనే మంత్రానికి వివరణ. పరిపూర్ణ అద్వైత వేదాంతసారంగా ఈ 7 శ్లోకాలు ఉండగా అందులో చతుశ్లోకి భాగవతం పునాదిలా నిలిచింది.

కథలోకి వెడితే, పరీక్షిత్తు శుకుని 'దేహధారి మోక్షం పొందాలంటే సాధనం ఏమిటో' వివరించమని ప్రార్థించాడు. దానికి సమాధానంగా శుకుడు భగవంతుని కథ వైశిష్ట్యాన్ని, ముక్తిమార్గాన్ని ఉపదేశించడమే ద్వితీయ స్కంధసారం. భగవంతుని పొందాలంటే ఏడురోజులు అనవసరం, రెండుఘడియలు చాలు అని దానికి దృష్టాంతంగా ఖట్వాంగ మహారాజు చరిత్రను వివరిస్తాడు. 'ధారణా' విషయాన్ని వివరిస్తూ, భగవంతుని విరాట్పురుష వర్ణన చేశాడు. మహాభాగవతం పది లక్షణాలైన సర్గం, విసర్గం, స్థానం, పోషణం, ఊతులు, మన్వంతరాలు, ఈశానుచరితం, నిరోధం, ముక్తి, ఆశ్రయాలను వివరించాడు. విష్ణుపారమ్యాన్ని బోధించే ఈ ద్వితీయస్కంధం విశిష్టమైనది. జన్మరాహిత్యమే భాగవతం ఇచ్చే అనుగ్రహమని ఈ స్కంధంలో వివరణ.

**తృతీయస్కంధం:**

'తృతీయ తుర్యౌ కథతౌ యదూరూ' అనే పురాణ వచనానుసారం భగవంతుని శబ్దరూప అవతారమైన శ్రీమద్భాగవతంలోని మూడవస్కంధం శ్రీకృష్ణుని తొడ వంటిదని అంటారు. మూడవ స్కంధంలో 33 అధ్యాయాలు, 1418 శ్లోకాలు ఉన్నాయి. పరీక్షిత్తు తాపాన్ని శ్రీశుకుల మంజులవాగ్విలాసం మెల్లమెల్లగా హరించివేస్తుంది. మహాభారతచరిత్రతో ఈ స్కంధం మొదలవుతుంది. మహాబుద్ధిమంతుడైన విదురుడు దుర్యోధనుడితో అవమానించబడి తీర్థయాత్రలు చేస్తూ యమునానదీతీరానికి వెళ్లాడు. అక్కడ భక్తశిరోమణి అయిన ఉద్ధవుని దర్శించి, ఆయనవల్ల శ్రీకృష్ణలీలలను శ్రవణం చేశాడు. శ్రీకృష్ణుడు లీలాసంసార విషయాలు విని, ఉద్ధవుడి ఆదేశంతో ఆత్మజ్ఞానాన్ని పొందడానికి మైత్రేయమహర్షి వద్దకు వెళ్లాడు. ఇక్కడినుంచి విదురమైత్రేయ సంవాదరూపంగా ఈ స్కంధమంతా నడుస్తుంది.

గంగాద్వారంలో విదురుడు మైత్రేయమహర్షిని కలిశాడు. మైత్రేయుడు విదురునికి ఆదిసృష్టితోబాటు, భగవద్గుణతత్త్వాన్ని సృష్టివిలాసాలను వివరించాడు. భార్యాభర్తలు

వేదాలు వేదాలు వేదాలు గీతోపదేశం వేదాలు ఇతిహాసాలు పురాణాలు ఉపనిషత్తు

ఇద్దరూ తగువిధంగా ఇంద్రియనిగ్రహం కలిగి ఉండకపోతే వారికి ఎటువంటి సంతానం కలుగుతుందో దితి-కశ్యపుల ద్వారా చెప్పి, హిరణ్యాక్ష, హిరణ్యకశిపుల జన్మవృత్తాంతం, వరాహావతార వైభవం చక్కగా వివరించాడు. ఆ తర్వాత దంపతులు ఎలా ఉండాలో వివరిస్తూ కర్దమ ప్రజాపతి, దేవహూతిల దాంపత్యధర్మాలను వర్ణించాడు. కర్దముడు అంటే ఇంద్రియాలను జయించినవాడని అర్థం. దేవహూతి అంటే దేవుని పిలిచే శక్తి అని అర్థం. ఈ విధంగా దంపతులు ఉన్నట్లయితే భగవంతుడు వారింటికి వస్తాడని 'కపిలావతారా'న్ని వర్ణించాడు. కపిలావతారం జ్ఞానావతారం అని చెప్పవచ్చు. 25వ అధ్యాయం నుంచి 33వ అధ్యాయం వరకు ఉన్న కపిలదేవహూతుల సంవాదాన్ని 'కపిలగీత' అంటారు. కపిలగీతలోనే సాంఖ్య శాస్త్రం, వేదాంత విషయాలు, భక్తియోగవర్ణన, అష్టాంగయోగం, సంసారచక్ర వర్ణనలు వస్తాయి కనుక అన్ని విధాలుగా ఈ తృతీయస్కంధం అనేక విశేషాల సమాహారం.

**చతుర్థస్కంధం**

శ్రీమద్భాగవతాంతర్గతమైన చతుర్థ స్కంధం కూడా భగవానుని ఊరువులలో ఒకటిగా పేర్కొన్నారు. ఈ స్కంధంలో 31 అధ్యాయాలు, 1,455 శ్లోకాలు ఉన్నాయి. భాగవత దశ లక్షణాలలో రెండవ లక్షణం విసర్గం ఇక్కడ నిరూపించబడింది. బ్రహ్మద్వారా జరిగే వివిధ రకాల సృష్టిచర్యలను విసర్గం అంటారు. విదుర మైత్రేయ సంవాదరూపంగానే కథలు వర్ణించబడ్డాయి. స్వాయంభువ మనువు పుత్రికల వంశవిస్తారాన్ని చెప్పడంతో ఈ స్కంధం ఆరంభించబడింది. స్వాయంభువ మనువు తన కుమార్తె ప్రసూతిని దక్షుడికి ఇచ్చి వివాహం చేశాడు. వారికి 16 మంది కుమార్తెలు జన్మించారు. వారిలో సతీదేవిని శివుడు పెండ్లాడాడు. దక్షయజ్ఞ ఘట్టంతో ప్రధానకథ మొదలైంది. విష్ణుతత్త్వాన్ని ప్రధానంగా ఉపదేశించే శ్రీమద్భాగవతంలో ఈ స్కంధంలో పరమశివతత్త్వాన్ని వర్ణించడం అద్వైతాన్ని బోధిస్తోంది.

ఈ స్కంధంలో మరొక విశేషం, 'ధ్రువోపాఖ్యానం'. చిన్నతనంలోనే సవతితల్లి పరుషవాక్కులకు బాధపడిన ధ్రువుడు నారద ఉపదేశాన్ని అనుసరించి మధువనంలో తపస్సు చేసి భగవంతుని అనుగ్రహాన్ని పొందుతాడు. ఈ జన్మలోనే భగవంతుని పొందాలంటే బాల్యంనుంచే భక్తి కలిగి ఉండాలి అనే ఉపదేశం ఈ ఆఖ్యానంలో ఉంది. ధ్రువుడు అర్థార్థి భక్తుడు. భగవానుని శరణాగతి పొందగా భగవంతుడు ఆయనకు దర్శనమిచ్చాడు. తర్వాత వేనుడి కథ, పృథుచక్రవర్తి కథ వస్తుంది. పృథుమహారాజు అర్చనభక్తికి ఉదాహరణం. పూజ ఎలా చేయాలో వివరించే అవతారం పృథువుది. ఆ తర్వాత రుద్రగీత, ప్రాచీనబర్హి వృత్తాంతం వస్తాయి. పరమవేదాంత గర్భితమైన పురంజనోపాఖ్యానం ఈ స్కంధంలో వర్ణించబడింది. స్వస్వరూపాన్ని ఎరగనివాడు ఈశ్వరుని గుర్తించలేడనే సూత్రమే పురంజనోపాఖ్యాన సారం. నవద్వార కల్పితమైన పురమే దేహం. ప్రచేతసుల చరిత్రతో ఈ స్కంధం ముగుస్తుంది. భగవద్భక్తి మహిమలు, సుందరప్రకృతి వర్ణనలు, వేదాంతతత్త్వ ఉపదేశాలతో నిండినది చతుర్థస్కంధం.

**పంచమస్కంధం:**

భగవంతుని నాభి స్వరూపంగా పంచమస్కంధాన్ని చెబుతారు. ఈ స్కంధంలో మొత్తం 26 అధ్యాయాలు, 664 గద్య, శ్లోకాలు ఉన్నాయి. మనువు రెండవ కుమారుడైన ప్రియవ్రతుని చరిత్రతో ఈ స్కంధం ఆరంభించబడింది. బ్రహ్మ ప్రియవ్రతునకు చేసిన ఉపదేశం సంసారవాసనను తుంచివేసే విధంగా ఉంటుంది. ఈ స్కంధంలో ఋషభదేవుని పుత్రుడైన భరతుడి ఆఖ్యానం ఉంది. ఈ భరతుడి వల్లనే 'భారతదేశం' అయిందని భాగవతం చెబుతోంది. భరతుడు సర్వం త్యజించి అడవికి వెళ్లి అక్కడ ఒక లేడిపై ఆసక్తిని కనబరచి, ఆ స్మృతిలోనే మరణించి, లేడిజన్మను పొంది, నివృత్తిదిశను అనుభవించి బ్రాహ్మణకుమారుడిగా 'జడభరతుడు' అనే పేరుతో అవధూతస్థితిని పొంది రహుగణ మహారాజుకు ఉపదేశం చేసి భగవంతుడిలో ఐక్యమవుతాడు. ఇది తలమానికమైన ఘట్టం. ప్రపంచ ఆసక్తిని వదిలినపుడే మోక్షమని ఈ ఆఖ్యానం వివరించింది. ప్రియవ్రతుడి వంశచరిత్ర 5వ అధ్యాయం వరకు సాగుతుంది. అక్కడినుంచి భూగోళవిషయం ప్రారంభమవుతుంది.

ఈ స్కంధంలో ప్రధానంగా భూగోళ, ఖగోళాలను, నరకాలను వర్ణించారు. భాగవతలక్షణాలలోని స్థానలక్షణం ఈ స్కంధంలో వర్ణించబడింది. జంబూద్వీపం, ప్లక్ష, శాల్మలీ, కుశ, క్రౌంచ, శాక, పుష్కరద్వీపాల విశేషాలు, భద్రాశ్వ, కేతుమాల, హిరణ్మయ వర్ష వర్ణనలతో ఇది సాగింది. భారతదేశంలోని మలయ, మైనాక, సహ్యాద్రి, శ్రీశైల, వింధ్యాచల, చిత్రకూట, గోవర్ధన, ఇంద్రకీలాద్రి, రామగిరి, కావేరి, గంగా, కృష్ణ, గోదావరి, తుంగభద్ర, సరస్వతి, చంద్రభాగ మొదలైన పర్వత, నదులను ఈ స్కంధం వర్ణించింది. నక్షత్ర, గ్రహమండలాల వర్ణనలు ఇందులో మరో ఆకర్షణ. పాపం చేసిన మానవునికి శిక్షలు ఎలా ఎంటాయో చెప్పడానికి 21 నరకాల వర్ణన చేశారు. తామిస్ర, అంధతామిస్ర, రౌరవ, మహారౌరవ, కుంభీపాక, కాలసూత్ర, అసివత్ర వన, సూచీముఖ, క్రిమిభోజన మొదలైన నరకాల వర్ణన అద్భుతం. ధర్మమార్గహీనులకు ఈ నరకాలు నివాసస్థానాలు. వీటితో పంచమస్కంధం ముగుస్తుంది.

**షష్ఠస్కంధం**

వాఙ్మయరూపంలోని ఆ పరమపురుషుని శ్రీమద్భాగవతంలో 'షష్ఠో భుజాన్తరమ్' అని, శ్రీకృష్ణుని భుజాంతరమైన వక్షస్థలంగా వివరించారు. ఈ స్కంధంలో 19 అధ్యాయాలు, 853 శ్లోకాలున్నాయి. అజామిళుడి కథతో ఈ స్కంధం ఆరంభమవుతుంది. భగవంతుని నామమాహాత్మ్యాన్ని ప్రకటించే అద్భుత ఆఖ్యానమే 'అజామీళోపాఖ్యానం'. వెనుకటి స్కంధంలోని నరకవర్ణనలు విన్ని పరీక్షిత్తు శుకుని 'ఆ నరకాలలో పడకుండా ఉండే మార్గం ఉపదేశించమని అడుగుతాడు. అప్పుడు ప్రాయశ్చిత్తాదులను వివరించగా, పరీక్షిత్తు ప్రాయశ్చిత్తాలను విని, పాపం చేయాలనే బుద్ధి పోయేటువంటి సర్వోత్కృష్ట ప్రాయశ్చిత్తాన్ని అడగ్గా శుకదేవుడు భగవంతుని నామమే సర్వపాప ప్రాయశ్చిత్తం, నామాన్ని ఆశ్రయించినట్లయితే పాపాలు నశిస్తాయి. దానికి దృష్టాంతంగా అజామిళుడు, అంటే మాయలో చిక్కుకున్న జీవుని కథ చెబుతాడు.

పాపి అయిన అజామిళుడు తన కుమారుని పేరు 'నారాయణ'ను అంత్యకాలంలో ఉచ్చరించి విష్ణులోకం పొందాడు. తెలిసికాని, తెలియక కాని చేసిన భగవన్నామస్మరణ ఫలాన్ని ఇస్తుంది. కనుకనే షష్ఠస్కంధ విశేషంగా 'అజామీళోపాఖ్యానా'న్ని చెప్పవచ్చు.

ఆ తర్వాత దక్షవంశ విస్తారం, నారాయణకవచం, విశ్వరూప వధ, వజ్రాయుధంతో ఇంద్రుడు చేసిన వృత్రాసురసంహారకథ, మరుద్గణ జననం, పుంసవనవిధి వర్ణనతో ఈ స్కంధం ముగుస్తుంది. హంసగుహ్య స్తోత్రంతో బాటు నారాయణకవచం చాలా విశేషాలతో వర్ణించబడింది. ఈ నారాయణ కవచంతోనే ఇంద్రుడు దానవులను జయించాడు. ఆపదలు, గ్రహపీడలు, అకాలమృత్యువు, దుష్కర్మలు మొదలైనవన్నీ దీనితో తొలగిపోతాయి. చిత్రకేతువు ఆఖ్యానం ఈ స్కంధంలో మరో విశేషం. దితి చేసిన పుంసవనవ్రత విశేషాలతో ఈ స్కంధం సమాప్తం అవుతుంది. చంచలమైన మనస్సును భగవానుని యందు స్థిరపరిచే సాధనమే వ్రతమని, దానికి సంపూర్ణ ఫలముంటుందని ఈ కథ తాత్పర్యం. ఈ విధంగా భగవంతుని నామ, రూప గుణాలతో ఈ స్కంధం అతిదివ్యంగా ప్రకాశించింది.

**సప్తమస్కంధం**

భగవంతుని దివ్యభుజాలలో ఒకటిగా సప్తమస్కంధం వర్ణించబడింది. ఈ స్కంధంలో 15 అధ్యాయాలు, 750 శ్లోకాలు ఉన్నాయి. ఈ స్కంధానికి 'ప్రహ్లాదచరిత్ర' అనే పేరు ఎక్కువ ప్రచారంలో ఉంది. భగవంతుని సుప్రసిద్ధమైన 'నరసింహావతార కథ' ఈ స్కంధంలోనిదే. ఈ స్కంధ ప్రారంభంలో పరీక్షిత్తు, "భగవంతుడు సర్వవ్యాపి, సముడు అని మీరు చెప్పారు కదా! అయితే ఈ జగత్తులో వైషమ్యం ఎందుకు గోచరిస్తోంది, భగవానుడు దేవతల పక్షం మాత్రమే ఎందుకు వహిస్తాడు?" అని పరిప్రశ్న చేయగా దానికి సమాధానంగా ఈ స్కంధాన్ని శుకుడు వివరించాడు. భగవంతుడి గుణాలను వర్ణించి ధర్మరాజు చేసిన రాజసూయ మహాయాగంలోని శిశుపాల మరణాన్ని చెప్పి, అక్కడ జరిగిన యుధిష్ఠిర నారదసంవాద రూపంగా ఈ ప్రహ్లాదచరిత్రను వర్ణించాడు.

'గోప్యఃకామాత్ భయాత్ కంసః' - భగవంతుని పొందడానికి కామం (గోపికలు), ద్వేషం (శిశుపాలుడు), భయం (కంసుడు), స్నేహం (పాండవులు), బంధుత్వం (యాదవులు), ఋషులు (భక్తి) మార్గాలుగా నారదుడు చెబుతాడు. భాగవతంలో ఇది చాలా విశేషమైన శ్లోకం. ముఖ్యంగా భక్తిలో వైరభక్తి, భయభక్తి అనేవి భాగవతంలో మాత్రమే వర్ణించబడ్డాయి. భగవంతుడు సముడు అని చెప్పడానికి అసురుడైన ప్రహ్లాదుడి కోసం ప్రత్యేకంగా అవతరించిన 'నరసింహావతార చరిత్ర'ను మొదలుపెట్టాడు. ప్రహ్లాదుడు జన్మతో రాక్షసుడు. కాని గుణాలలో దేవతల కంటె శ్రేష్ఠుడు. ప్రహ్లాదుడు అనగా ప్రకృష్టమైన బ్రహ్మానందాన్ని పొందినవాడు, ప్రజ్ఞానం బ్రహ్మగా తెలిసినవాడు. హిరణ్యకశిపు అంటే బంగారువస్త్రం ధరించినవాడు. అంటే భోగలాలసప్రవృత్తి కల్గినవాడు. ఇటువంటి విరుద్ధ స్వభావాలు కలిగిన ఆ ఇద్దరు పితాపుత్రులుగా అవతరించారు. విరుద్ధ స్వభావాలు కలిగినవారు ఒకచోట ఉంటే వారిద్దరి మధ్య ఉత్పన్నం అయ్యేది సంఘర్షణ. దీనిని ప్రధానం చేసుకొని సప్తమస్కంధం

కథ నడిచింది. భగవంతుడు లేడని వాదించే హిరణ్యకశిపునికి భగవంతుడు సర్వత్రా వ్యాపించి ఉన్నాడనే ప్రహ్లాదుడు జన్మించడం కథలో అతికీలకాంశం. ఈ స్కంధంలో మూడు వాసనలు వివరించబడ్డాయి. 1) సద్వాసన 2) అసద్వాసన 3) మిశ్రవాసన. హిరణ్యకశిపునిది అసద్వాసన, ప్రహ్లాదునిది సద్వాసన, మానవునిది మిశ్రవాసన. పోతన తన ఆంధ్రానువాదంలో ఈ ఆఖ్యానాన్ని విశేషమైన భక్తిభరితపద్యాలతో రక్తి కట్టించాడు. భాగవతంలోని నవవిధ భక్తులు శ్రవణం, కీర్తనం, స్మరణం, పాదసేవనం, అర్చనం, వందనం, దాస్యం, సఖ్యం, ఆత్మనివేదనం ప్రహ్లాదుడు చెప్పినవే. ముఖ్యంగా నవమాసాలు తల్లిగర్భంలో పెరిగి, నవవిధ రంధ్రాలతో బయటకు వచ్చిన మానవుడు ఈ నవవిధాత్మకమైన భక్తి లక్షణాలతో ముక్తి పొందవచ్చునని నవవిధ భక్తితత్త్వాన్ని వివరించాడు. ఇది భాగవతంలోని అన్ని స్కంధాలలో విస్తరించి ఉంది. ఈ తొమ్మిదింటిని ఆశ్రయించినా, లేదా ఏ ఒక్కటైనా పట్టుకున్నా ముక్తి పొందవచ్చు. అలాగే ప్రహ్లాదుని గుణాలు, స్థితప్రజ్ఞుడి లక్షణాలు ఒకటే. ప్రహ్లాదుడు ఎవరు అనే ప్రశ్నకు 'భారతీయ యువకుడు' అని సమాధానం చెప్పవచ్చు. అనగా భారతీయ యువకుడు ఎలా ఉండాలో ప్రహ్లాదుని పాత్రద్వారా భాగవతం నిరూపించింది. అనుభవించడానికి అన్నీ ఉన్నప్పటికీ దేనిపై ఆసక్తి లేకపోవడమే నిజమైన వైరాగ్యం. ఆ లక్షణం ప్రహ్లాదుడిలో కనబడుతుంది.

ప్రహ్లాదుడి కోసమే అవతరించిన స్వరూపం 'నృసింహుడు'. 'సత్యం విధాతుం నిజభృత్యభాషితం' అని ప్రహ్లాదుని మాటను సత్యం చేయడానికి ఆయన అవతరించాడు. ఏకకాలంలో ఆగ్రహం, అనుగ్రహం రెండింటిని చూపిన అవతారం నృసింహావతారం. వరాలు ఇస్తానన్నప్పటికీ భగవంతునినుంచి ముక్తిని తప్ప ప్రహ్లాదుడు ఐహిక సుఖాలను కోరలేదు. కనుకనే భాగవత భక్తులలో ప్రహ్లాదుడు అగ్రగణ్యుడయ్యాడు. అట్టి ప్రహ్లాదుని చరిత్రసారమే ఈ స్కంధం. దీనిలో ప్రహ్లాదుని ఉపదేశంగా ఎన్నో ధర్మాలు, మానవకర్తవ్యాలు, స్త్రీధర్మాలు, భక్తిశాస్త్రం చక్కగా వర్ణించబడ్డాయి. ప్రహ్లాద, అవధూత సంవాదంతో ఈ స్కంధం సమాప్తం అవుతుంది. సిద్ధపురుషుల లక్షణాలను వివరించిన విశేషస్కంధం సప్తమస్కంధం.

**అష్టమస్కంధం:**

భాగవతరూపుడైన భగవానుని భుజాలలో రెండవదిగా ఈ స్కంధం వర్ణించబడింది. మొత్తం 24 అధ్యాయాలతో, 931 శ్లోకాలతో బ్రహ్మసూత్ర తాత్పర్యంగా ఈ స్కంధం ఉంది. ఈ స్కంధంలో చాలా ఉపాఖ్యానాలున్నాయి. గజేంద్రమోక్షణం కథతో ప్రారంభమై మత్స్యావతారకథతో ముగిసింది. మధ్యలో సముద్రమథనఘట్టం, అమృతోద్భవం, మోహినీరూపంతో భగవానుని విశేషాలు, దేవాసుర సంగ్రామం, వామనావిర్భావం, బలి చక్రవర్తి కథ, వామన అవతార విశేషాలు ఉన్నాయి. మన్వంతరాల విషయాలు వివరిస్తూ నాలుగవ మన్వంతరంలో తామసుడనే మనువు కాలంలో భగవానుడు హరిరూపంలో అవతరించి గజేంద్రుని రక్షించాడు. ఇది ఆంధ్రదేశంలో అత్యంత జనాదరణ పొందిన ఘట్టమని చెప్పవచ్చు. పోతన భాగవతంలోని గజేంద్రమోక్షణం పద్యం రాని తెలుగువాడు ఉండడని ప్రసిద్ధి.

వేదాంతరూపంలో సంసారమే సరోవరంగా, జీవుడే గజేంద్రుడిగా, కాలమే మొసలిగా వర్ణించి, సాంసారిక విషయాలలో ఆసక్తులైన జీవులకు కాలజ్ఞానం కలగదనీ. బంధువులు ఎంతమంది ఉన్నా ఎవ్వరూ ఏమీ చేయలేరని గజేంద్రుడి దృష్టాంతంతో తెలియజేశారు. పరమాత్మ ఒక్కడే కాలంనుంచి మనల్ని విడిపిస్తాడు. భగవంతుని శరణు వేడితే ఆయన తప్పకుండా కాపాడతాడని గజేంద్రమోక్ష సారం. ఈ స్తోత్రాన్ని నిత్యం పఠిస్తే దుస్స్వప్న దోషాలు తొలగి, కష్టాలు తీరతాయి అని వ్యాసుడు ఫలశ్రుతి వ్రాశాడు.

సముద్రమథనం చాలా అద్భుతమైన ఆఖ్యానం. సంసారసముద్రాన్ని చిలికి జ్ఞానం, భక్తి అనే అమృతాన్ని పొందాలని ఈ ఘట్టం చెబుతోంది. శివలీలావైభవం ఈ కథలో విశేషంగా వర్ణించబడింది. ఆ తర్వాత వామనావతార చరిత్ర వర్ణించబడింది. శుక్రాచార్యుడి అనుగ్రహంతో దేవతలందరినీ పరాజితులను చేసి, స్వర్గ ఐశ్వర్యం హరించి వేసి బలిచక్రవర్తి ధర్మబద్ధంగా జీవించసాగాడు. అందువల్లనే శక్తితో కాక యుక్తిద్వారా భగవానుడు బలిని జయించడానికి బ్రాహ్మణకుమారునిగా అదితికి పయోవ్రత విశేషఫలంగా వామనుడిగా అవతరించాడు. బలిచక్రవర్తి చేసే యాగం దగ్గరకు వెళ్లి బలిని తన వశంలోకి తెచ్చుకున్నాడు. ఇక్కడ భగవానుడు ఎన్నో బ్రాహ్మణ ధర్మాలను వివరించాడు. ఆడినమాట తప్పలేక దానమివ్వడానికి సిద్ధపడిన బలిని శుక్రాచార్యులవారు శపించారు. గురు అనుగ్రహం పొందిన బలి గురుశాపం తెచ్చుకోవడమే కథలో అతికీలకాంశం. వామనుడు మూడు పాదాలతో సమస్తం ఆక్రమించి బలిని సుతలలోకానికి పంపాడు. ఈ కథలో వైరభక్తి కనబడుతుంది. శత్రువైన బలిని శిక్షించి రక్షించాడు. దానం వైశిష్ట్యాన్ని తెలియజేశాడు. 'కారే రాజులు రాజ్యములు గలుగవే' అనే మాటలతో ఈనాటి పాలకులందరికి కనువిప్పు కలిగేలా సూక్తులు చెప్పాడు. వామనావతార కథలో మానవుల జీవయాత్రకు అవసరమయ్యే చతుర్విధ పురుషార్థాలను ప్రసక్తాను ప్రసక్తంగా విశదీకరించడం జరిగింది. ఆ తర్వాత మత్స్యావతార కథ వర్ణించబడింది. ప్రళయాంభోనిధిలో బ్రహ్మ ముఖంనుంచి బయటపడ్డ వేదాలను దొంగిలించిన హయగ్రీవుని సంహరించి, వేదాలను ఉద్ధరించే కథ సుందరంగా చెప్పబడింది.

అష్టమస్కంధంలో పోతన తన ఆంధ్రభాగవతంలో కూడ అనేక అంశాలు వివరించాడు. గజేంద్రమోక్షణ కథలో శరణాగతభక్తిని నిరూపించాడు. విష్ణువు ధరించిన కూర్మం, మోహినీ, వామన, మత్స్యావతారాలను ఒకే స్కంధంలో వర్ణించడం విశేషం. పురుషార్థసాధనకు కర్మ, జ్ఞాన, భక్తి యోగాలు చెప్పి, భక్తియోగం వైశిష్ట్యాన్ని ప్రతిపాదించాడు. భగవంతుని అనుగ్రహాన్ని ఎలా పొందాలో, ఎటువంటి స్తోత్రాలు చేయాలో, భగవంతుని అనుగ్రహం ఎలా ఉంటుందో వివరించిన విశేష స్కంధం అష్టమస్కంధం.

**నవమస్కంధం:**

'కంఠస్తురాజన్నవమో యదీయో' అని పద్మపురాణ వచనం. అంటే భగవత్స్వరూప శ్రీ భాగవతంలో నవమస్కంధం భగవానుని కంఠస్థానంగా వర్ణించబడింది.





నవమస్కంధంలో 24 అధ్యాయాలు, మొత్తం 961 శ్లోకాలు ఉన్నాయి. బుద్ధిలోపల పరమాత్మ ఉంటే పూర్ణశాంతిగా ఉంటుంది. కామవాసన మిగిలినంతవరకు భగవంతుడు రాడు. పరీక్షిత్తులోని కామవాసనను సమూలంగా తొలగించి శ్రీకృష్ణ దర్శనం చేయించి ముక్తి కలిగించడానికి నవమస్కంధంలో సూర్యచంద్రవంశాల కథను వినిపించాడు. ధర్మాన్ని రక్షించే బాధ్యత రాజులది. ధర్మాధర్మాలలో రాజుల ప్రవర్తన ఎలా ఉందో చెప్పడానికి ఈ స్కంధంలో రాజుల చరిత్రలు చెప్పబడ్డాయి. ఒక ప్రణాళిక ప్రకారం స్కంధాలు నడవడం విశేషం. సప్తమస్కంధంలో నరసింహావతార కథలో క్రోధనాశనం, వామనుడి చరిత్రలో అష్టమంలో లోభనాశం, ఈ స్కంధంలో శ్రీరామచరితంలో కామనాశం చేసే విధానం అద్భుతంగా వర్ణించబడింది. కామక్రోధ లోభాలు నశిస్తే కృష్ణుడు ఆవిర్భవిస్తాడు అని దశమస్కంధం వివరించింది.

ఈ స్కంధంలో మొదట సూర్యవంశపురాజుల చరిత్ర వర్ణించబడింది. సూర్యవంశానికి మూలపురుషుడు వైవస్వతమనువు. ఆయన కుమారుడు నభగుడు. నభగునికి నాభాగుడు, నాభాగునికి అంబరీషుడు జన్మించాడు. మహావిష్ణుభక్తుడు అంబరీషచక్రవర్తి ద్వాదశి వ్రతపరాయణుడు. ఎవనికి లోపల, బయట అంతట ఈశ్వరుడున్నాడో అతడే అంబరీషుడు. శుద్ధభక్తిస్వరూపుడు. దుర్వాసుడు అతనికి ఆటంకం కలిగించగా విష్ణుభగవానుడి సుదర్శనచక్రంతో దుర్వాసగర్వభంగం అయింది. ఆ తర్వాత 'సౌభరిఋషి' చరిత్ర వర్ణించబడింది. భగీరథుడి చరిత్ర, గంగావతరణ ఘట్టం అద్భుతంగా వర్ణించబడ్డాయి. ఆ తర్వాత శ్రీరాముడి చరిత్ర వర్ణించబడింది. రామాయణ కథ మొత్తం ఇందులో రావడం విశేషం. యయాతి చరిత్ర, త్యాగగుణాన్ని వర్ణించే రంతిదేవచరిత్ర, ఆ తర్వాత యదువంశ వివరణ, సంక్షిప్త శ్రీకృష్ణకథతో ఈ స్కంధం ముగుస్తుంది.

**దశమస్కంధం**

"ముఖారవిందం దశమం ప్రఫుల్లమ్" అని వికసించిన కమలం వంటి ముఖం కలిగిన శ్రీకృష్ణుని ముఖంగా ఈ స్కంధం కీర్తించబడింది. శ్రీకృష్ణుడి సంపూర్ణ జీవితచరిత్ర ఈ దశమస్కంధం నిండా వ్యాపించి ఉండడంవల్ల దీనికి ఎనలేని విశిష్టత కలిగింది. దశమస్కంధంలో మొత్తం తొంభై అధ్యాయాలు ఉన్నాయి. భక్తులు దీనిని భాగవతఫలంగా భావిస్తారు. ఈ స్కంధాన్ని రెండు భాగాలుగా 1) పూర్వభాగం, 2) ఉత్తరభాగంగా విభజించారు. భూమండలంలో రాక్షసుల ఆగడాలు పెరిగిపోగా భూదేవి గోరూపం పొంది ఆక్రందించగా, బ్రహ్మాది దేవతలు అంతా కలిసి విష్ణువును ప్రార్థించగా భగవానుడు భూభారం తీర్చడానికి తాను అవతరిస్తానని చెప్పి దేవకీ వసుదేవుల గృహంలో ఆవిర్భవించడంతో కథ మొదలవుతుంది. వసుదేవుడు శుద్ధ సత్త్వగుణస్వరూపుడు. విశుద్ధ చిత్తమే వసుదేవుడు. దేవకి నిష్కామబుద్ధి. వీరిరువురి కలయిక వలన భగవానుడు ఆవిర్భవిస్తాడు - అని డోంగ్రే మహారాజుగారు వ్యాఖ్యానించారు. శ్రీకృష్ణుడు మధురలో ఆవిర్భవించి గోకులానికి వెళ్లాడు. శరీరమే మధుర అని, హృదయం గోకులం అని అంటారు. అక్కడే భగవానుడు నివసిస్తాడు. శ్రీకృష్ణ బాల్యలీలలు పూతన కథతో మొదలవుతాయి. పూతన సంహారం జరిగిన

తర్వాత శకటాసురభంజనం, తృణావర్త మోక్షణం మొదలైన అసురసంహారఘట్టాలు వస్తాయి. భాగవతం ప్రత్యేకత ఇక్కడే మనకు కనబడుతుంది. రాక్షసులను సంహరించడం వారికి ముక్తిని ప్రసాదించడానికే అని వివరించాడు శ్రీశుకుడు. అందువల్లనే భగవానుడు తన మనస్సులో 'విషమిచ్చే పూతనకు మోక్షాన్ని ఇస్తే నిత్యం నవనీతమధుర పదార్థాలు తనకు ఇచ్చే ఈ నందవ్రజవాసులకు ఇంతకంటె అధికమైనది నేను ఏమివ్వాలి?" అనుకొన్నాడట. ఇటువంటి మధుర వ్యాఖ్యలతో దశమస్కంధం సాగుతుంది. శ్రీకృష్ణుడి ప్రతి లీలలో రహస్యం ఉంది. వెన్నను దొంగిలించడం అనే లీల 'మనస్సు వెన్నవలె మృదువైనది. మనస్సును అపహరించటమే నవనీత అపహరణం. కనుకనే 'కర్షతి చిత్తం ఇతి కృష్ణః' చిత్తాన్ని ఆకర్షించేవాడే శ్రీకృష్ణుడు. మట్టి తినడం, ఉలూఖల బంధనం, యమళార్జునభంజనం మొదలైనవి ఎంతో అద్భుతంగా ఈ స్కంధంలో వర్ణించబడ్డాయి. కాళీయమర్దనం, గోవర్ధనోద్ధరణం విశేష ప్రాధాన్యత కలిగిన ఘట్టాలు. గో అనగా భక్తి, జ్ఞానం. ఈ రెండింటిని వృద్ధిచేసే లీలే గోవర్ధనలీల.



**రాసపంచాధ్యాయి:** దశమస్కంధంలో 29 నుండి 33వ అధ్యాయం వరకు 5 అధ్యాయాలలో వర్ణించబడింది శ్రీకృష్ణరాసలీలావైభవం. దీనిని 'రాసలీలా పంచాధ్యాయి' అనే పేరుతో పిలుస్తారు. వ్రజలీలకు పరాకాష్ఠ ఈ రాసలీల. ఆత్మారాముడగు శ్రీకృష్ణుని ఆత్మ రాధ. బాలుడు తన ప్రతిబింబంతో క్రీడించినట్లు శ్రీకృష్ణుడు ఆత్మరూపిణులగు వ్రజగోపికలతో క్రీడించిన లీల రాసలీల. రాస శబ్దానికి మూలం రసం. రసం స్వయంగా శ్రీకృష్ణభగవానుడే. 'రసో వైసః' అని శ్రుతి కీర్తించింది. ఇది అప్రాకృతలీల. ఇది శంకింపదగినది కాదు. లౌకికమైన అర్థంతో చూస్తే ఇది తెలియదు. రాసలీలలోని అయిదు అధ్యాయాలు అయిదు ప్రాణాలను సూచించేవి. పంచప్రాణాలు ఈశ్వరునితో రమించడమే రాసమని శ్రీధరస్వామి వ్యాఖ్యానం. కోరికలను జయించాలంటే నిత్యం ఈ 5 అధ్యాయాలను పారాయణం చేయాలంటారు. ఈ రాసలీల అనుకరింపదగినది కాదు, ఆలోచించతగినది. కామనాశనమే దీని ఫలం.

అక్రూరుడి వందనభక్తి, చాణూరముష్టికుల వధ, కంససంహారం, భగవానుడి గురుకులవాసం, ఉద్ధవగమనం మొదలైన కథలతో 48వ అధ్యాయం వరకు వ్రజలీలలు వర్ణింపబడ్డాయి. 49వ అధ్యాయంనుంచి శ్రీకృష్ణుడి రాజసలీల మొదలవుతుంది. జరాసంధయుద్ధం, రుక్మిణీకళ్యాణం ప్రధానఘట్టాలు. రుక్మిణీకళ్యాణంతో దశమస్కంధ పూర్వార్థం ముగుస్తుంది. శ్రీకృష్ణునికి అష్టవిధ భార్యలున్నారు. వీరేకాక 16,108 మంది పత్నులు ఉన్నారు. ఇంతమంది ఉన్నప్పటికీ శ్రీకృష్ణుడు బ్రహ్మచర్యవ్రతాన్ని వదలలేదు. జరాసంధ కథ, శిశుపాలసంహారాలతో ఉత్తరార్థం మొదలవుతుంది. శిశుపాలుడంటే కోపం. అటువంటి క్రోధాన్ని సుదర్శనచక్రం ద్వారా, అంటే జ్ఞానం ద్వారా భగవంతుడు నాశనం చేశాడు. కోపాన్ని జయించాలంటే జ్ఞానం కావాలి.

శ్రీమద్భాగవత ఉత్తరార్థంలో వచ్చే మరొక విశేషచరిత్ర కుచేలోపాఖ్యానం. భాగవతకథను శుకుడు చెబుతూ రెండుసార్లు సమాధిస్థితిని పొందాడు. ఆ రెండు సందర్భాలు ఒకటి బ్రహ్మస్తోత్రం, రెండవది ఈ కుచేలుడి కథను చెప్పినప్పుడు. ముఖ్యంగా ఈ ఘట్టంద్వారా మైత్రిని వివరించాడు. నిజమైన స్నేహంలోనే నిస్వార్థత ఉంటుంది. అందుకే మంచి స్నేహితులకు ఉదాహరణ కృష్ణకుచేలులే. సుదాముడు నిస్వార్థంగా, నిరపేక్షంగా భగవానుని ప్రేమించాడు. అందువల్లనే భాగవతంలో నిర్గుణభక్తులలో 1) ప్రహ్లాదుడు, 2) కుచేలుడు మాత్రమే వర్ణించబడ్డారు. సుభద్రాపహరణం, శ్రుతిగీతలు, విష్ణుసేవా ప్రాశస్త్యం, భృగుమహర్షి త్రిమూర్తులను పరీక్షించటం, శ్రీకృష్ణుడు మృతుడైన బ్రాహ్మణకుమారుడిని తీసుకురావటం, కృష్ణుడి వంశానుక్రమంతో దశమస్కంధం ముగుస్తుంది.

మొత్తం 2940 శ్లోకాలు ఈ స్కంధంలో ఉన్నాయి. స్త్రీలు గర్భిణులుగా ఉన్నకాలంలో 3వ నెలనుంచి 9 నెలల పర్యంతం ఈ దశమస్కంధాన్ని నిత్యం పారాయణం చేయడం ద్వారా శ్రీకృష్ణునివంటి పుత్రుడు కలుగుతాడని పెద్దలు చెప్పారు. ప్రేమభక్తిని బోధించే ప్రేమస్వరూప శ్రీకృష్ణముఖారవింద సదృశమైన ఈ దశమస్కంధం అత్యద్భుతం, అప్రమేయం, అనంతకల్యాణగుణాలమయం, ఆనందసంధాయకం.

**ఏకాదశస్కంధం**

'ఏకాదశోయస్యలలాటపట్టం' అని పద్మపురాణంలో ఈ స్కంధాన్ని లలాట ప్రదేశంగా అభివర్ణించారు. ఈ స్కంధంలో 31 అధ్యాయాలు, మొత్తం 1967 శ్లోకాలున్నాయి. ఈ స్కంధం మొత్తం తత్త్వప్రధానంగా కనబడుతుంది. నిమినవయోగీంద్రసంవాదం అనే పేరుతో మొదటి 5, 6 అధ్యాయాలలో అనేక ప్రశ్నలకు సమాధానాలు ఇవ్వడం జరిగింది. శ్రీకృష్ణుడు-ఉద్ధవుల సంవాదరూపంగా 6వ అధ్యాయంనుంచి 29వ అధ్యాయం వరకు అనేక విషయాల సమాహారంగా 'ఉద్ధవగీత' ఉంది. మహాభారతంలోని భగవద్గీతలా ఈ ఉద్ధవగీతలో ఎన్నెన్నో విషయాలను అద్భుతంగా వర్ణించడం విశేషం. జ్ఞాన, కర్మ, భక్తి యోగాలు, సాంఖ్య యోగం, గుణత్రయవిభాగం దీనిలో మనకు కనిపిస్తుంది. ముఖ్యంగా భగవానుడు ఉద్ధవునికి చెప్పిన యదుఅవధూత సంవాదంలో 24 మంది గురువుల లాభం ఈనాటి సమాజం కోసం చెప్పినదే అనడంలో సందేహం లేదు. యదుమహారాజుకు అవధూత తాను 24 మంది నుంచి 24 విషయాలు నేర్చుకున్నానని వివరించాడు.

1) పృథివి - ధైర్యం; 2) వాయువు - సర్వవ్యాపకత్వం;

3) ఆకాశం - అపరిచ్ఛిన్నత్వం; 4) జలం - నిర్మలత్వం, పావనం;

5) అగ్ని - సర్వభక్షకత్వం, ఉత్పత్తి వినాశముల అలక్ష్యత్వం;

6) చంద్రుడు - క్షయ, వృద్ధి, 7) సూర్యుడు - విషయఅనాసక్తి;

8) పావురం - దారాపుత్రాదులయందు ఆసక్తివల్ల వచ్చే నష్టం;

9) అజగరం - యదృచ్ఛాప్రాప్తద్రవ్యం; 10) సముద్రం - గంభీరత్వం;

11) మిడత - మోహం వల్ల వచ్చే చెడు;

12) తుమ్మెద - మాధుకరీవృత్తి; 13) ఏనుగు - సుఖాసక్తివల్ల అనర్థం;

14) తేనెను తీసేవాడు - జీవితం గడిపే విధానం;
15) హరిణం - గానంలో అనాసక్తి; 16) చేప - జిహ్వాసక్తి;
17) పింగళ - నైరాశ్యం; 18) కురరీపక్షి - విషయాలలో అనాసక్తి;
19) బాలుడు - చింతాశూన్యత్వం; 20) కుమారి - సంగవర్జనం;
21) బాణకారుడు - చిత్తైకాగ్రత; 22) సర్పం - ఏకచరత్త్వం;
23) సాలెపురుగు - సృష్టిప్రళయం 24) భ్రమరం - వస్తువు యొక్క సారూప్యం

అని 24 మంది గురువుల వివరణ ఇచ్చాడు. శ్రీకృష్ణనిర్గమనం, ద్వారక సముద్రంలో కలవడం మొదలైనవాటితో ఈ ఏకాదశస్కంధం ముగిసింది.

**ద్వాదశస్కంధం**

"శిరోసితు ద్వాదశ ఏవభాతి' అని ద్వాదశస్కంధాన్ని శ్రీకృష్ణ మస్తకంగా వర్ణించారు. ఇది చాలా చిన్న స్కంధం. మొత్తం 13 అధ్యాయాలు, 565 శ్లోకాలు ఉన్నాయి. కలియుగ రాజవంశవర్ణనలతో ఈ స్కంధం మొదలైంది. భవిష్యత్తులో భారతదేశాన్ని పాలించే మహారాజులు, యుగధర్మాలు, కలియుగంలో హరినామసంకీర్తనం, ప్రళయం, పరమార్థాలను ఈ స్కంధంలో వివరించాడు. శిశు, నాగ, మౌర్య, శుంగ, కాణ్వ, ఆంధ్ర, ఆభీర, గర్దిభీ, కంకులు,యవనులు, తురుష్కులు, గురుండులు, మౌలులు, పంచకిలకిలలు మొదలైన రాజుల చరిత్రలు ఇందులో ఉన్నాయి.

వేయి చతుర్యుగాలు బ్రహ్మకు ఒక్క పగలు. అంతే కాలం రాత్రితో సమానం. బ్రహ్మదేవుడికి నూరుసంవత్సరాలు పూర్తికాగా ప్రకృతప్రళయం కలుగుతుంది. బ్రహ్మాండాలు నశిస్తాయి. ఈ విషయాలు విన్న తర్వాత పరీక్షిత్తు శ్రీహరియందు సమస్త ఇంద్రియ వ్యాపారాలను కేంద్రీకరించి, ఆయనకు చిత్తాన్ని సమర్పించి శుకమహర్షి అనుమతితో తక్షకుడికి శరీరసమర్పణం చేసి భగవంతుని పొందాడు. ఆ తర్వాత జనమేజయ సర్పయాగం, బ్రహ్మసృష్టి, చతుర్వేదలక్షణాలు, పౌరాణికుల నామాలు, పురాణలక్షణాలు, మార్కండేయుని తపస్సు, పరమశివ అనుగ్రహం, క్రియాయోగం, ఆదిత్యుని పన్నెండునామాలు, భాగవత గ్రంథ ప్రశస్తిని వర్ణించడంతో ఈ స్కంధం ముగుస్తుంది. శ్రీమద్భాగవతపఠనం చతుర్వేద పఠనంతో సమానమని సూతులవారు వివరించారు.

**ఉపసంహారం**

ప్రథమ స్కంధంలో అధికారలీల, ద్వితీయస్కంధంలో జ్ఞానలీల, తృతీయ, చతుర్థ స్కంధాలలో సర్గవిసర్గలీలలు, పంచమస్కంధంలో స్థితిలీల, షష్ఠమ స్కంధంలో పుష్టిలీల, సప్తమంలో వాసనాలీల, అష్టమ స్కంధంలో వాసనను నాశం చేసే చతుర్విధోపాయాలు, నవమస్కంధంలో ఈశాను కథాలీల, దశమస్కంధంలో నిరోధ లీల, శ్రీకృష్ణలీలలు, ఏకాదశంలో ఉపసంహారలీల, ద్వాదశస్కంధంలో ఆశ్రయలీల అనే విషయాలు వివరించబడ్డాయి.

శ్రీమద్భాగవతం మానవునికి అభయాన్ని ఇస్తుంది. అంటే నిర్భీతిని కలిగిస్తుంది. ధ్రువుడు మృత్యువు శిరస్సుపై పాదం పెట్టి స్వర్గానికి వెళ్ళాడు. ప్రపంచంలో అందరూ

మృత్యువుకు భయపడతారు. చాలామంది మృత్యువును అమంగళంగా భావిస్తారు. కాని మన భారతీయ సంప్రదాయంలో పుట్టుకకు ఎంత ప్రాధాన్యత ఉన్నదో, మృత్యువుకు అంతే ప్రాధాన్యత ఉంది. మనిషి పుట్టినప్పుడు సంస్కారాలు, వెళ్ళేటప్పుడు జీవప్రాయశ్చిత్త, దేహప్రాయశ్చిత్త, కర్మప్రాయశ్చిత్త మొదలైన సంస్కారాలు ఉన్నాయి. కనుక అటువంటి మృత్యువును మంగళమయంగా చేసే గ్రంథం శ్రీమద్భాగవతం. మృత్యువు అంటే కాలం. అటువంటి కాలం పరమేశ్వర సేవక స్వరూపం. పరమాత్మ స్వరూపమైన శ్రీమద్భాగవతాన్ని పట్టుకున్నట్లయితే మృత్యువు మనకు భయపడుతుంది. కనుక భాగవతం మరణాన్ని బాగుపరుస్తుంది. పరీక్షిత్తు మనకు ప్రబల దృష్టాంతం. కాలం తక్షక స్వరూపంలో రాగా పరీక్షిత్తు ఈ విధంగా అన్నాడు 'నాకిప్పుడు కాలభయం లేదు. మృత్యుభీతి నాకు కలగడం లేదు'. అంటే శ్రీమద్భాగవతాన్ని సప్తాహంగా విన్నందువల్ల పరీక్షిత్తు మృత్యువును జయించాడు. మనం పరీక్షిత్తులం కావాలి. కనుకనే శుకుడు 'పిబత భాగవతం' అని భాగవతాన్ని కడుపారా తాగమన్నాడు. భాగవతాన్ని తాగి (చదివి) మనందరం భాగవతులమవుదాం.



# మహాభారత ఆలోకనము

నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమమ్
దేవీం సరస్వతీం చైవ తతో జయముదీరయేత్'

ధర్మేచార్థేచ కామేచ మోక్షేచ భరతర్షభ
యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి నతత్క్వచిత్॥

ధర్మవిషయంలో కాని, అర్థకామాలలో కాని, మోక్షసంబంధమైన విషయంలో కాని ఏదైతే అన్నిచోట్ల చెప్పబడిందో అది మహాభారతంలోనిదే. ఇక్కడ ఏది చెప్పబడలేదో అది ఎక్కడా లభించదు. కనుకనే మహాభారతం ఒక విశ్వవిజ్ఞానకోశమే అని విజ్ఞుల భావన.

'మహత్వేచ గురుత్వేచ ధ్రియమాణంయతోధికం
మహత్వాత్ భారవత్వాచ్చ మహాభారతముచ్యతే'

గ్రంథాధిక్యతలో, అర్థాధిక్యతలో గొప్పది కావడంచేత మహాభారతమని అన్నారు. సనాతనధర్మాన్ని ప్రతిపాదించే గ్రంథాలలో వేదాల తర్వాత మహాభారతానికే అధిక ప్రాధాన్యత ఉంది. కనుకనే మహాభారతాన్ని పంచమవేదమని కీర్తించారు.[1] ఇందలి రచన చాల గంభీరం. పరిశోధించే దృష్టితో చూస్తే కాని గ్రంథం అర్థం కాదు. ఈ గ్రంథంలోని శ్లోకాలు బయట ఒక అర్థం, లోపల మరొక అర్థాన్ని స్ఫురింపచేస్తాయి. కనుకనే 'భారతేత్వర్థ గౌరవం' అని అన్నారు. ఈ అర్థగౌరవం అతిగంభీరమైనది కాబట్టి సమన్వయం చాలా కష్టం అవుతుంది.

ఈ మహాభారతానికి జయమని, భారతమని, మహాభారతమని మూడు పేర్లు కనబడుతున్నాయి. జయమనగా 8800 శ్లోకాలని, దీనిని వ్యాసుడు రచించాడని, వైశంపాయన కృతమైన భారతసంహిత 24 వేల శ్లోకాలని, మిగిలినవి లక్ష శ్లోకాలని కొంతమంది వాదన. కాని ఇది ఆమోదయోగ్యం కాదు. జయం, భారతం, మహాభారతం అనేవి పర్యాయ పదాలు. సంస్కృతములో జ '8'కి, య '1'కి సంకేతాలు. 'అంకానాం వామతో గతిః' అనే విధానాన్ని బట్టి జయమనగా 18 అని అర్థం. భారతానికి, 18 సంఖ్యకు దగ్గరి సంబంధం ఉంది. భారతంలోని పర్వాల సంఖ్య 18. యుద్ధం జరిగిన రోజులు 18. యుద్ధంలో పాల్గొన్న అక్షౌహిణులు మొత్తం 18.

వేదాలు
వేదాలు
వేదాలు
గీతోపదేశం వేదాలు
ఇతిహాసాలు
పురాణాలు
ఉపనిషత్తు

భగవద్గీతలో మొత్తం అధ్యాయాలు 18. ఈ మహాభారతం మొత్తం లక్ష పైచిలుకు శ్లోకాలతో విస్తారమై ఉంది. తెలుగులో కవిత్రయం నన్నయ, తిక్కన, ఎర్రనలు భారతాంధ్రీకరణం చేశారు. వ్యాసభారతం ధర్మశాస్త్రంగా, వేదాంతశాస్త్రంగా, నీతిశాస్త్రంగా, మహాకావ్యంగా, సర్వలక్ష్యసంగ్రహంగా, ఇతిహాసంగా, బహుపురాణ సముచ్చయంగా - ఇలా అనేక లక్షణాలతో విలసిల్లుతోంది. ఇన్ని లక్షణాలు ఉన్న గ్రంథం మరే సారస్వతంలో లేదు. కనుకనే మహాభారతం విశ్వవిజ్ఞానకోశం.

మహాభారత పర్వాలను ఈ విధంగా విభజించారు. ఆదిపంచకం, యుద్ధషట్కం, శాంతిసప్తకం. ఆదిపంచకం అంటే 1) ఆది 2) సభా 3) అరణ్య 4) విరాట 5) ఉద్యోగపర్వాలు. యుద్ధషట్కం అంటే 6) భీష్మ 7) ద్రోణ 8) కర్ణ 9) శల్య 10) సౌప్తిక 11) స్త్రీపర్వాలు. శాంతిసప్తకం అంటే 12) శాంతి 13) అనుశాసనిక 14) అశ్వమేధ 15) ఆశ్రమవాస 16) మౌసల 17) మహాప్రస్థాన 18) స్వర్గారోహణ పర్వాలు. ఇవి మొత్తం 18.

శ్రీకృష్ణభగవానుడు ఎప్పుడు అవతారం ముగించాడో అప్పుడే కలియుగం ప్రవేశించింది. కలియుగం ప్రారంభమైన తర్వాత నూరు సం.ల ప్రాంతంలో వ్యాసులవారు మహాభారతరచన చేసి ఉంటారు. ఇంతటి గొప్ప గ్రంథానికి లేఖకుడు గణపతి. ఆదికవి శబ్దవాచ్యుడు, విద్యానిధి అయిన గణపతి కూడా లిఖిస్తూ లిఖిస్తూ ఆగి ఆలోచించవలసివచ్చిన శ్లోకాలు మహాభారతంలో ఉన్నాయంటే ఇక సామాన్యుల మాట ఎలా ఉంటుందో ఊహించుకోవచ్చు. మహాగాంభీర్యంతో కూడిన రచనగా దీనిని పేర్కొంటారు. ఇట్టి మహాభారతానికి నీలకంఠ పండితుడు 'భారతభావదీపము' అనే పేరుతో వ్యాఖ్యానం చేశాడు. 'ధర్మో రక్షతి రక్షితః' అనే సూత్రాన్ని వ్యాఖ్యానించిన గ్రంథం మహాభారతం.

**భారతకథాసారం**

**ఆదిపర్వం**

భారతకథాప్రస్తావనతో ఈ పర్వం మొదలవుతుంది. ఈ పర్వంలో ఉదంకోపాఖ్యానం, గరుడోపాఖ్యానం, జరత్కారువు చరిత్ర, జనమేజయ సర్పయాగం, జనమేజయునికి భారతకథను చెప్పటానికి వైశంపాయనుడు రావడంతో భారతకథ మొదలవుతుంది. ఉపరిచర వసువు, మత్స్యగంధి అవతారం, శ్రీ వేదవ్యాసులవారి అవతారం దేవతల అంశతో భీష్మాది వీరుల పుట్టుక, కౌరవవంశ వివరణం, కచదేవయాని కథ, యయాతిచరిత్ర, శకుంతలా దుష్యంతుల చరిత్ర, గంగాశంతనుల ప్రేమవివాహం, భీష్ముడిశపథం, ధృతరాష్ట్ర పాండుజననం, కుంతి చరిత్ర, పాండురాజుకు శాపం కలగడం, కుంతికి ధర్మరాజాదులు జన్మించడం, మాద్రికి నకులసహదేవులు జన్మించడం, కృపాచార్య, ద్రోణాచార్యుల జననం, ఏకలవ్యచరిత్ర, కుమార అస్త్రవిద్యాభ్యాసం, కర్ణ, అర్జునుల ద్వంద్వయుద్ధం, ద్రుపదుడి చరిత్ర, ధృతరాష్ట్రుడు పాండవులను వారణావత నగరానికి పంపటం, లాక్షాగృహదహనం, హిడింబా భీముల చరిత్ర, వ్యాసోపదేశం, ఘటోత్కచజననం, ద్రౌపది జన్మం, తపతీసంవరణోపాఖ్యానం, ద్రౌపదీస్వయంవరం, అర్జునుడు ద్రౌపదిని గెలవడం,

ద్రుపదుడికి వేదవ్యాసుడు పంచేంద్రోపాఖ్యానం చెప్పడం, పాండవులు ద్రుపదపురంలో సుఖంగా ఉండడం, భీష్మద్రోణులు దుర్యోధనునికి బుద్ధిచెప్పడం, పాండవులు హస్తినాపురానికి రావడం, విశ్వకర్మ ఇంద్రప్రస్థ పట్టణాన్ని నిర్మించి ఇవ్వడం, సుందోపసుంద ఉపాఖ్యానం, అర్జునవివాహాలు, ఖాండవదహనం, మందపాలోపాఖ్యానంతో ఆదిపర్వం ముగుస్తుంది.

అంటే ఆదిపర్వంలో పాండవుల పుట్టుక, స్వయంవరాదులు మొదలైన కీలక కథలతో పాటు అనేక ఉపాఖ్యానాలు రావటం విశేషం. ముఖ్యంగా గురుశిష్యసంబంధమైన అనేక కథలు ఈ పర్వంలో కన్పిస్తాయి. ప్రాచీన భారతీయ విద్యావిధానం ఎలా ఉండేదో గురుశిష్య ప్రధాన కథలలో వ్యాసులవారు వర్ణించారు.

**సభాపర్వం**

మహాభారతంలో సభాపర్వానికి చాలా ప్రాధాన్యత ఉంది. రామాయణంలో అరణ్యకాండ వలె భారతంలో సభాపర్వం కథకు కీలకం. రామాయణంలో అరణ్యకాండలో జరిగిన సీతాపహరణం రావణమరణానికి కారణమైనట్లు ఈ సభాపర్వంలో జరిగిన ద్యూత, ద్రౌపదీవస్త్రాపహరణాదులు కురుక్షేత్రమహాసంగ్రామానికి కారణమయ్యాయి. ఈ పర్వం మయుడు నిర్మించిన అపూర్వ సభావృత్తాంతంతో, లోకపాలాదుల సభావృత్తాంతాలతో సార్థకనామధేయాన్ని కలిగి ఉంది.

మయుడు ధర్మరాజుకు సభను నిర్మించి ఇవ్వడంతో కథాభాగం మొదలవుతుంది. నారదుడు ధర్మరాజుకు రాజనీతి విషయాలను చెప్పడం, ఇంద్రసభ, యమసభ, వరుణసభ, కుబేరసభ, బ్రహ్మసభ మొదలైన సభల వర్ణన, హరిశ్చంద్ర కథ, ధర్మరాజు రాజసూయ యాగం, జరాసంధుని భీముడు వధించడం, అర్జునుడు ఉత్తరదిగ్యాత్రలు చేయడం, ధర్మరాజు కృష్ణునికి ప్రధాన అర్ఘ్యమివ్వడం, శిశుపాలసంహారం, పాండవుల సభను చూచి దుర్యోధనుడు ఈర్ష్య చెందడం, దురాలోచనం, విదురుడు ధర్మరాజును ఆహ్వానించడం, శకునితో జూదం ఆడడం, ధర్మరాజు ఓటమి, ద్రౌపదీ పరాభవం, భీముడి ప్రతిజ్ఞ, ధృతరాష్ట్రుడు ద్రౌపదికి వరాలు ఇవ్వడం, ధర్మరాజు రెండవసారి జూదం ఆడడం. పాండవులు అడవికి పోవడంతో సభాపర్వం ముగుస్తుంది.

మహాభారతంలో కథకు మూలకేంద్రం సభాపర్వం అని చెప్పవచ్చు. జూదమనే క్రీడ మంచిది కాదని చూపించారు. సర్వ కౌరవసంహారానికి ప్రధాన కారణమైన శక్తిస్వరూపిణి ద్రౌపది అని గుర్తించిన ధర్మరాజు ద్రౌపదిని కూడ అడవికి తీసుకొని వెళ్లాడు.

'దైవంహి ప్రజ్ఞాం ముష్ణాతి చక్షుస్తేజ ఇవాపతత్
ధాతుశ్చవశమన్వేతి పాశైరివ నరస్సితః'

పురాతన కర్మఫలాన్ని ప్రవర్తింపచేసే దైవబలం ముందుపాశాలతో కట్టబడినవానివలె స్వాధీనమగును గదా అని ధర్మరాజు జూదానికి వెళ్లాడు. అంటే తెలిసి కూడా దైవవిధి అనుకొని పాండవులు వెళ్లారు. కనుక భావికథకు మూలస్థానంగా ఈ సభాపర్వాన్ని చెప్పవచ్చు.

**అరణ్యపర్వం**

పాండవులు 12 సంవత్సరాలు వనవాసం జరిపిన వృత్తాంతం కనుక 'అరణ్యపర్వం' అనే సార్థకనామాన్ని వ్యాసుడు పెట్టాడు. నిజంగా ఈ కథను సంక్షేపంగా ముగించివేయవచ్చు, లేక పాండవుల తీర్థయాత్రాదులను వర్ణించవచ్చు. కాని ఆ విధంగా కాక వ్యాసుడు ఈ అరణ్యపర్వంలో అనేక ఉపాఖ్యానాలను, కథలను చేర్చి, చదివేవారికి ఆసక్తి కలిగేలా చేశాడు.

శౌనకుడు ధర్మరాజుకు ధర్మాలు చెప్పడంతో కథ మొదలవుతుంది. ధర్మరాజుకు సూర్యుని అనుగ్రహప్రాప్తి, కిమ్మీరసంహారం, పాండవుల సంవాదాలు, కిరాతార్జునీయం, ఇంద్రసభలో అర్జునచరిత్ర, నలోపాఖ్యానం, అగస్త్యచరిత్ర, ఋష్యశృంగుని ప్రస్తావన, పరశురామజయం, మాంధాతృచరిత్ర, భీముని సౌగంధికహరణం, నహుషప్రశ్నలు, ధర్మరాజుకు మార్కండేయ ఉపదేశం, ధర్మవ్యాధోపాఖ్యానం, కుమారస్వామి చరిత్ర, ద్రౌపదికి సత్యభామ ఉపదేశాదులు, దుర్యోధనుని ఘోషయాత్ర, ప్రాయోపవేశం, సైంధవపరాభవం, ధర్మరాజుకు మార్కండేయుడు రామాయణ కథ చెప్పడం, సావిత్రి ఉపాఖ్యానం, కర్ణుడి జన్మవిషయం, యక్షప్రశ్నలు వంటి ఘట్టాలతో ఈ పర్వం నడుస్తుంది.

ముఖ్యంగా క్లేశం పొందిన పాండవులు మహాత్ముల సాంగత్యంతో, ఉపదేశాదులతో గడపడం ఇందులో ప్రధాన ఇతివృత్తం. ధర్మరాజు తాను పెద్ద కష్టంలో చిక్కుకున్నానని మార్కండేయునికి చెప్పగా, అతనికి ధైర్యం కలిగించడానికి నలోపాఖ్యానం, శ్రీరామాయణం చెబుతాడు. కష్టాలు కలిగినపుడు మానసికధైర్యం కోసం సద్గ్రంథాలను ఆశ్రయించడం ద్వారా కష్టాలు తొలగిపోతాయని ధర్మరాజుకు మహర్షులు ఉపదేశించారు. పాండవులు చేసిన తీర్థయాత్రలు ఇందులో విశేషంగా వర్ణించబడ్డాయి. పాండవులు నైమిషం, గంగావతరణం, మహేంద్రపర్వతం, నరనారాయణ ఆశ్రమం, మాల్యవంతం, కుబేరనివాసం, మేరుశిఖరం, హిమవత్పర్వతాలను సందర్శించి ద్వైతవనం చేరడం వరకు ఈ సువిశాలభారతాన గల పుణ్యనదీతీర్థాలను, పర్వతాలను వ్యాసుడు వర్ణించాడు.

**విరాటపర్వం**

పాండవుల అరణ్యవాసం ముగియడంతో అజ్ఞాతవాసం మొదలవుతుంది. అజ్ఞాతవాసానికి పాండవులు ఎంచుకున్న నగరం విరాటనగరం. ఈ మత్స్యదేశంలో విరాటరాజు దగ్గర పాండవులు సంవత్సరకాలం అజ్ఞాతంగా ఉన్నారు కనుక దీనికి 'విరాటపర్వం' అని వ్యాసుడు నామకరణం చేశాడు. మిగతా పర్వాలతో పోలిస్తే అతిసుందరమైన, హృద్యమైన కథ, వర్ణన, చమత్కార సన్నివేశాలు ఈ పర్వంలో అధికంగా కనబడతాయి.

పాండవుల పురోహితుడు ధౌమ్యుడు పాండవులకు సేవాధర్మాలను ఉపదేశించడంతో ఈ పర్వం మొదలవుతుంది. పాండవులు శమీవృక్షంపై ఆయుధాలు దాచడం, ధర్మరాజు కంకుభట్టు పేరుతో, భీముడు వలలుడనే వంటవాడిగా, అర్జునుడు బృహన్నల రూపంలో, నకులుడు అశ్వపాలకునిగా, సహదేవుడు గ్రంధికుడనే

వత్సపాలుడిగా, ద్రౌపది సైరంధ్రి రూపంలో విరాట ఆస్థానంలో స్థానాలు సంపాదించడం, కీచకవధ, ఉపకీచకసంహారం, దుర్యోధన అన్వేషణం, సుశర్మ దక్షిణగోగ్రహణం, ఉత్తరగోగ్రహణం, ఉత్తర ప్రగల్భాలు, బృహన్నల అర్జునునిగా మారడం, కౌరవులను ఓడించడం, కర్ణ అర్జునుల ద్వంద్వయుద్ధం, విరాటుడు ధర్మరాజును నిందించడం, విరాటుడు పాండవులను గుర్తించి క్షమించమని వేడి తన కూతురు ఉత్తరను అర్జునుని కుమారుడు అభిమన్యునికి ఇచ్చి వివాహం చేయడంతో విరాటపర్వం ముగుస్తుంది.

ఇది చాలా శుభపర్వం. వర్షాలు లేని కాలంలో ఈ విరాటపర్వాన్ని పారాయణం చేసి, ప్రవచనాదులను చేయడం ద్వారా సువృష్టితో, కరువు తీరుతుందని విశేష ఫలశ్రుతి. నేటి సమాజానికి కావలసిన అనేక విషయాలు ఈ పర్వంలో కనిపిస్తాయి. అధికారుల వద్ద ఎలా ప్రవర్తించాలనే విషయాన్ని ధౌమ్యుడు ధర్మరాజుకు చెప్పడం ద్వారా ఈనాటి సమాజానికి కావలసిన ప్రవర్తనానియమావళి (Personal Management), వ్యక్తిత్వవికాసం మొదలైన అంశాలను ఈ పర్వం చదవడం ద్వారా గ్రహించవచ్చు. ఉత్తరగోగ్రహణం, దక్షిణగోగ్రహణం అనే కథలలో గోవుల సేవా విశేషం, గోసంపద వైభవాన్ని వ్యాసుడు అద్భుతంగా వర్ణించాడు. కనుక అనేక విశేషాల సమాహారం 'విరాటపర్వం' అని చెప్పవచ్చు.

**ఉద్యోగపర్వం**

'భారతే సారముద్యోగః' - మహాభారతంలో ఉద్యోగపర్వం సారభూతమైనదని ఆర్యోక్తి. ఉద్యోగశబ్దానికి ప్రధానమైన అర్థం 'ప్రయత్నం'. దేనిని గూర్చిన ప్రయత్నం అని శంక కలిగితే ఒక దృష్టిలో యుద్ధప్రయత్నమని, వేరొకదృష్టిలో సంధి ప్రయత్నమని చెప్పవచ్చు. ముఖ్యంగా శ్రీకృష్ణభగవానుడు ధర్మస్థాపనం చేయడానికి స్వయంగా పాండవుల పక్షం వహించి కౌరవుల దగ్గరకు రాయబారానికి వెళ్లిన ఇతివృత్తం ఈ పర్వంలో ప్రధానం. ఈ ఉద్యోగపర్వంలో 10 ఉపపర్వాలు కనిపిస్తున్నాయి. 196 అధ్యాయాలతో 6614 శ్లోకాలతో ఈ పర్వం వర్ణితమైంది.

విరాటసభలో శ్రీకృష్ణుని వచనాలతో కథ మొదలవుతుంది. ద్రుపద పురోహితుని రాయబారం, శ్రీకృష్ణసహాయ అభ్యర్థనం కోసం దుర్యోధనుడు, అర్జునుడు ద్వారకకు వెళ్లటం, శల్యుని వృత్రకథ, సంజయరాయబారం, సంజయ సందేశం, యుధిష్ఠిర సందేశం, అర్జునుని సందేశం, విదుర ధృతరాష్ట్ర సంవాదం, విదురనీతి, ధర్మమహత్త్వ ప్రతిపాదనం, సనత్సుజాతపర్వం, పరమాత్మస్వరూప వర్ణన, భీష్మకర్ణుల సంవాదం, ధృతరాష్ట్ర దుర్యోధనుల సంవాదం, ధృతరాష్ట్ర వ్యాస సమాగమం, సంజయుడు శ్రీకృష్ణతత్త్వం చెప్పడం, శ్రీకృష్ణరాయబారం, విదుర ఆతిథ్యం, శ్రీకృష్ణుని బంధించడానికి కౌరవుల ప్రయత్నం, శ్రీకృష్ణ కర్ణ సంభాషణం, కుంతితో మాట్లాడటం, ఉలూక రాయబారం మొదలైన ఘట్టాలు ఈ పర్వంలో ఉన్నాయి.

పాండవ, కౌరవ స్వభావాలు, కురుక్షేత్ర సంగ్రామం ఏ విధంగా అనివార్యమైనదీ, సంగ్రామ ఫలితాలు, ధృతరాష్ట్రుని స్వభావం, శ్రీకృష్ణతత్త్వం, దౌత్యంలో తారతమ్యాలు మొదలైన అంశాలు ఈ పర్వంలో ఉన్నాయి. లౌకికంగా లోకతత్త్వ సారసంగ్రహంగా

వేదాలు వేదాలు వేదాలు గీతోపదేశం వేదాలు ఇతిహాసాలు పురాణాలు ఉపనిషత్



500 శ్లోకాలలో విదురుడు చెప్పిన నీతిని నేటి సమాజం అనుసరించినట్లయితే వ్యవస్థ బాగుపడుతుంది. పరమార్థతత్త్వ సంగ్రహంగా ఆధ్యాత్మికతత్త్వాన్ని 200 శ్లోకాలలో 'సనత్సుజాతీయం' వివరించింది. ఇది చాలా విశేషఘట్టం. ఈ రెండు మహానిధులు ఈ పర్వంలో ఉన్నాయి.

**భీష్మపర్వం**

భీష్మపర్వం మొదలుకొని 6 పర్వాలను 'యుద్ధషట్కం' అంటారు. యుద్ధం నిర్ణయించబడిన తర్వాత కౌరవ మహాసైన్యానికి మొదటి సేనాధిపతిగా 'భీష్ముడు' బాధ్యతలు స్వీకరించాడు. భీష్ముడు మొత్తం 10 రోజులు యుద్ధం చేశాడు. ఆ మహావీరుడి పేరుతో 'భీష్మపర్వం' అనే పేరును వ్యాసుడు ఈ పర్వానికి పెట్టాడు.

వేదవ్యాసులవారు ధృతరాష్ట్రుని దగ్గరకు వచ్చి ఉపదేశం చేయడంతో కథ మొదలవుతుంది. సంజయుడు ధృతరాష్ట్రునికి భూపరిమాణం చెప్పటం, భరతఖండంలోని విశేషాలు, సంజయుడు ధృతరాష్ట్రునికి భారతయుద్ధవిశేషాలను చూసి చెప్పడం, కౌరవ సైన్యానికి భీష్మప్రేరణ, ధర్మరాజుకు అర్జునుడు ఉత్సాహం కల్గించటం, ధర్మరాజు భీష్ముని వద్దకు వెళ్లి ఆశీస్సులు తీసుకోవడం, ధర్మరాజు గురువైన కృప శల్యులచేత యుద్ధానికి ఆజ్ఞ పొందడం, అర్జునుని మోహం, శ్రీకృష్ణుడు అర్జునునికి తత్త్వోపదేశం చేయటం, భగవద్గీత, భీష్ముని మొదటిరోజు యుద్ధం, భీష్మ-అర్జునుల యుద్ధం, శ్రీకృష్ణుడు చక్రం ధరించి భీష్మునిపైకి పోవటం, దృష్టద్యుమ్న ద్రోణుల యుద్ధం, ధర్మరాజు భీష్మునివద్దకు వెళ్లి మరణరహస్యం తెలుసుకోవటం, శిఖండిని చూసి భీష్ముడు అస్త్రసన్యాసం చేయటం, భీష్ముడు శరతల్పగతుడు కావటం, కర్ణుడు భీష్మునివద్దకు వెళ్లి వినతుడవడంతో ఈ పర్వం ముగుస్తుంది.

మహాభారతంలో అత్యంత కీలకమైన 'భగవద్గీత' ఈ పర్వంలోనే ఉంది. ఇవే కాక భూగోళవర్ణనం చాలా అద్భుతంగా జరిగింది. భక్తుని ప్రతిజ్ఞ నెరవేరేలా చూడడానికి తన ప్రతిజ్ఞాభంగానికైనా భగవంతుడు సందేహించడని భీష్మసంహారం కోసం శ్రీకృష్ణుడు శస్త్రధారణం చేయడం నిరూపిస్తుంది. భగవంతుని స్థూలరూపమైన బ్రహ్మాండాన్ని, జంబూద్వీపనిర్మాణాన్ని, భువనకోశాన్ని, భూనదీపర్వతాలను ఇందులో వర్ణించారు. మహావీరుడు, మహాభక్తుడు, పితామహుడు అయిన భీష్ముడి పేరుతో ఉన్న ఈ పర్వం అనేక విశేషాల నిధి అని చెప్పవచ్చు.

**ద్రోణపర్వం**

భీష్ముని తరువాత ద్రోణాచార్యులవారు సేనాధిపతిగా బాధ్యతలు స్వీకరించి యుద్ధం చేయడంతో దీనికి 'ద్రోణపర్వం' వ్యాసుడు అని పేరు పెట్టాడు. భగవంతుని నిర్మలమైన రూపం 'తమేవ శరణం గచ్ఛ, తమేవ చాద్యం పురుషం ప్రపద్యే, ఉత్తమః పురుషస్త్వన్యః ' అనే వాక్కులతో భీష్మపర్వం వర్ణించబడితే, ఆ రూపాన్ని తెలిసినవారికి అర్చిరాది మార్గాపేక్షకు (ఉత్తరాయణ కాలప్రతీక్ష) ఎదురులేదని ద్రోణాచార్యుల నిర్యాణం నిదర్శనంగా నిరూపించడానికి ద్రోణపర్వం ఆరంభించబడింది. ఎంతటి మహాత్ములకైనా మృత్యువుంటుందని, జగత్తు అనిత్యమనే విషయాలను ద్రోణపర్వంలో వ్యాసులవారు నిరూపించారు.

ద్రోణునికి సైన్యాధిపత్యం, ధర్మరాజును పట్టి ఇస్తానని ద్రోణుడు దుర్యోధనునికి వరమివ్వడం, భీమసేన శల్యుల గదాయుద్ధం, ధర్మరాజుతో ద్రోణుడి యుద్ధం, కర్ణ అర్జునుల యుద్ధం, అభిమన్యుడు పద్మవ్యూహంలోకి ప్రవేశించడం, దుర్యోధనపుత్రుడు అభిమన్యునిచే చంపబడడం, అభిమన్యుడు పద్మవ్యూహంలో మరణించడం, ధర్మరాజు దుఃఖం, సువర్ణష్ఠీవి చరిత్ర, అర్జునుడు సైంధవుని చంపుతానని ప్రతిజ్ఞ చేయడం, ద్రోణుని దుర్యోధనుడు నిందించడం, విందానువిందుల మరణం, అర్జునుడు సైంధవుని చంపడం, బాహ్లీకమరణం, ఘటోత్కచయుద్ధం, శతరుద్రీయమాహాత్మ్యంతో ఈ పర్వం ముగుస్తుంది.

'శివాయ విష్ణు రూపాయ' అనే సూత్రం ప్రకారం శ్రీమహావిష్ణువు వైభవాన్ని ఉద్యోగపర్వంలో వర్ణించి, భీష్మపర్వంలో నారాయణ పరతత్త్వ గీతాశాస్త్రాన్ని దర్శింపచేసి, విష్ణువు యొక్క శివమయత్వాన్ని వ్యాఖ్యానించే తలంపుతో ఈ ద్రోణపర్వం చివరి రెండు అధ్యాయాలలో (201, 202) పరమేశ్వర శతరుద్రీయం వివరించబడింది. యుద్ధరంగాన వేసే అనేక వ్యూహాలు, అంటే చక్రవ్యూహం, గరుడవ్యూహం, పద్మవ్యూహం వంటి వాటిని విశేషంగా వర్ణించాడు.

## కర్ణపర్వం

ద్రోణాచార్యుల మరణంతో దుర్యోధనుడు కర్ణునికి సర్వసేనాధిపత్యాన్ని అప్పగించాడు. అందుకే దీనికి 'కర్ణపర్వం' అని పేరు పెట్టటం సార్థకం. కర్ణపర్వంలో ధర్మాభాస, అర్థాభాసాలను; అధర్మాభాస, అర్థాభాసాలను నిరూపించడం ప్రధానంగా కనిపిస్తుంది.

దుశ్శాసన నకులుల యుద్ధం, దుర్యోధన ధర్మరాజుల యుద్ధం, శల్యసారథ్యం కోసం దుర్యోధనుని ప్రార్థన, త్రిపురాసురవధా వృత్తాంతం, శల్యసారథ్యం, శల్యుడు కర్ణుని నిందించడం, శాపవిషయాలు చెప్పడం, హంస కాకి ఉపాఖ్యానం, అశ్వత్థామ అర్జునుల యుద్ధం, అర్జునుని ఉత్సాహం, దుశ్శాసనుని భీమసేనుడు చంపడం, కర్ణార్జునుల యుద్ధం, కర్ణుని రథచక్రం భూమిలోకి దిగబడడం, కర్ణుని మరణంతో కర్ణపర్వం ముగుస్తుంది. పైన చెప్పిన భాగాలే కాక ఇంకా అనేక కథలు కర్ణపర్వంలో చెప్పబడ్డాయి.

## శల్యపర్వం

కర్ణుని మరణంతో దుర్యోధనుడు శల్యునికి సర్వసేనాధిపత్యాన్ని కట్టబెట్టాడు. 18వ రోజు జరిగిన యుద్ధం వివరాలను వర్ణించిన పర్వం ఇది. శల్యపర్వంతోనే కురుక్షేత్రయుద్ధం ముగియడం విశేషం. ప్రధానంగా శల్యభీమసేనుల యుద్ధం, ధర్మరాజు శక్తిని ప్రయోగించి శల్యుని చంపడం, ఉలూకుని మరణం, దుర్యోధనుడు ద్వైపాయనం అనే మడుగులో దాగడం, భీమదుర్యోధనుల గదాయుద్ధాన్ని తిలకించడానికి బలరాముడు రావడం, ప్రభాసతీర్థప్రభావ వర్ణనం, కురుక్షేత్రప్రభావవర్ణనం, భీముని గదాప్రహారంతో దుర్యోధనుని తొడలు విరగడం, బలరాముడు ఆగ్రహించడం, అగ్నిదత్తమైన అర్జునుని రథం కాలిపోవడం, కృప, కృతవర్మ, అశ్వత్థామలు దుర్యోధనుని చేరి దుఃఖపడడం వంటి ఘట్టాలు శల్యపర్వంలో

వేదాలు
వేదాలు
వేదాలు
గీతోపదేశం వేదాలు
ఇతిహాసాలు
పురాణాలు
ఉపనిషత్

ఉన్నాయి. శత్రువు పరాభూతుడైనప్పటికీ వదలరాదని అర్థార్థి కుటుంబనాశనంతో బాటు తానుగూడ నశిస్తాడని శల్యపర్వం చెబుతుంది.

**సౌప్తికపర్వం**

'నుత సౌప్తికాది పర్వ త్రితయంబున దనరి వసుమతీ సురవరసమ్మతమై సౌప్తికపర్వము ప్రతిభవినంబొలుచు దశమపర్వం బగుచున్'. దుర్యోధనుని అంతిమదశతో ఆరంభించబడి అశ్వత్థామ అహంకారభంగం వరకు వర్ణించబడిన కథ ఈ పర్వంలో ఉంది. బ్రాహ్మణుడై కసాయివారు చేసే పనిని చేయటంవల్ల అశ్వత్థామ శిరోరత్నాన్ని భీముడు పెరికివేసి ద్రౌపదికి ఇస్తాడు. ఈ పర్వంలో కూడ శివమాహాత్మ్యవర్ణన ఎక్కువగా ఉంది. పరధర్మాన్ని అనుసరించే బ్రాహ్మణుడు ఆ ధర్మాలలో నిద్రితమైన కర్మలనే చేసి మరణిస్తూ కూడా పాపులనే అభినందిస్తున్నాడనే సత్యాన్ని ఈ పర్వం వెల్లడించింది.

**స్త్రీపర్వం**

చనిపోయిన యోధుల స్త్రీలు తమ తమ భర్తల శరీరాలను, అవయవాలను వెదకి, ఆ దృశ్యాలను చూసి దుఃఖపడతారు. కనుకనే దీనిని 'స్త్రీ పర్వం' అని పిలిచారు. పరస్పరం ఓదార్చుకోవటం ఈ పర్వంలో గమనించవచ్చు. గాంధారి శ్రీకృష్ణునికి శాపం ఇవ్వడం, కుంతి కర్ణుడు తన కుమారుడని ధర్మరాజుకు చెప్పడంతో ఈ పర్వం ముగుస్తుంది. స్త్రీపర్వాన్ని 'కృపాయత' మని నన్నయ్య వ్యాఖ్యానించాడు. ఈ పర్వంతో మహాభారతంలో యుద్ధషట్కం ముగుస్తుంది. శ్రీ గడియారం వేంకటశేషశాస్త్రిగారు యుద్ధషట్కగాథను శరీరత్రయ విభాగంగా చెప్పారు. మహాభారతయుద్ధంలో కౌరవపక్షంలో కృపాచార్యుడు, కృతవర్మ, అశ్వత్థామ ముగ్గురు, పంచపాండవులు, ద్రౌపది, కృష్ణుడు, సాత్యకి, యుయుత్సులు మాత్రమే మిగిలారు. శాపప్రతిశాపాలతో, శోకోపశమనాల తర్వాత చనిపోయినవారికి ఉదకప్రదానాలతో ఈ యుద్ధషట్కం ముగుస్తుంది.

**శాంతిపర్వం**

శాంతి, అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వాలను కలిపి శాంతిసప్తకంగా పిలుస్తారు. శాంతి సప్తకంలో మొదటి పర్వం శాంతిపర్వం. 'సకల హితంబై శాంత్రాదిక పర్వచతుష్టయము విదితమై సమబుద్ధికి బండ్రెండవ పర్వంబ కదున్ మేలనగ శాంతిపర్వము వెలయున్' అని నన్నయ్య శాంతిపర్వాన్ని కీర్తించాడు. శాంతిపర్వకథలో ధర్మరాజు స్త్రీలకు శాపం ఇవ్వడం, ధర్మరాజుకు కృష్ణుడు పదహారు రాజుల చరిత్రలు చెప్పడం, ధర్మరాజు పట్టాభిషేకం, భీష్ముడు ధర్మరాజుకు ధర్మోపదేశం చేయటం, ఆధ్యాత్మవిద్య, కాలచక్రప్రభావం, ఇంద్రప్రహ్లాద సంవాదం, ముక్తిమార్గ వివరాలు, వృత్తగీత, హంసగీత, శుకజన్మ, హయగ్రీవమాహాత్మ్యం, భగవన్నామనిర్వచనాలు, ఉంఛవృత్తి మహిమతో ఈ పర్వం ముగుస్తుంది. మహాభారతంలో ఇది పెద్దపర్వం. భారతీయ

సంప్రదాయాన్ని అనుసరించి ధర్మార్థకామమోక్షాలని పురుషార్థాలు నాలుగు. వాటిలో మోక్షం చివరిది. ధర్మం మొదటిది. అర్థకామాలతో పాటు ధర్మం తప్పనిసరిగా ఉంటే చివరిదైన మోక్షాన్ని సాధించవచ్చునని మహాభారతం ఉపదేశిస్తోంది. కనుక శాంతిపర్వంలో యుద్ధం ముగిసిన తర్వాత ధర్మరాజు తానే ఈ వినాశానికి కారకుడనని దుఃఖపడుతుంటే, కృష్ణుడు కర్తవ్యోపదేశం చేశాడు. అయినా ధర్మరాజు దుఃఖపడుతుంటే కృష్ణుడు మరణావస్థలో ఉన్న భీష్ముడితో ధర్మరాజుకు ధర్మోపదేశం చేయించాడు. అంతా ముగిసిన తర్వాత మిగిలేది శాంతి కాబట్టి దీనికి శాంతిపర్వం అని పేరు పెట్టారు. శాంతిపర్వంలో 'రాజధర్మం, ఆపద్ధర్మం, మోక్షధర్మం' అనే మూడు విశేషాలు కనిపిస్తాయి. ప్రజారంజనకాముడు రాజు. అట్టి రాజు యొక్క ధర్మాలను యుధిష్ఠరునికి భీష్ముడు ఉపదేశించాడు. ఆపత్కాలంలో ఆపన్ననకు ఉపకారకంగా ఆపద్ధర్మకాండ నిరూపించబడింది. విరక్తునకు ఉపకారకంగా మోక్షధర్మకాండ వివరించబడింది.

ధర్మరాజును తిరిగి ధర్మబద్ధమైన కర్మాసక్తుని చేయడానికి భీష్ముడు ధర్మాలను బోధించాడు కనుక దీనిని రెండవ భగవద్గీతగా చెబుతారు. దీనిని 'అనుగీత'గా కూడా చెబుతారు. మూలగ్రంథంలో మొత్తం 4321 శ్లోకాలున్నట్లు తెలుస్తోంది. పర్వాలలో విశేషమైన పర్వంగా పండితులు దీనిని కీర్తిస్తారు. ఆధునిక మానవునికి కావలసిన అనేక ధర్మాలతో ఈ శాంతిపర్వం లోకరంజకమై ఉంది.

**అనుశాసనికపర్వం**

ఈ పర్వం కూడ నీతిధర్మ వివరణలతో కూడి ఉంది. ధర్మ, అర్థ, కామ, మోక్ష రూపాలైన చతుర్విధ పురుషార్థాలకు సప్రమాణాలైన అనేక దానధర్మసాధనాలను వర్ణించిన పర్వం అనుశాసనపర్వం. మహాభారత పర్వాలలో పదమూడవపర్వం ఇది. బంధువుల మరణం వల్ల శోకతప్తుడైన ధర్మరాజు శోకం పోవడానికి పనికివచ్చే ధర్మాన్ని చెప్పమని భీష్ముని ప్రశ్నించాడు. శరతల్పగతుడైన భీష్ముడు ధర్మరాజుకి శోకవినాశకమైన తత్త్వజ్ఞానరూప ధర్మాన్ని ఉపదేశించాడు. కనుక దీనిని అనుశాసన పర్వం అన్నారు. అలాగే, ధర్మం చేత మృత్యువును జయించవచ్చునని చెప్పి, అతిథిసత్కారరూపమైన ధర్మాన్ని ఆచరించి మృత్యువును జయించిన సుదర్శనుడనే గృహస్థుని ఇతిహాసాన్ని కవి వివరించాడు. భీష్మునిచేత ప్రేరితుడైన శ్రీకృష్ణుడు మహాదేవుని మాహాత్మ్యం చెప్పి, శివసహస్రనామాలు ఉపదేశించాడు. భీష్ముడు శరణాగతరక్షణానికి ఫలం చెప్పి, శ్యేనకపోతి ఉపాఖ్యానాన్ని వివరించాడు. 'లోకంలో ముఖ్యమైన దైవమేది?' అనే ధర్మరాజు ప్రశ్నకు సమాధానంగా, విష్ణువే దైవమని చెప్పి విష్ణుసహస్రనామాలు వివరించాడు. వ్యాసప్రోక్తమైన సావిత్రీమంత్రాన్ని ఉపదేశించి, ఫలాన్ని వివరించాడు. మధ్యలో భీష్మప్రేరితుడైన శ్రీకృష్ణుడు శివమాహాత్మ్యాన్ని - శతరుద్రీయ మంత్రాలను వివరించాడు. చివరికి వ్యాసప్రేరితుడై భీష్ముని అనుజ్ఞతో హస్తినాపురం వెళ్లి, స్త్రీలను ఓదార్చి, సూర్యుడు ఉత్తరాయణంలో

ప్రవేశించిన తర్వాత భీష్మునికి సంస్కారం కోసం సామాగ్రిని తీసుకొని - బయలుదేరివచ్చి - భీష్ముడికి తన రాకను తెలియజేశాడు. భీష్ముడు అందరినీ చూసి, ధర్మరాజును పలకరించి ధృతరాష్ట్రుడికి హితాన్ని చెప్పి శ్రీకృష్ణుని ఆజ్ఞతో వసులోకాలు పొందాడు. గంగ భీష్ముని పరాక్రమాన్ని ప్రశంసించి విలపించింది. దీనితో ఈ పర్వం ముగుస్తుంది.

**అశ్వమేధపర్వం**

ఇది భారతంలో పదునాల్గవ పర్వం. కురుక్షేత్రయుద్ధం ముగిసిన తర్వాత ధర్మరాజు పట్టాభిషేకం చేసుకొని, అశ్వమేధయాగం చేశాడు. ఆ విషయాన్ని వర్ణిస్తుంది కనుక ఈ పర్వానికి ఈ నామం సార్థకమైంది. ధర్మరాజు అశ్వమేధం చేయడానికి మంత్రులతో ఆలోచన చేశాడు. వ్యాసమహర్షి ఉపదేశించిన తర్వాత కూడా, జ్ఞాతి బంధుజనమరణంతో శోకిస్తున్న ధర్మరాజుకి వాసుదేవుడు ఇంద్రవృత్రాసురవధ వృత్తాంతాన్ని చెప్పి, ఓదార్చి - నిష్కామంగా యజ్ఞాలు చెయ్యమని బోధించాడు. ధర్మరాజు భీష్ముని ఉత్తరక్రియలు పూర్తిచేసి హస్తినాపురం చేరాడు.

అర్జునుడు, ధర్మరాజు అనుజ్ఞను పొందడానికి శ్రీకృష్ణునితో కలిసి ధర్మరాజు దగ్గరకు బయలుదేరాడు. మధ్యలో ఉత్తంకుడుకి తత్త్వాన్ని ఉపదేశించి, విశ్వరూపాన్ని చూపించి ఉత్తంకుని గొప్పతనాన్ని కృష్ణుడు అర్జునునికి వివరించాడు. తర్వాత హస్తినకు వెళ్ళి ధర్మరాజు అనుమతితో ద్వారక వెళ్ళి, వసుదేవునికి అభిమన్యు వధ వృత్తాంతం వివరించి, వసుదేవుణ్ణి, సుభద్రను ఓదారుస్తాడు.

పరీక్షిత్తును రక్షించి పాండవులతో అశ్వమేధయాగాన్ని ఘనంగా చేయిస్తాడు. అశ్వమేధపర్వంలో అంగోపాంగసహితమైన బ్రహ్మవిద్య సమాప్తి చేయబడింది.

**ఆశ్రమవాసపర్వం**

మహాభారతంలో ఇది పదిహేనవ పర్వం. కథాభాగంలో ప్రధానంగా ధృతరాష్ట్రాదులు సర్వాన్ని పరిత్యజించి వనంలోకి ప్రవేశించే కథ చెప్పబడినందున దీనికి ఆశ్రమవాసపర్వం అనే పేరు వచ్చింది. ధృతరాష్ట్రుడు వ్యాసుని ఆజ్ఞను స్వీకరించి ప్రజలందరి అనుమతితో అరణ్యంలోకి ప్రవేశించి శతయూపరాజర్షి ఆశ్రమంలో నివసించగా నారదమహర్షి మునులతో వచ్చి తపోవన మహిమలు చెప్పడం, పాండవులు ధృతరాష్ట్రుని చూడ రావడం, ధృతరాష్ట్రుడు గంగానదీతీరంలో తన నిజాశ్రమం ప్రవేశించడం, నారదుడు పాండవులకు ధృతరాష్ట్రాదుల నిర్యాణం గురించి చెప్పడం, యుధిష్ఠిరుడు ధృతరాష్ట్రాదులకు తిలోదకతర్పణాలు విడవడంతో ఈ పర్వం ముగుస్తుంది. ముఖ్యంగా బంధువుల పట్ల మమకారాదులు, ప్రేమలు ముక్తికి ఏ విధంగా ఆటంకమవుతాయో ఈ పర్వసారంగా వ్యాసుడు చెప్పాడు.

**మౌసలపర్వం**

ఇది భారతంలో పదహారవ పర్వం. ఇందులో ప్రధానంగా ముసలంవలన యదువంశ క్షయం వర్ణించబడింది. అందువల్ల ఈ పర్వానికి మౌసలపర్వం అనే పేరు వచ్చింది. పాండవులు రాజ్యం పరిపాలిస్తూ ఉండగా ముప్పై ఆరు సంవత్సరాలు

గడిచాయి. ధర్మరాజు ఆకాశంలో అపశకునాలు చూసి, ద్వారకలో యాదవుల నాశనం - బలరామకృష్ణుల నిర్యాణం గురించి విని, సోదరులను పిలిచి విషయం వివరించాడు. అందరు శోకాక్రాంతులయ్యారు. శ్రీకృష్ణుని నిర్గమనంతో ద్వారక సముద్రంలో మునుగుతుంది. అర్జునుడు ధర్మరాజుకు ఈ విషయం చెప్పడంతో ఈ పర్వం ముగుస్తుంది. 16వదైన మౌసలపర్వంలో, ధృతరాష్ట్రుని వలె వనాన్ని ఆశ్రయించక, కేవలం అర్థకామాసక్తులైనవారు యాదవులవలె మదిరాది కలహ వ్యసనాలతో వినాశం పొందుతారని నిరూపించబడింది.

### మహాప్రస్థానికపర్వం

ఇది భారతంలో పదిహేడవ పర్వం. పాండవులు స్వర్గానికి బయలుదేరి వెళ్ళడం ఇందులో వర్ణించబడింది. అందువల్ల ఈ పర్వానికి మహాప్రస్థానిక పర్వం అనే పేరు సార్థకమైంది. యాదవులు పరస్పరం రెల్లుగడ్డితో కొట్టుకొని మరణించిన తర్వాత, బలరామకృష్ణులు భూతలం వదిలి వైకుంఠం చేరిన తర్వాత ధర్మరాజు మహాప్రస్థానానికి సోదరులతో - ద్రౌపదితో కలిసి బయలుదేర దలచి, పరీక్షత్తును హస్తినాపుర రాజ్యానికి, వజ్రుణ్ణి ఇంద్రప్రస్థరాజ్యానికి రాజులను చేసి రాజ్యభారం మిత్రుడికి అప్పజెప్పాడు. తర్వాత శ్రీకృష్ణుడు మొదలైన యాదవులకు ఉదకదానాలు చేసి పరీక్షిత్తును విద్యాభ్యాసానికి కృపాచార్యునికి అప్పజెప్పాడు. తర్వాత ప్రజల అనుమతిని పొంది నారబట్టలు ధరించి సోదరులతో - భార్యతో - శునకంతో బయలుదేరి, ఉదయాచలం దగ్గరున్న లౌహిత్యమనే సముద్రం దగ్గరికి వెళ్ళాడు. అక్కడ పురుషాకారంలో ఉన్న అగ్నిని చూశాడు. ధర్మరాజు అనుజ్ఞతో అర్జునుడు గాండీవాన్ని, అక్షయమైన అమ్ములపొదిని సముద్రంలో వదిలిపెట్టాడు. అందరూ దక్షిణాభిముఖంగా బయలుదేరి భూప్రదక్షిణం చేస్తూ ఉత్తరదిక్కుకు చేరారు. అక్కడ హిమాలయం దాటి ముందుకు వెడుతూ ఉండగా, ముందుగా ద్రౌపది, క్రమంగా సహదేవ - నకుల - అర్జున - భీములు పడిపోయారు. ధర్మరాజు శునకంతో ముందుకు సాగాడు. ఇంద్రుడు వచ్చి ధర్మరాజును స్వర్గానికి తీసుకువెళ్ళడానికి రథం ఎక్కమంటే, సోదరులు లేకుండా రథం ఎక్కడానికి నిరాకరించాడు. చివరికి స్వర్గంలో ఉన్న సోదరులను చూపిస్తానని చెప్పిన ఇంద్రుని మాట విని శునకంతో సహా స్వర్గం వెళ్ళాడు. అక్కడ సోదరులు కనిపించలేదు. చింతించాడు. సోదరులున్న ప్రదేశానికి వెడతానన్నాడు.

### స్వర్గారోహణపర్వం

ఇది భారతంలో పద్దెనిమిదవ పర్వం. ఇందులో యుద్ధంలో మరణించిన వీరులందరూ స్వర్గం చేరడం, మహాప్రస్థానంలో పడిపోయిన భీమాదులు, ద్రౌపది స్వర్గం చేరడం, అలాగే ధర్మరాజు స్వర్గం చేరడం మొదలైన విషయాలు వర్ణించబడ్డాయి. అందువల్ల ఈ పర్వానికి స్వర్గారోహణ పర్వమనే పేరు వచ్చింది.

స్వర్గం చేరిన ధర్మరాజు ప్రకాశిస్తున్న దుర్యోధనుణ్ణి చూసి, అక్కడ ఉండడానికి ఇష్టపడక, కర్ణాది బంధుజనులు ఉన్నచోటుకి వెడతానంటాడు. దేవతలు బంధుజనాన్ని

చూపించే ముందు దేవదూతను ఇచ్చి నరకప్రదేశాలు చూపించారు. వాటిని చూసి సహించలేక తిరిగివస్తున్న ధర్మరాజుకి మార్గంలో కర్ణభీమాదుల కంఠాలు వినిపించాయి.

అక్కడనుంచి బయలుదేరి ఇంద్రుని సమీపానికి చేరాడు. అక్కడ ఇంద్రుడు, 'యుధిష్ఠిరా! నీవు సిద్ధుడవు, అక్షయలోకాలు పొందావు. నీకు నరకాన్ని మేమే చూపించాం. ఇకపైన నీ సోదరులను చూడు. ముందుగా స్వర్గగంగలో స్నానం చెయ్యి. నీకు మనుష్యభావం పోతుంది' అని చెప్పాడు. తర్వాత ధర్మదేవత కూడా ధర్మరాజుకి హితం చెప్పింది. ధర్మరాజు గంగలో స్నానం చేశాడు. వెంటనే మానవదేహం నశించి దివ్యదేహం వచ్చింది. ధర్మదేవతతో కలిసి మహర్షులు తనను స్తుతిస్తుండగా వైరం వదిలి దుర్యోధనాదులు ఉన్న ప్రదేశానికి వెళ్ళాడు.

దేవసభలో ప్రవేశించిన ధర్మరాజు అర్జునునితో సేవించబడుతున్న కృష్ణుని, ద్వాదశాదిత్యసమేతుడైన కర్ణుడిని, మరుద్గణంతో కూడుకొన్న భీముని, అశ్వినీదేవతలతో కలసిన నకులసహదేవులను, కమలమాలతో ఉన్న ద్రౌపదిని చూచి ఆశ్చర్యపోయాడు. ఇంద్రుడు అందరినీ పరిచయం చేశాడు.

**ఆధునిక సమాజానికి భారతంవల్ల ఉపయోగం**

మహాభారతం సర్వవిజ్ఞాననిధి. ఒక విశ్వవిజ్ఞాన భాండాగారం. నన్నయ్య మొదట భారతప్రశస్తిని చెబుతూ 'ఈనాటి ప్రపంచంలో ఎంతమంది ఎన్ని విచిత్ర స్వభావాలు కలిగిన మనుషులున్నారో, అన్ని కోట్లమందికి అన్ని రకాలుగా భారతం ఉపయోగపడుతుంది' అనే అర్థాన్ని స్ఫురింపచేస్తూ 'ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని' అనే పద్యంలో విశ్లేషించాడు. మహాభారతానికి 'పంచమవేదమని' ప్రశస్తి. వేదసారంతోపాటు సమస్త లౌకిక విషయాలు అందులో ఉన్నాయి. కనుకనే నన్నయ్య దీనిని 'విశ్వజనీనం' అని పేర్కొన్నారు.

మహాభారతంలోని పాత్రలు నిత్యసత్యాలు. ఆనాడు ఒక్క దుర్యోధనుడు మాత్రమే ఉన్నాడు. కాని వర్తమాన ప్రపంచంలో ఒక్కొక్క కుటుంబానికి ఒక్క దుర్యోధనుడు దర్శనమిస్తున్నాడు. అటువంటి కొడుకులను ప్రోత్సహించే తండ్రులు ధృతరాష్ట్రులే. కనుక మహాభారతకథ నిత్యకథ. మహాభారతంలో ప్రధానకథతో పాటు సందర్భోచితమైన అనేక నీతి ఉపదేశాలు, ఉపాఖ్యానాలు, ఆధ్యాత్మిక సందేశాలు అనేకచోట్ల కనబడుతాయి. మహాభారతంలో ప్రధానమైన 18 పర్వాలలో ఏయే విషయాలు ప్రతిపాదించబడ్డాయో నీలకంఠపండితులవారు ఒకచోట చెప్పారు. ఆదిపర్వంలో ధర్మార్థకామమోక్షాలను, సభా, అరణ్యపర్వాల్లో యజ్ఞం, సత్యం, ధృతి, గురు, సత్తీర్థ సేవలను ప్రతిపాదించడం జరిగింది. విరాట, ఉద్యోగ, భీష్మ, ద్రోణ, కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీపర్వాలు సేవ, నీతి, హింస, అబద్ధం, కులక్షయం మొదలైనవాటిని నిరూపిస్తూ రాజ్యకాంక్ష శోకాన్ని కలిగిస్తుందని వివరించాయి. శాంతిపర్వంలో అర్థఫలభూతమైన కామం, సోపసర్గంగా నిరుపప్లవమైన మోక్షం నిరూపించబడ్డాయి. మౌసలపర్వం వ్యసనాలవల్ల కలిగే దుఃఖాన్ని, మహాప్రస్థానపర్వం త్యాగంవల్ల కలిగే మోక్షమనీ అని, స్వర్గారోహణపర్వం తురీయపదప్రాప్తిని నిరూపించాయి.

వింటే భారతం వినాలి - తింటే గారెలే తినాలి అనే నానుడి సత్యం. గారెలవల్ల తుష్టి, పుష్టి, భారతంవల్ల ఆనందం, ఉపదేశం రెండూ కలుగుతాయి. ముఖ్యంగా ఆధునిక యువత భారతంనుంచి చాలా నేర్చుకోవచ్చు. నేడు గురుశిష్యసంబంధం చాలా దారుణమైన స్థితిలో ఉంది. గురువును కేవలం విద్య బోధించే ఉద్యోగిగా గుర్తిస్తున్నారు. మహాభారతంలో గురువాత్సల్యం, శిష్యుల కర్తవ్యాలను తెలియజేసే అనేక కథలు కనబడతాయి. ముఖ్యంగా ఆదిపర్వంలో ధౌమ్యుడు అనే మహర్షికి ఉపమన్యువు, అరుణి, వేదుడు అనే ముగ్గురు శిష్యులు చేసిన సేవ అద్భుతం. 'గుర్వర్థేయతమానం తం అనుగృహ్ణంతి దేవతాః' అని గురువుకోసం కష్టపడే శిష్యునికి దేవతలు వరాలు ఇస్తారని, గురువు అనుగ్రహంవల్లనే విద్య ప్రకాశిస్తుందని మహాభారతం చెబుతోంది.

విదురనీతిలో విద్యార్థి ఎలా ఉండాలో విదురుడు చెబుతూ, 'సుఖార్థిచేత్ త్యజేత్ విద్యా' అనే శ్లోకంలో సుఖాన్ని విడిచిన విద్యార్థి శాశ్వత ఆనందదాయకమైన విద్యను పొందుతాడనీ, సుఖాన్ని కోరే విద్యార్థి విద్యను పొందలేడనీ అంటాడు. ఈ మాటలు అక్షరసత్యాలు. ఈనాటి విద్యావిధానం కంటె భారతంలో చిత్రించిన విద్యావిధానం చాలా విశిష్టమైనది.

'జరత్కారువు' అనే ఋషి కథలో వివాహం ఎందుకోసం చేసుకోవాలో చెప్పారు. నేటి కాలంలో వివాహాన్ని కేవలం ఆకర్షణతో, కోరికలు తీర్చుకోవడానికి మాత్రమే చేసుకుంటున్నారు. కాని జగత్కారువు కథ వివాహం అనేది ఐహికభోగాలకు, శారీరక అవసరాలకు కాదనీ, సత్సంతానం కోసమే వివాహమని, ఒక్క కుమారుడుంటే చాలు కులం మొత్తం రక్షించబడుతుందని ఉపదేశిస్తోంది. జరత్కారు మహర్షి కుమారుడే 'ఆస్తికుడు'. జనమేజయుని సర్పయాగాన్ని ఆపినది ఈ ఆస్తికమహర్షే. ఈ నామం స్మరిస్తే సర్పభయం ఉండదని అంటారు.

తల్లిని ఎలా కాపాడుకోవాలో ఆదిపర్వంలోని గరుడోపాఖ్యానం ద్వారా ఉపదేశించారు. గరుత్మంతుడు తన తల్లి వినతను కద్రువ దాస్యంనుంచి విడిపిస్తాడు. కచుని కథ కుటుంబంకోసం వ్యక్తిగత సౌఖ్యాన్ని వదులుకోవాలన్న శాస్త్రవచనాన్ని విప్పి చెబుతోంది. అలాగే 'ధర్మవ్యాధోపాఖ్యానం'లో కసాయివాడైనా స్వధర్మాన్ని ఆచరిస్తే ఎలాంటి లాభం కల్గుతుందో, సత్యంగా, ధర్మంగా, వ్యాపారం చేస్తే ఫలితం ఎలా ఉంటుందో చెప్పి గుణప్రధాన్యాన్ని వ్యాసుడు నొక్కి చెప్పారు.

'అతిథి దేవోభవ' అనేది వేదవాక్యం. దీనిని మహాభారతం బాగా వివరించింది. అన్నదాన ఫలితం, అతిథులు, అభ్యాగతులు వస్తే వారికి మర్యాదలు, ఆదరణలు ఎంత బాగా చేయాలో వివరించింది. ధర్మరాజు కురుక్షేత్ర యుద్ధానంతరం అశ్వమేధయాగం చేయగా, ఒక ముంగిస వచ్చి ధర్మరాజుతో 'సక్రుప్రస్తుడి' ధర్మబుద్ధి కంటే నీది తక్కువేనంటూ 'సక్రుప్రస్తుడి' కథ చెబుతుంది. అన్నదానమంటే ఏమిటో, మనకు లేకపోయినా ఇతరులకు దానం చేయటం ద్వారా ఏం సంపాదించవచ్చో ఈ కథ చదివితే తెలుస్తుంది.

వేదాలు వేదాలు వేదాలు గీతోపదేశం వేదాలు ఇతిహాసాలు పురాణాలు ఉపనిషత్తు

మహాభారతం అరణ్యపర్వంలో సత్యభామకు ద్రౌపదీదేవి చెప్పిన పతివ్రతాధర్మాలు అద్భుతమైనవి. చీటికి మాటికి అహంకారంతో పోట్లాడుకునే భార్యాభర్తలకు ఈ ఘట్టం కనువిప్పును కలిగిస్తుంది. ఇందులో చెప్పిన చిట్కాలు పాటిస్తే ప్రతి ఇల్లూ నందనవనం అవుతుంది. ద్రౌపది సూత్రాలు పాటిస్తే ఎటువంటి భర్తయినా భార్యను ప్రాణసఖిగా చూసుకొంటాడు. అడవిలో ఉన్నా, రాజభవనాలలో ఉన్నా మనస్సులలో ఎటువంటి మార్పు రాని దాంపత్యం పంచపాండవ ద్రౌపదీదేవిల దాంపత్యం.

లోకంలో శాశ్వతమైన కీర్తి ఎలా సంపాదించగలుగుతామనే ప్రశ్నకు మహాభారతం 'సత్కర్మవల్ల' అని సమాధానం చెబుతుంది. నలుగురు మెచ్చే పనులు చేయడం ద్వారా శాశ్వతకీర్తిని సంపాదించవచ్చు. దానిద్వారా స్వర్గలోకప్రాప్తి కలుగుతుందని 'ఇంద్రద్యుమ్న మహారాజు' చరిత్ర చెబుతుంది. వేల సంవత్సరాలు గడిచినప్పటికీ ఇంద్రద్యుమ్నుడు తవ్వించిన సరస్సులోని 'అకూపారం' అనే తాబేలు మహారాజును గుర్తించడం చేత తిరిగి అతనికి స్వర్గలోకప్రాప్తి కలిగింది. అన్నదానసత్రాలు, మంచినీటిబావులు, చెరువులు, ఆలయాల వంటివి నిర్మించడం వల్ల శాశ్వతకీర్తి పొందవచ్చునని భారత ఉపదేశం.

ఈ విధంగా అనేక నీతిసూత్రాలను బోధించిన వందలాది కథలు భారతంలో ఉన్నాయి. సమస్త మానవజాతిని ఆవరించి ఉండే నిరంతర సంఘర్షణ లక్షణాన్ని మహాభారతం ఇతివృత్తంగా స్వీకరించింది. త్రికాలాబాధితమైన సత్యాలను విస్పష్టంగా వివరించింది.

సాంకేతికంగా మహాభారతం ఎన్నో విలువైన విషయాలను అందించింది. భీష్ముడు ఖగోళవిజ్ఞానంతో పాటు, పంచాంగ వివరణను శాస్త్రీయవిజ్ఞాన పూర్వకంగా చెప్పినట్లు బిర్లా ప్లానిటోరియం డైరెక్టర్ డా. బి.జి. సిద్ధార్థ పరిశోధించి తెలియజేశారు. లింగమార్పిడి, టెస్ట్‌ట్యూబ్ బేబీ (కౌరవజననం) ప్రక్రియలు మహాభారతం లోనివే. ఇక ద్రోణుని శిక్షణ సందర్భంగా క్రీడావిజ్ఞానాన్ని భారతం ప్రదర్శించింది. ఉద్యోగపర్వంలో, సభాపర్వంలో అక్షవిద్యా ప్రదర్శన ద్వారా నేటి ఆధునిక 'చెస్' క్రీడను చూపించింది. మహాభారతం యుద్ధఘట్టంలో వర్ణించిన పద్మవ్యూహం, చక్రవ్యూహం, పక్షివ్యూహాలను ఈనాడు భారతసైనికులు అనుకరిస్తున్నారని చెబుతారు.

ధర్మ, అర్థ, కామ, మోక్షాలలో ఏదీ తక్కువ కాదు, అన్నింటిని ఆవరించి ధర్మం ఉండాలి. ధర్మబద్ధమైన అర్థ, కామాల అనుభవంనుంచి విరమించడం మోక్షం. ఇది భారతం చెప్పిన సత్యం. ఆదర్శప్రాయమైన మానవజీవితం ఏ విధంగా ఉంటుందో నిరూపించింది మహాభారత ఇతిహాసం.





# భగవద్గీత

గీతాగంగాచ గాయత్రీ గోవిన్దేతి హృదిస్థితే
చతుర్గకార సంయుక్తే పునర్జన్మ నవిద్యతే

గీత, గంగ, గాయత్రి, గోవిందుడు అనే గకారాలతో ప్రారంభించే నాలిగింటిని ఎవడు కలిగి ఉంటాడో వాడికి జీవితంలో దుఃఖమూ పునర్జన్మ ఉండవని మహాభారతంలోని ఈ శ్లోకం చెబుతోంది. అందుకే భారతీయులకు 'భగవద్గీత' పట్ల అపారభక్తి, విశ్వాసాలు. మహాభారతంలో భీష్మపర్వంలో శ్రీకృష్ణార్జున సంవాదరూపంలో భగవద్గీత ఉంది. ఇందులో మొత్తం 701 శ్లోకాలు, 18 అధ్యాయాలు ఉన్నాయి. ప్రపంచంలో ఎన్నో గీతలు ఉన్నాయి. గురుగీత, బ్రహ్మగీత, వశిష్ఠగీత మొదలైనవి. విశిష్టులైన వ్యక్తులు చెప్పిన మాటలకే 'గీత' అనే పేరు కనిపిస్తుంది.

భగవంతుడైన శ్రీకృష్ణుని ముఖారవిందంనుంచి ఉపదేశరూపంగా వచ్చినది కనుకే భగవద్గీత అయింది. జ్ఞానం, శక్తి, బలం, ఐశ్వర్యం, వీర్యం, తేజస్సు అనే ఆరుగుణాలు పుష్కలంగా ఎక్కడ ఉంటాయో ఆయనే భగవంతుడు. ఈ జగత్తును సృష్టించి, పోషించి, లయం చేసే లీలలతో ఆయన విరాజిల్లుతున్నాడు. త్రేతాయుగంలో రాముడిగా, ద్వాపరంలో శ్రీకృష్ణుడిగా, కలియుగంలో భవిష్యత్తులో కల్కిగా అవతరించే ఆ పరమాత్మ తనలోని ఆరుగుణాలతో ఆత్మతత్త్వాన్ని, జీవితసాధనమార్గాలను అర్జునుని నిమిత్తునిగా చేసి గానం చేసినదే 'భగవద్గీత' అయింది. మార్గశీర్ష ఏకాదశినాడు గీత లోకంలో అవతరించింది.

'సర్వశాస్త్రమయీ గీత' అని భారతవచనం. గీత సకలశాస్త్రాలసారం, వేదంనుంచి ఆవిర్భవించిన మహాఫలం. ఉపనిషత్తులు, భగవద్గీత, బ్రహ్మసూత్రాలు – ఈ మూడింటిని కలిపి 'ప్రస్థానత్రయ'మంటారు. మధ్యస్థానంలో ఉన్న మహోన్నతగ్రంథం భగవద్గీత. వేదాలసారం ఉపనిషత్తులయితే, ఉపనిషత్తుల సారమే భగవద్గీత. మహాభారతంలోని భీష్మపర్వంలో 25వ అధ్యాయంనుంచి 42వ అధ్యాయం వరకు భగవద్గీత ఉంది. శ్రీ ఆదిశంకరులు గీతాభాష్యం రచిస్తూ 'తదిదం గీతాశాస్త్రం సమస్త వేదార్థసార సంగ్రహభూతమ్' అనగా ఈ గీతాశాస్త్రం సమస్త వేదవేదాంతాల సారసంగ్రహమని పేర్కొనడం గీత విశిష్టతను చాటుతుంది. భగవద్గీతలోని 18 అధ్యాయాలు ఇవి: 1) అర్జున విషాదయోగం 2) సాంఖ్యయోగం 3) కర్మయోగం 4) జ్ఞానయోగం

వేదాలు
వేదాలు
గీతోపదేశం వేదాలు
ఇతిహాసాలు
పురాణాలు
ఉపనిష...

5) కర్మసన్న్యాసయోగం 6) ఆత్మసంయమయోగం 7) విజ్ఞానయోగం 8) అక్షర పరబ్రహ్మయోగం 9) రాజవిద్యారాజగుహ్యయోగం 10) విభూతియోగం 11) విశ్వరూపసందర్శనయోగం 12) భక్తియోగం 13) క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగం 14) గుణత్రయవిభాగయోగం 25) పురుషోత్తమప్రాప్తియోగం 16) దైవాసుర సంపద్విభాగయోగం 17) శ్రద్ధాత్రయవిభాగయోగం 18) మోక్షసన్న్యాసయోగం.

**1. అర్జున విషాదయోగం**

భగవద్గీతలో ప్రతి అధ్యాయానికి చివర 'యోగం' అనే పేరు కనిపిస్తుంది. యోగమంటే కూడిక. జీవాత్మ పరమాత్మల ఐక్యమే యోగమని అంటారు. ఆ ఐక్యాన్ని సిద్ధింపచేసే మార్గం కూడా యోగమే. సాంఖ్యం, జ్ఞానం, భక్తి మొదలైనవాటివల్ల అది సిద్ధిస్తుంది. గీతలో వివిధ మార్గాలను ఉపదేశించడంవల్ల ప్రతి అధ్యాయం పేరు చివర యోగమని ఉంటుంది. ఈ అధ్యాయంలో మొదట కురు-పాండవ పక్షాల్లో ఉన్న దక్షులైన మహావీరులను గూర్చి పేరుపేరునా ధృతరాష్ట్రుడికి సంజయుడు తెలియజేస్తాడు. యుద్ధప్రారంభానికి ముందు రెండుసేనల మధ్య రథాన్ని కృష్ణుడు నిలబెట్టగా అర్జునుడు తన బంధువులందరినీ చూసి 'అయ్యో, వీళ్ళనా నేను చంపవలసింది? వీరంతా నా బంధువులే' అని మమకారంతో, దయతో విషణ్ణుడౌతాడు. ఆ సందర్భంలో కృష్ణుడు గీతోపదేశం ప్రారంభిస్తాడు. ఈ అధ్యాయంలో మొత్తం 47 శ్లోకాలున్నాయి.

**2. సాంఖ్యయోగం**

సంఖ్యతో కూడినది సాంఖ్యం. ప్రకృతిలోగల 24 తత్త్వాలను శోధించి, పరమాత్మను గ్రహించడమే సాంఖ్యవిద్య. 'పెద్దలను, గురువులను నేనెలాగయ్యా చంపగలను? నీ శిష్యుని సరైన మార్గంలో నడిపించు' అని అర్జునుడు కృష్ణుని ప్రార్థించగా అతనికి కృష్ణుడు కర్తవ్యోపదేశం చేస్తాడు. ఈ అధ్యాయంలో నిష్కామకర్మవైభవాన్ని, 54వ శ్లోకంనుంచి 72వ శ్లోకం వరకు స్థితప్రజ్ఞుడి లక్షణాలను 18 శ్లోకాలలో వివరించారు. చాలా ప్రాధాన్యత కలిగిన అధ్యాయం ఇది. గాంధీ మహాత్ముడు ప్రతిరోజు ఈ 18 శ్లోకాలను చదివేవాడని ప్రసిద్ధి. మొత్తం 72 శ్లోకాలు కలిగిన అధ్యాయమే సాంఖ్యయోగం.

**3. కర్మయోగం**

మానవుడు ఈ లోకంలో కర్మచేయక ఉండలేడు. నియతమైన కర్మలు ఎలా చేయాలో, అసలు కర్మ ఎందుకు చేయాలో, ఏ కర్మ ముక్తికి దారితీస్తుందో - మొదలైన కర్మకు సంబంధించిన విషయాలను విస్తారంగా చర్చించడంవల్ల దీనిని 'కర్మయోగం' అన్నారు. నిష్కామభావనతో నియమిత కర్మలను ఆచరించడమే కర్మయోగం. అనగా ఫలాన్ని కోరకుండా చేసే ప్రతిపనీ యజ్ఞమే అవుతుంది. అయితే రాగద్వేషాలు లేకుండా కర్తవ్యభావనతో కర్మలను ఆచరిస్తే సంగరాహిత్యమేర్పడుతుంది. కామక్రోధాది అంతశ్శత్రువులను ఎలా జయించాలో ఈ అధ్యాయంలో వ్యాస భగవానుడు వివరించాడు. మొత్తం 43 శ్లోకాలతో ఈ అధ్యాయం విరాజిల్లుతున్నది.

**4. జ్ఞానయోగం**

జ్ఞానసంబంధమైన విచారణ ఉండడంవల్ల దీనికి జ్ఞానయోగమనే పేరు వచ్చింది. ఈ అధ్యాయంలో భగవానుని ప్రభావం, జ్ఞాని పవిత్ర ఆచరణం, వివిధ జ్ఞానయజ్ఞాల ప్రత్యేకత, జ్ఞానం మహిమలను ఇందులో వర్ణించారు. కర్మ, అకర్మ, వికర్మ, వాటి స్వరూపస్వభావాల గురించి ఇందులో ఉంది. జ్ఞానమే సర్వకర్మలను భస్మం చేస్తుందని జ్ఞానాధిక్యతను చూపారు. మొత్తం 42 శ్లోకాల అధ్యాయం ఇది.

**5. కర్మసన్న్యాసయోగం**

సన్న్యాసం అనగా త్యాగం. అయితే కర్మసన్న్యాసం కంటే కర్మఫలత్యాగరూపమైన కర్మయోగమే శ్రేష్ఠమని ఇందులో చెప్పబడింది. సాంఖ్యయోగం, కర్మయోగాల నిర్ణయం, కర్మయోగి, సాంఖ్యయోగి లక్షణాలు, జ్ఞానయోగవివరణ, భక్తితో కూడిన ధ్యానయోగవర్ణన, మోక్షప్రాప్తి ఉపాయాలు ఈ అధ్యాయంలో ఉన్నాయి. ఇది 29 శ్లోకాలుగల అధ్యాయం.

**6. ఆత్మసంయమయోగం**

దీనిని 'ధ్యానయోగమని' కూడ అంటారు. దీనిలో ఆత్మ అనే మాటను శరీరం, ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి అనే అర్థాలలో ఉపయోగించి వాటన్నింటి నిగ్రహమే ఆత్మసంయమయోగమన్నారు. నిష్కామకర్మయోగ ప్రస్తావన, యోగారూఢుని లక్షణాలు, జ్ఞానిస్వభావం, ధ్యానయోగపద్ధతి, మనస్సును నిగ్రహించే విధానం, యోగభ్రష్టుని సద్గతి, ధ్యానయోగం వైశిష్ట్యం మొదలైనవాటిని 47 శ్లోకాలలో ఇందులో వివరించడం జరిగింది.

**7. విజ్ఞానయోగం**

దీనినే జ్ఞానవిజ్ఞానయోగం అంటారు. విజ్ఞానమంటే విశేషజ్ఞానం. విజ్ఞానంతో కూడిన జ్ఞానాన్ని ఆర్జించాలని దీనికి ఆ పేరు పెట్టారు. పరాపరప్రకృతుల వివరణ, పరమాత్మ అన్ని పదార్థాలలో వ్యాపించిన విధానం, ఆసురీభావనింద, దైవీభక్తప్రశంస, చతుర్విధభక్తుల వివరాలు, ఇతర దేవతల ఉపాసన విషయాలు, భగవంతుని ప్రభావమూ 30 శ్లోకాలలో ఇందులో వర్ణితమయ్యాయి.

**8. అక్షరపరబ్రహ్మయోగం**

అక్షరుడంటేనే భగవానుడు. క్షరమనగా నశించేది. అక్షరమనగా నాశరహితమైనది. నాశరహితమైన పరబ్రహ్మన్ని బోధించే అధ్యాయం కనుకనే దీనికి అక్షరపరబ్రహ్మ యోగం అనే పేరు పెట్టారు. బ్రహ్మం, ప్రణవోపాసన, సృష్టి, ప్రళయాలను గూర్చిన వివరణం, భగవానుని సనాతనస్వరూపం, శుక్ల, కృష్ణమార్గాల వర్ణన, యోగిమహిమ ఈ అధ్యాయంలో వర్ణించబడ్డాయి. ఇందులో మొత్తం 28 శ్లోకాలున్నాయి.

**9. రాజవిద్యారాజగుహ్యయోగం**

రాజవిద్య అంటే శ్రేష్ఠమైన విద్య అని అర్థం. రాజగుహ్యం అంటే పరమ రహస్యమైనదని అర్థం. ఇందులో ఆధ్యాత్మవిద్యాప్రభావం, భగవత్స్వరూపం, జగత్తు

ఉత్పత్తి, అసురీ, దైవీప్రకృతిగలవారి లక్షణాలు, సకామ, నిష్కామ ఉపాసన, దాని ఫలం, భగవద్భజన, భక్తిమహిమలు వర్ణించబడ్డాయి. ఈ అధ్యాయంలో 34 శ్లోకాలు ఉన్నాయి.

**10. విభూతియోగం**

విభూతి అంటే ఐశ్వర్యం. ఈ కనిపించే ప్రపంచం భగవంతుని వ్యక్తరూపమే. కనుక ఇది అంతా భగవంతుని మహిమావిస్తారమే. యోగశక్తుల వర్ణన, భక్తియోగనిరూపణం, భగవానుని స్తుతి, భగవంతుడు తన విభూతిని వర్ణించిచెప్పడం ఈ అధ్యాయంలోని విషయాలు. ఇందులో 42 శ్లోకాలున్నాయి.

**11. విశ్వరూపసందర్శనయోగం**

విశ్వమంతా భగవద్రూపమేనని ఈ అధ్యాయం చెబుతుంది. భగవానుడు అర్జునునికి చూపిన విశ్వరూపంవల్ల ఈ అధ్యాయం విశ్వరూపసందర్శనయోగమయింది. అర్జునుడు స్వామి విశ్వరూపాన్ని చూసి స్తుతిస్తాడు. నువ్వు నిమిత్తమాత్రుడివేనని భగవానుడు అర్జునునితో చెబుతాడు. ఇందులో 55 శ్లోకాలున్నాయి.

**12. భక్తియోగం**

భక్తిని గూర్చి ప్రతిపాదించినది కనుక దీనిని భక్తియోగమన్నారు. సగుణ, నిర్గుణ ఉపాసనలు, భక్తివల్ల కలిగే మహత్తరఫలం, అనేక ఆధ్యాత్మికసాధనలు, భక్తుని లక్షణాలు ఈ అధ్యాయంలో 20 శ్లోకాలలో చెప్పబడ్డాయి. భక్తుడికి 35 విశేష లక్షణాలను చెప్పడం ఈ అధ్యాయంలోని విశేషం.

**13. క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగం**

క్షేత్రమంటే శరీరం, క్షేత్రజ్ఞుడంటే ఆత్మ. ఈ రెండింటి స్వభావాలు, విభాగం గూర్చి వివరించడంచేత దీనిని క్షేత్రక్షేత్రజ్ఞ విభాగంగా పిలిచారు. క్షేత్రక్షేత్రజ్ఞుల స్వరూపం, జ్ఞానగుణాలు, ప్రకృతిపురుషుల వర్ణనం గల ఈ అధ్యాయంలో మొత్తం 35 శ్లోకాలు ఉన్నాయి.

**14. గుణత్రయవిభాగయోగం**

సత్త్వం, రజస్సు, తమస్సులనే మూడు విధాల గుణాలు, వాటి స్వభావాలు, జీవుడు వాటిచేత ఏ విధంగా బంధించబడతాడో, దానివల్ల ఎటువంటి ఫలితాలు కలుగుతాయో విశదంగా వివరించడంచేత దీనికి గుణత్రయవిభాగయోగం అనే పేరు వచ్చింది. గుణస్వరూపం, ఫలితాలు, భగవత్ప్రాప్తి ఉపాయం, గుణాతీతుని లక్షణాలు మొత్తం 27 శ్లోకాలలో వర్ణించబడ్డాయి.

**15. పురుషోత్తమప్రాప్తియోగం**

పురుషోత్తముడంటే పరమాత్మ. అట్టి పురుషోత్తముని స్వరూపం, ఆయనను పొందే మార్గం దీనిలో వర్ణించబడింది. సంసారవృక్షస్వరూపం, జీవాత్మవిచారణ, భగవత్ప్రభావం, పురుషోత్తముని వర్ణన, క్షరాక్షరపురుషుల లక్షణాలను ఇందులో 20 శ్లోకాలలో వర్ణించారు.

**16. దైవాసురసంపద్విభాగయోగం**

సద్గుణసంపత్తి అయిన దైవీసంపద గురించి, అసురసంపద గురించి చెప్పడంవల్ల దీనికి ఈ పేరు వచ్చింది. దైవికగుణసముదాయం, అసురగుణాలు, ఈ రెండింటి ఫలితాలు, అసురసంపదవల్ల కలిగే అధోగతి, నరకద్వారాలు, శాస్త్రానుకూలమైన ఆచరణవల్ల కలిగే ఫలితాలు ఇందులో 24 శ్లోకాలలో వర్ణించబడ్డాయి.

**17. శ్రద్ధాత్రయవిభాగయోగం**

మూడు విధాలైన సాత్త్విక, రాజస, తామసశ్రద్ధల వర్ణనవల్ల దీనికి ఈ పేరు వచ్చింది. మూడు విధాలైన శ్రద్ధ, మూడు విధాలైన ఆరాధన, సాత్త్విక, రాజస, తామస ఆహారవిషయం, మూడు విధాల యజ్ఞం, దానవిశేషాలు, అశ్రద్ధతో చేసే కార్యఫలితం మొదలైనవాటిని ఇందులో 28 శ్లోకాలలో వర్ణించారు.

**18. మోక్షసన్న్యాసయోగం**

బంధంనుంచి విడుదల కావడమే మోక్షం. సాంసారిక సుఖదుఃఖాలే బంధం. త్యాగంచేతనే మోక్షం దొరుకుతుందని త్యాగప్రసంగం, ఆత్మఅకర్తగా చెప్పడం, జ్ఞానం, కర్మ, బుద్ధి, ధైర్యం, సుఖం, సాత్త్విక, రాజస, తామసరూపాలు, నాలుగు వర్ణాల వర్ణన, బ్రహ్మసాక్షాత్కార ఉపాయం, భక్తిసహిత నిష్కామకర్మయోగం, గీతామహిమ, సంజయుని గీతాస్తుతితో 78 శ్లోకాలుగల ఈ అధ్యాయం ముగుస్తుంది.

**నేటి సమాజానికి గీతాసందేశం**

ప్రతిమనిషి జీవితంలో ఆరంభశూరత్వంతో పని మొదలుపెడతాడు. కొద్దిరోజుల తర్వాత ఏవేవో ఆలోచనలు వస్తాయి. అంతే. నాకీ పని వద్దని అనుకొని నీరసంతో చతికిలబడి అస్త్రసన్న్యాసం చేస్తాడు. ఇటువంటివారి ప్రతినిధిగా గీతలో అర్జునుడు కనిపిస్తాడు. అప్పుడు కృష్ణుడు గురువుగా చేసిన ఉపదేశంనుంచి జాగరూకుడై ఉత్తేజాన్ని, ప్రేరణను, ఉత్సాహాన్ని, శక్తులను, కర్తవ్యనిష్ఠను పొందుతాడు. అందువల్లనే గీతకు అర్థం చెబుతూ ఆచార్య శ్రీ వినోబాభావే 'నా శరీరవృద్ధికి తల్లిపాలు ఎంతగా ఉపయోగపడ్డాయో, నా బుద్ధివికాసానికి భగవద్గీత అంతకంటే ఎక్కువగా ఉపయోగపడింది' అన్నారు. హృదయదౌర్బల్యాన్ని జయించి కర్తవ్యం తెలుసుకోవడమే గీతాసారం. గీతను ఆధారంచేసుకుంటే మనిషికి గౌరవం, స్వేచ్ఛ, సమత్వం వృద్ధిచెందుతాయి. సమాజంలో ప్రతివాడికీ ఎన్నో కష్టనష్టాలు, సుఖదుఃఖాలు ఏర్పడుతూనే ఉంటాయి. ఇది చాలా సహజమైన విషయం. కాని మానవుడు కష్టాలకు కుంగుతాడు, సుఖాలకు పొంగుతాడు. కాని గీత చదవడంవల్ల స్థిరబుద్ధి, వివేకం కలుగుతాయి. తపస్సు అంటే ముక్కు మూసుకోవడం కాదు. సమాజంలో ఎక్కడ ఉన్నా, ఏ పనిచేస్తున్నా ప్రతివ్యక్తి వాచికతపస్సు చేయవచ్చు. వాచికతపస్సు అంటే ఎదుటివ్యక్తికి నొప్పి కలిగించకుండా మాట్లాడటం. సత్యాన్ని హితాన్ని ప్రియంగా చెప్పాలి. ఆధ్యాత్మికశక్తి కలిగి ఉండాలి. దీనినే గీత తపస్సుగా చెప్పింది. మానవుడికి మరణం అంటే భయం. కాని భగవద్గీత మరణం గూర్చి చెబుతూ 'వాసాంసి జీర్ణాని యథా విహాయ, నవానిగృహ్ణాతినరో అపరాణి' – మనం ధరించే దుస్తులు పాతబడిపోతే వాటిని వదిలి వేరే దుస్తులు తొడుక్కుంటాం, అలాగే ఆత్మకూడ శిధిలమైన దేహాన్ని

వేదాలు వేదాలు వేదాలు గీతోపదేశం వేదాలు ఇతిహాసాలు పురాణాలు ఉపనిషత్తు

వదిలి ఇంకో శరీరంలోకి ప్రవేశిస్తుంది. ఆత్మ శరీరాన్ని వదిలిపెట్టడమే మరణం. ఇంకో శరీరాన్ని పొందడమే జన్మ. కనుక రాగద్వేషాలతో జీవితాన్ని నాశనం చేసుకోవద్దని గీత ఉపదేశం. భగవద్గీత ద్వారా వ్యక్తిత్వవికాసం కలుగుతుంది. కోపం వచ్చినపుడు మానవుడు రాక్షసునిగా మారటం సహజం. భగవద్గీత రెండవ అధ్యాయంలో కోపంవల్ల యుక్తాయుక్తవివేకజ్ఞానం ఎలా కోల్పోతామో చెప్పడం జరిగింది. గీతతో కోపాన్ని జయించవచ్చు. ఈ విధంగా 701 శ్లోకాలలో వ్యాసుడు అనంతవిజ్ఞాన భాండాగారంగా భగవద్గీతను మనకు అందించాడు. గీతోపదేశంవల్ల అర్జునుడు తన మోహాన్ని, అజ్ఞానాన్ని పోగొట్టుకుని కురుక్షేత్రంలో యుద్ధంచేసి విజయం సాధించి విజయుడయ్యాడు. ఈ సంసారకదనరంగంలో కామ, క్రోధాది శత్రువులతో పోరాడి విజయం సాధించి మానవులమైన మనం మాధవులం కావాలంటే భగవద్గీతే ఆధారం. అందుకే శంకరభగవత్పాదులు 'గేయం గీతానామసహస్రం' అంటూ భగవద్గీతను నిత్యం పారాయణం చేయమని ఆదేశించారు.



# అష్టాదశ పురాణదర్శనం

భారతీయ సంస్కృతి ఎంతో సనాతనం. సనాతనం అంటే చాలా ప్రాచీనమైనదని అర్థం. సంస్కృతికి ఆధారం గ్రంథాలు, మహనీయులైన పూర్వుల ఆదర్శజీవనవిధానం, ఆచారాలు, పండుగలు, ఉత్తమ కుటుంబజీవన సరళులతో కూడిన సనాతన భారతీయ సంస్కృతికి అతిముఖ్యమైన ఆధారం వేదాలు. వేదాలకు ఆధారం సాక్షాత్తు పరమేశ్వరుడు. కాని వేదాన్ని గ్రహించడం, పఠించడం, అర్థం చేసుకోవడం చాలా కష్టం. అవి సర్వజనసులభసాధ్యాలు కావు. భరద్వాజాది మహర్షులే వేదాన్ని మొత్తం గ్రహించలేకపోయారు. కేవలం శతసంవత్సర పరిమిత ఆయుర్దాయం కలిగిన నేటి మానవుడు అనంతమైన వేదాలలో ఏ ఒక్క వేదాన్నయినా పూర్తిగా చదివితే ధన్యుడే. కాని అది సాధ్యం కాదు. కలియుగ మానవుడి అల్పబుద్ధి, అల్పమైన ఆయుర్దాయం, అలసట, సోమరితనంవంటి దుర్లక్షణాలను చూసి అపారమైన కరుణ కలిగిన మహర్షి వేదవ్యాసులవారు అనంతమైన వేదాల సారాన్ని, ఉపనిషద్వేద వేదాంగరహస్యాలను, సృష్టి, స్థితి విలయాత్మకుడగు పరమాత్ముని పరతత్త్వస్వరూపాన్ని, అనంతవిజ్ఞానభాండాగారాన్ని అతి సులభశైలిలో సామాన్యులకు అర్థమయ్యే రీతిలో, ఎన్నో దృష్టాంతాలతో, కథలతో, ఉపాఖ్యానాలతో పురాణాల రూపంలో ఈనాటి మానవాళికి అందించాడు.

'ఋగ్వేదం భగవోఽధ్యేమి యజుర్వేదం సామవేదమధర్వణమ్

చతుర్థమితిహాస పురాణం పంచమం వేదానాం వేదమితి' (ఛాందోగ్యోపనిషత్తు) అన్నట్టు ఋగ్వేద, యజుర్వేద, సామ, అధర్వణ వేదాలతోపాటు, ఇతిహాస పురాణాలు పంచమవేదంగా ప్రసిద్ధికెక్కాయి. నారదీయపురాణంలో 'వేదాః ప్రతిష్ఠితా స్సర్వే పురాణేష్వేవ సర్వదా' - సమస్త వేదాలు పురాణాలలో ప్రతిష్ఠించబడ్డాయి అని ఉంది. పురాణాలు, వాటి స్వరూపం, అవి నేటి సమాజానికి ఇచ్చే ఉపదేశం ఏమిటన్నవి మనం చర్చించేముందు 'పురాణ' శబ్దార్థాన్ని పరిశీలిద్దాం.

**పురాణనామ వైశిష్ట్యం**

భారతీయసంస్కృతిలో ప్రాచీనకాలంనుంచి నామానికి ప్రాధాన్యతనివ్వడం జరిగింది. ఒక గ్రంథానికి గాని లేక ఒక వ్యక్తికి, వారి గుణాలను, అవగుణాలను బట్టి పేరు పెట్టడం సంప్రదాయంగా వస్తోంది. వేదం, ఉపనిషత్తులు, రామాయణం, మహాభారతం,

పురాణం, కుమారసంభవం వంటి గ్రంథాలను పరిశీలిస్తే, వాటి నామాలను బట్టి వాటిలో ప్రతిపాదించిన జ్ఞానం, తత్త్వం తెలుస్తాయి. 'యథానామ తథాగుణాః' అనే సిద్ధాంతం అనాదిగా వస్తోంది. సంస్కృతసాహిత్యంలో నామకరణానికి విశేష ప్రాధాన్యత ఉంది. ఏ భాషలో లేని విశేషం సంస్కృతంలో మనకు గోచరిస్తుంది. సంస్కృతంలో ప్రతి పదానికి, నామానికి 'వ్యుత్పత్తి' కనిపిస్తుంది. విశేషించి సంస్కృతసాహిత్యంలో గ్రంథవైశిష్ట్యాన్ని దాని పేరును బట్టి పరిపూర్ణంగా అర్థం చేసుకోవచ్చు.

'పురాణం' అనే శబ్దం ఋగ్వేదంలో చాలా చోట్ల కనబడుతుంది. పురాణశబ్దాన్ని నిఘంటువులు, పురాణాలు అనేక రకాలుగా నిర్వచించాయి.

1. 'పురా నవం భవతి పురాణమ్' (యాస్కనిరుక్తం)
   పాతదయినప్పటికి కొత్తగా కనపడడం వలన పురాణం.
2. 'పురాభవమితి పురాణమ్' (శబ్దకల్పద్రుమం)
   – పూర్వం కలిగింది కనుక పురాణం.
3. 'పురాపూర్వస్మిన్ భూతమితి పురాణమ్' (అమరకోశం)
   పూర్వకాలంలో జరిగింది కనుక పురాణం.
4. 'ప్రాగ్వృత్త కథనం పురాణమ్' (శుక్రనీతి)
   ప్రాచీన వృత్త కథనమే పురాణం.
5. పురాతనస్య కల్పస్య పురాణాని విదుర్బుధాః (మత్స్యపురాణం)
   పూర్వకల్పానికి సంబంధించిన చరిత్రలను వివరించేది కనుక పురాణం.
6. 'పురానీయతే ఇతి పురాణమ్' (వాచస్పత్యం)
   ప్రాచీనమైనది, ఇప్పుడు మనచేత గ్రహించబడుతోంది కనుక పురాణం.
7. 'పురా పరంపరాం పురాణం తేనవై స్మృతమ్' (పద్మపురాణం)
   ప్రాచీనకాలపరంపరను చెప్పేది పురాణం.
8. యస్మాద్పురాహ్యభూచ్చైత్ పురాణం తేన తత్స్మృతమ్ (బ్రహ్మాండపురాణం)
   పూర్వం ఎప్పుడో జరిగింది కనుక పురాణం.

ఈ విధంగా అనేక గ్రంథాలలోని నిర్వచనాలను పరిశీలిస్తే ప్రాచీనమైనప్పటికీ అందులో నూతన విశేషాలు, అంటే వర్తమానకాలానికి సంబంధించిన విశేషాలు వివరించి చెప్పడంవల్ల 'పురాపి నవమ్ పురాణమ్' అని తాత్పర్యంగా తెలుస్తోంది. దీనివల్ల మనం గ్రహించేది ఏమంటే వర్తమాన సమాజంలో 'పురాణం' అంటే పాతది, పురాతనమైనది, అభూతకల్పన అనే అభిప్రాయాన్ని తొలగించుకొని నిత్యనూతనాలు పురాణాలు అనే దృఢమైన విశ్వాసంతో వాటిని అధ్యయనం చేస్తే అజ్ఞానంలో మగ్గిపోతున్న నేటి సమాజానికి ఎన్నో కొత్త విషయాలు అవగతమై జ్ఞానదీపం వెలుగుతుంది. పరతత్త్వస్వరూపాన్ని భిన్నభిన్న మార్గాలలో వివరించడమే పురాణాల ప్రత్యేకత. బ్రహ్మ పదార్థ విజ్ఞానం నిత్యనూతనం కనుక పురాణాలకు సార్థకనామాన్ని భగవానుడు అనుగ్రహించాడు.

**పురాణలక్షణాలు**

వస్తుతత్త్వాన్ని అనుసరించి పురాణాలకు అనేక లక్షణాలు నిర్ణయించారు. అయితే వాటిలో అమరసింహుడు పేర్కొన్న ఈ కింది లక్షణం మిక్కిలి ప్రచారంలో ఉంది.

'సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణిచ
వంశానుచరితం చేతి పురాణం పంచలక్షణం'

సర్గం, ప్రతిసర్గం, వంశం, మన్వంతరం, వంశానుచరితం అనే ఐదు లక్షణాలు ఉన్నది పురాణం అని దీని అర్థం, వీటిలో ఒక్కో పదానికి విస్తారమైన అర్థాలను అష్టాదశ పురాణాలు నిర్వచించారు.

సర్గం = సృష్టిస్థితి లయాలతో కూడిన బ్రహ్మాండ ఉత్పత్తి.

ప్రతిసర్గం - కల్ప, కల్పాంతరాలలో జరిగే పునఃసృష్టి.

వంశం - దేవతల, బ్రహ్మర్షుల, దేవయోనుల వంశాలు, గోత్ర వివరాలు.

మన్వంతరం - స్వాయంభువ, స్వారోచిష మొదలైన చతుర్దశ మనువులు, వారి చరిత్రలు.

వంశానుచరితం - సూర్యచంద్రాది వంశాల వివరాలు, ఆయా వంశాలలో జన్మించిన చక్రవర్తుల చరిత్రలు. ఈ ఐదు విషయాలు వేటిలో పరిపూర్ణంగా వర్ణించి ఉంటాయో వాటిని పురాణాలు అంటారు. అయితే ఈ పంచలక్షణక్రమాన్ని సునిశితదృష్టితో పరిశీలిస్తే ఈ ప్రపంచ పుట్టుక, వికాసం, పరిణామక్రమం మనకు కనిపిస్తాయి. అష్టాదశ పురాణాలు మొత్తం ఈ ఐదు లక్షణాలకు కట్టుబడి ఉన్నాయి. లౌకికదృష్టితో పురాణాలను పరిశోధిస్తే పురాణాలలో ఈ విషయాలు మాత్రమే గాక భక్తి, జ్ఞాన, వైరాగ్యాలను ఉపదేశించే కథలు, వైద్య, సంగీత, జ్యోతిష, గణిత, వ్యాకరణ, ఛందస్సు, అలంకార, శిల్పశాస్త్ర, ఆగమ, నాట్య, విజ్ఞానశాస్త్ర, ఆధునిక విద్య మొదలైన సమస్త విషయాలు చోటుచేసుకున్నాయి. ఈ మొత్తం అంశాలు ప్రతి పురాణంలో ఉండాలనే నియమం లేదు. ఒక్కొక్క పురాణం ఒక్కొక్క అంగానికి ప్రాధాన్యత ఇవ్వడాన్ని మనం గమనించవచ్చు.

పురాణలక్షణాలను మహాపురాణ, ఉపపురాణ భేదాలతో రెండు విధాలుగా నిర్ణయించారు. పై ఐదు లక్షణాలు ఉపపురాణాలకు మాత్రమేనని, మహాపురాణాలు దశలక్షణ సమన్వితాలని భాగవతంలో నిర్ణయించారు. ఆ దశ లక్షణాలు

'సర్గోఽస్యాథ విసర్గశ్చ వృత్తీ రక్షాన్తరాణిచ
వంశో వంశాను చరితం సంస్థా హేతురపాశ్రయః॥
దశభిర్లక్షణైర్యుక్తం పురాణం తద్విదో విదుః॥

సర్గం, విసర్గం, వృత్తి, రక్ష, మన్వంతరం, వంశం, వంశానుచరితం, సంస్థాహేతువు, అపాశ్రయం అన్నవి పది లక్షణాలు. బ్రహ్మసృష్టిని సర్గం అని, దక్షుడు మొదలైన ప్రజాపతులు చేసిన సృష్టిని విసర్గం అని, ప్రాణులకు ముఖ్యమైన ఆహారం మొదలైన జీవికాసాధనాలే వృత్తి అనీ, దుష్టసంహారానికై భగవంతుడు ధరించిన అవతారాలు, లీలలే 'రక్ష' అనీ, స్వాయంభువాది మనువుల చరిత్ర మన్వంతరం అనీ, బ్రహ్మర్షుల గోత్రక్రమం 'వంశం' అనీ, సూర్య, చంద్ర వంశాల

చరిత్ర వంశానుచరితమనీ, ప్రళయమే 'సంస్థ'అనీ, సృష్టికి కారణభూతుడైన జీవుని గురించిన వివరమే 'హేతువు' అనీ, ఈ చరాచర జగత్తు విషయంలో పరమేశ్వరుడు సాక్షి మాత్రుడు కావడం 'అపాశ్రయమ'నీ వివరించబడ్డాయి. బ్రహ్మవైవర్తపురాణం, నారదపురాణం ఈ లక్షణాలనే బలపరుస్తూ దశాధికలక్షణాలను ప్రతిపాదించాయి.

తాత్పర్యం ఏమిటంటే శ్రుతి, స్మృతులందు కనిపించని సర్వధర్మాధి విషయాలను పురాణాలలో మనం దర్శించవచ్చు. ఈ విషయాన్ని నారదపురాణం చెబుతోంది.

'యన్నదృష్టం హి వేదేషు తత్సర్వం లక్ష్యతే స్మృతౌ
ఉభయోర్యన్నదృష్టం హి తత్పురాణైః ప్రణీయతే.'

వేదాలలో దృష్టికి గోచరించనిది స్మృతులలో కనిపిస్తుంది, శ్రుతి, స్మృతులలో కనిపించనిది పురాణాలలో నిరూపించబడింది. అందువల్లనే ఆధునిక విమర్శకులు కూడ పురాణలక్షణాలను నిర్దేశించటం అసాధ్యమన్న అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తున్నారు.

**పురాణాల పేర్లు**

పురాణాలు మహాపురాణాలని, ఉపపురాణాలని రెండు విధాలు. అయితే పురాణవాఙ్మయ సృష్టికర్త మాత్రం నారాయణస్వరూపుడైన వ్యాసుడే అని భగవత్పాదులవారు దృఢపరిచారు. 'అష్టాదశ పురాణానాం కర్తా సత్యవతీసుతః' అనే ప్రమాణాన్ని బట్టి సత్యవతీ సుతుడైన వ్యాసుడే పురాణాలకు కర్త అని భావించాలి. పురాణాలు మొత్తం 18. వీటిని వివరించే శ్లోకం

'మద్వయం, భద్వయం చైవ బ్రత్రయం, వచతుష్టయం
అ, నా, ప, లింగ, కూ, స్కా, ని పురాణాని పృథక్ పృథక్॥'

మద్వయం అనగా 'మ' అనే అక్షరంతో ప్రారంభమయ్యేవి రెండు పురాణాలు,
మ = మత్స్య, మార్కండేయపురాణాలు - 2
భద్వయం = భాగవతం, భవిష్యపురాణాలు - 2
బ్రత్రయం = బ్రహ్మపురాణం, బ్రహ్మాండపురాణం, బ్రహ్మవైవర్తపురాణం - 3
వ చతుష్టయం = విష్ణు, వరాహ, వామన, వాయు పురాణాలు - 4
అ = అగ్నిపురాణం; నా = నారద; ప= పద్మ; లిం = లింగ; గ = గరుడ; కూ = కూర్మ, స్కా = స్కాంధ;

వీటిని మహాపురాణాలుగా లెక్కించారు. ఇవికాక ఇంకా ఉపపురాణాలు 18 ఉన్నాయి.

**ఉపపురాణాలు**

1) ఆదిపురాణం 2) నరసింహపురాణం 3) స్కంధ 4) శివధర్మ 5) దుర్వాస పురాణం 6) నారదోక్తపురాణం 7) కపిలపురాణం 8) వామనపురాణం 9) ఔశనస పురాణం 10) బ్రహ్మాండపురాణం 11) వరుణపురాణం 12) కాలికాపురాణం 13) మహేశ్వరపురాణం 14) సాంబపురాణం 15) సౌరపురాణం 16) పారాశర పురాణం 17) మారీచపురాణం 18) భాస్కరపురాణం.

ఉపపురాణాలు కూడ మహాపురాణాలవలె ప్రాచీనమైనవి. ఎందుకంటె వేదాల రహస్యమర్మజ్ఞుడు షడ్గురు శిష్యుడు తన 'వేదార్థదీపిక' అనే గ్రంథంలో నృసింహ పురాణంలోని శ్లోకాలనిచ్చాడు. ఇతడు చాలా ప్రాచీనుడని పండితుల అభిప్రాయం.

వ్యాసోక్తమైన అష్టాదశమహాపురాణాలను అనుకరిస్తూ, కొన్నిచోట్ల వాటిలోని కథను సంక్షేపిస్తూ, మరికొన్నిచోట్ల మార్పులు చేస్తూ ఉపపురాణాలు రాయబడ్డాయి. విష్ణుపురాణం ఉపపురాణాలను మునులు రచించారని చెప్పింది.

'మహాపురాణాన్యేతాని హ్యష్టాదశమహామునే

అథాచోపపురాణాని మునిభ్యాం కథితానిచ (వి.పు. 3-624).

ఈ ఉపపురాణాలు మొత్తం పద్దెనిమిదని బ్రహ్మవైవర్త, స్కాంధపురాణాదులలో చెప్పబడింది. ఆచరణీయాలైన ఆయా ధర్మాల విషయంలో వాటి రహస్యాలను, సూక్ష్మాలను వివరించే విషయంలో ఈ ఔపపురాణాలకు మహాపురాణాలకు వలెనే ప్రామాణ్యం ఉందని అంగీకరించబడింది.

**ఔపపురాణాలు**

ఈ ఉపపురాణాలే కాక ఇంకా కనబడే ఇతరపురాణాలను 'ఔపపురాణాలు' అనే పేరుతో పిలుస్తారు. ఇవి కూడ పద్దెనిమిది అని విమర్శకుల భావన. అవి 1) సనత్కుమార, 2) బృహన్నారదీయ, 3) ఆదిత్య, 4) సూర్య, 5) నందికేశ్వర, 6) కౌర్మ, 7) భాగవత, 8) వాశిష్ఠ, 9) భార్గవ, 10) ముద్గల, 11) కల్కి 12) దేవీ, 13) మహాభాగవత, 14) బృహద్ధర్మ, 15) పరానంద, 16) వహ్ని, 17) పశుపతి, 18) హరివంశాలు.

ధర్మకల్పద్రుమం అనే గ్రంథంలో జ్ఞానానందసరస్వతి పురాణాలు అనేకం ఉన్నాయని ప్రతిపాదించాడు. ఆయన ఈ పురాణ సాహిత్యాన్ని ఐదు విధాలుగా విభజించాడు. అవి 1) మహాపురాణాలు, 2) ఉపపురాణాలు, 3) ఔపపురాణాలు, 4) ఉపోపపురాణాలు, 5) ఉపౌపపురాణాలు. ఈ విధంగా ఉపోప - ఉపౌప పురాణాలు మొత్తం 18 అని వివరణ. ఈ అవాంతర భేదాలను గుర్తించకుండా ఉపపురాణాలు అసంఖ్యాకంగా ఉన్నాయని లోకప్రసిద్ధి ఏర్పడింది. ఈ ఉపపురాణాలలో దైవ, వైష్ణవ, సౌర, శైవ, శాక్తాది రూపంలో భేదాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఆధునిక విమర్శకులు ఉపపురాణ, ఔపపురాణాదులలో చాలావరకు క్రీ.శ. 10వ శతాబ్దానికి పూర్తయి ఉండవచ్చని ఊహిస్తున్నారు. కొన్ని పురాణాలు మాత్రం క్రీస్తుకు పూర్వం పంచమ శతాబ్దంనుంచి ఉన్నాయనే అభిప్రాయం ఉంది. మహాపురాణ, ఉపపురాణ, ఉపౌపపురాణాది భేదాలతో విలసిల్లుతున్న పురాణవాఙ్మయం ఎంత విస్తృతమైనదో ఊహించటానికి వీలు కాదు. అష్టాదశ మహాపురాణాలలో మరొక విభజన మనకు కనిపిస్తోంది. ఆ విభజన ప్రకారం 1) సాత్త్వికపురాణాలు, 2) రాజసపురాణాలు, 3) తామసపురాణాలు. పద్మపురాణంలో వీటి భేదాలను చెప్పడం జరిగింది.

'వైష్ణవం నారదీయంచ, తథా భాగవతం శుభమ్
గారుడంచ తథాపద్మం వారాహం శుభదర్శనే॥
సాత్త్వికాని పురాణాని, విజ్ఞేయాని శుభానివై॥

ఈ వివరణ ప్రకారం విష్ణు, నారద, గరుడ, భాగవత, వరాహ, పద్మపురాణాలు సాత్త్వికాలు. ఇవి స్థితికారుడైన విష్ణువును కీర్తిస్తాయి. బ్రహ్మ, బ్రహ్మవైవర్త, మార్కండేయ, భవిష్య, వామన పురాణాలు సృష్టికర్త అయిన బ్రహ్మను కీర్తిస్తాయి కనుక రాజసపురాణాలు అని ప్రసిద్ధి. అగ్ని, మత్స్య, కూర్మ, లింగ, శివ, స్కంధ పురాణాలు లయకారకుడైన శివుని, దుర్గను కీర్తిస్తాయి కనుక తామసపురాణాలు అని ప్రసిద్ధి. మత్స్యపురాణంలో సాత్త్విక, రాజస, తామస భేదాలతోపాటు 'సంకీర్ణమని' మరొక భేదాన్ని చెప్పడం జరిగింది. 'సంకీర్ణేషు సరస్వత్యాః పితౄణాంచ నిగద్యతే' – సరస్వతిని, పితృదేవతలను పొగిడేవి సంకీర్ణాలు అని మత్స్యపురాణ వివరణ.

అయితే తామసపురాణాలను చదవరాదని, అవి మంచివి కావని లోకంలో తప్పుడు ప్రచారం చేస్తుంటారు. ఈ విభజన పురాణాదులకే కాదు, దేవతలతో పాటు వేదాలకు కూడా వర్తిస్తుంది. యజుర్వేదాన్ని సాత్త్వికమని, ఋగ్వేదం రాజసమని, సామవేదం తామసమని చెప్పడం జరిగింది. వీటితోపాటు న్యాయ, సాంఖ్యాది శాస్త్రాలు, గౌతమ, శంఖ, లిఖితాది స్మృతులు కూడా తామసాలని వచించడం విశేషం. సకల చరాచరసృష్టికి మూలకారకుడైన పరమాత్మ ఈ సత్త్వ, రజ, స్తమస్సులనే గుణాలతో విష్ణు, బ్రహ్మ, ఈశ్వరులుగా వ్యవహరించబడుతున్నారు. ఈ సమస్తసృష్టి త్రిగుణాలపై ఆధారపడిఉంది.

త్రిగుణాత్మకులైన త్రిమూర్తులలో హెచ్చుతగ్గులు లేనట్లే సాత్త్విక, రాజస, తామసాలన్న పేరుతో పురాణాలలో హెచ్చుతగ్గులు లేవు. నిర్గుణ, నిరంజన, నిత్యశుద్ధచైతన్యమే మూలమని సకలపురాణాల సారాంశం. ఈ రహస్యాన్ని సమత్వంతో గ్రహిస్తే సమస్త పురాణాలకు సమన్వయం సాధ్యమవుతుంది.

ఆధునిక విమర్శకులు ఈ పురాణాలను మరొక దృష్టితో విభజన చేశారు. వి. రామచంద్రదీక్షితార్ బ్రాహ్మం, పాద్మం బ్రహ్మదేవుని; బ్రహ్మవైవర్తం సూర్యభగవానుని, అగ్నిపురాణం అగ్నిదేవుని, శివ, స్కాంధ, లింగ, కూర్మ, వామన, వరాహ, భవిష్యపురాణాలు శివుని, నారద, భాగవత, విష్ణు, గరుడపురాణాలు విష్ణువును కీర్తించినట్లు విభజన చేశారు. ఆధునిక విమర్శకులు విజ్ఞానసర్వస్వాలుగా గరుడ, అగ్ని, నారద పురాణాలను పేర్కొన్నారు. తీర్థ, వ్రత, క్షేత్ర మాహాత్మ్యాలను అధికంగా వర్ణించిన పురాణాలు 1) పద్మ, 2) స్కాంధ, 3) భవిష్య అని చెప్పారు. ఇంకా అనేకమైన ప్రక్షిప్తాలతో పెరిగిన పురాణాలుగా భాగవత, బ్రహ్మ, బ్రహ్మవైవర్తాలను పేర్కొన్నారు. చరిత్ర సంబంధమైన అంశాలను అధికంగా వర్ణించిన పురాణాలుగా బ్రహ్మాండ, వాయుపురాణాలను పేర్కొన్నారు. మత ప్రాధాన్యత కలిగిన పురాణాలుగా లింగ, వామన, మార్కండేయ పురాణాలను కీర్తించారు.

ఇలా ప్రాచీనులు, నవీనులు కూడా ఈ పురాణవాఙ్మయాన్ని ఒక విజ్ఞానసర్వస్వంగా భావిస్తున్నారు. సమన్వయాత్మక దృష్టితో మాత్రమే పురాణాలను అధ్యయనం చేయాలి. అలా చేస్తేనే వాటిలోగల సూక్ష్మాలను ఈనాటి సమాజానికి అందించగలం. ఇలా అనంతవిజ్ఞాన భాండాగారాన్ని లోకానికి అందించిన వ్యాసుని రుణాన్ని మనం ఏ విధంగానూ తీర్చుకోలేం. కేవలం ఒక వ్యక్తి నిర్మించిన ఇంత పెద్ద ధార్మికవాఙ్మయం విశ్వంలో ఒక సంస్కృతభాషలో తప్ప మరే భాషలోనూ లేదు.



## పురాణకర్త - వ్యాసులవారు

వ్యాసం వశిష్ఠ నప్తారం శక్తేః పౌత్ర మకల్మషమ్
పరాశరాత్మజం వన్దే శుకతాతం తపోనిధిం;

అని వ్యాసుని పుట్టుపూర్వోత్తర చరిత్రను వర్ణించే శ్లోకం ప్రసిద్ధంగా కనబడుతోంది. బ్రహ్మదేవుని కుమారుడు వశిష్ఠుడు, ఆయనకు శక్తి, శక్తికి పరాశరుడు, పరాశరునికి కుమారుడుగా వ్యాసుడు ఆవిర్భవించాడు. వ్యాసుని కుమారుడు అవధూత శుకులు. కనుకనే 'శుకతాతం' అని వ్యాసుని కీర్తించాడు. పరాశర మహర్షికి దాశరాజు కుమార్తె అయిన సత్యవతివల్ల వ్యాసుడు ఉదయించాడు. వ్యాసుడు నారాయణుని అవతారమని పురాణాలలో ఉంది.

'వేదాన్ వ్యసతీతి వేదవ్యాసః' అని వ్యాస శబ్దానికి వ్యుత్పత్తి. వేదాలను విభజించటం వల్ల వేదవ్యాసుడయ్యాడు. వ్యాసుడనే శబ్దం సంజ్ఞానామం కాదు, బిరుదునామమని పండితుల అభిప్రాయం. వ్యాసుడి అసలు పేరు 'ద్వైపాయనుడు'. నదీప్రవాహ మధ్యంలో ద్వీపంమీద పుట్టడంచేత ద్వైపాయనుడు అయ్యాడు. కృష్ణవర్ణంలో ఉండటంవల్ల కృష్ణద్వైపాయనుడని పిలిచారు. ప్రతి ద్వాపరయుగంలో వ్యాసుడు వస్తూ ఉంటాడని, ఇలాంటి వ్యాసులు మొత్తం 27 మంది ఉన్నారనీ విష్ణుపురాణ, దేవీభాగవతాదులలో చెప్పడం జరిగింది. ఆ 27 మంది వ్యాసుల నామాలు, 1) బ్రహ్మ, 2) ప్రజాపతి, 3) శుక్రాచార్యుడు, 4) బృహస్పతి, 5) సూర్యుడు, 6) యముడు, 7) ఇంద్రుడు, 8) వశిష్ఠుడు, 9) సారస్వతుడు, 10) త్రిధామ, 11) త్రిశిఖుడు, 12) భరద్వాజుడు, 13) అంతరిక్షుడు, 14) వర్ణి, 15) త్రయ్యారణుడు, 16) ధనంజయుడు, 17) ఋతుంజయుడు, 18) జయుడు, 19) జాతకర్ణుడు, 20) గౌతముడు, 21) హర్యాత్మ, 22) వాజశ్రవసుడు, 23) సోమశుష్మాయణ తృణబిందువు, 24) ఋక్షుడు (వాల్మీకి) 25) శక్తి, 26) పరాశరుడు, 27) కృష్ణద్వైపాయనుడు.

'వ్యాసో నారాయణో విష్ణుః' - వ్యాసుడు నారాయణ అంశతో, అజ్ఞానంలో మగ్గిపోతున్న మానవజాతిని జ్ఞానమనే ఆయుధంతో ఉద్ధరించడానికి వచ్చిన ప్రఖ్యాత అవతారమని ఈ వాక్యం చెబుతోంది.

# అష్టాదశ పురాణాలు

## 1. బ్రహ్మపురాణం

దీనికి ఆదిబ్రహ్మమనే పేరు ఉంది. బ్రహ్మపురాణంలో మొత్తం 245 అధ్యాయాలు, 14000 శ్లోకాలు ఉన్నాయి. పురాణానికి ఉన్న పంచలక్షణాలు ఈ పురాణంలో పూర్తిగా ఉన్నాయి. మొదట సృష్టిని వివరించిన తర్వాత సూర్య, చంద్రాదుల వంశ వర్ణనం సంక్షిప్తంగా చేయబడింది. అనేక నదీనదాలను వివరిస్తూ శ్రీగౌతమీ మాహాత్మ్యాన్ని 106 అధ్యాయాలలో ఈ పురాణం వర్ణించింది. శ్రీకృష్ణజన్మం, జంబూద్వీపవర్ణనం, నరకవర్ణనం, ఉమామహేశ్వర కల్యాణవైభవం, మార్కండేయ ఆఖ్యానాలు ఇందులో ఉన్నాయి. మొత్తం 32 అధ్యాయాలలో భాగవత దశమస్కంధంలోవలె శ్రీకృష్ణచరిత్ర మొత్తం ఇందులో వర్ణించబడింది.

ఇందులోని కోణార్కదేవాలయ (ఒరిస్సా) తీర్థమహిమ, అక్కడ ఉన్న మార్తండవైభవం, సూర్యపూజా ప్రకరణం, ఆదిత్యస్తోత్రాదులు సూర్యోపాసకులకు విశేషంగా సహకరిస్తాయి. ముఖ్యంగా ఒరిస్సాలోని పూరిజగన్నాథ ఆలయవిశేషాలను దాదాపు 10 అధ్యాయాలలో ఈ పురాణం వివరిస్తుంది. దీనిని బట్టి ఈ పురాణాన్ని ఆ ప్రాంతాలలో చెప్పి ఉంటారని విమర్శకుల భావన.

అవతారాలను వర్ణించే సందర్భంలో 'దత్తాత్రేయ, రామ, పరశురామ, వామన, నరసింహ అవతారాల' ప్రస్తావన వస్తుంది. సదాచార వర్ణన, అన్నదానవైభవం, వర్ణాశ్రమధర్మాలు, యోగాభ్యాసవిశేషాలు ఈ పురాణంలో కనిపిస్తాయి. విశేషించి 10 అధ్యాయాలలో సాంఖ్యయోగం వర్ణించబడి ఉంది.

'పురాణం వైష్ణవం త్వేతత్ సర్వకిల్బిష నాశకం
విశిష్టం సర్వశాస్త్రేభ్యః పురుషార్థోపపాదకమ్' - (బ్ర.పు. 2466. 20 శ్లో).

విష్ణుదేవతాకమైన బ్రహ్మపురాణాన్ని పఠించడంవల్ల సర్వపాపాలు తొలగుతాయి. ఈ పురాణం సర్వశాస్త్రాల కంటె శ్రేష్ఠమని వ్యాసుడు ఈ పురాణప్రశంస చేశాడు.

## 2. పద్మపురాణం

పురాణాలలో రెండవ పురాణంగా పద్మపురాణాన్ని కీర్తించారు. ఈ పురాణంలో 50,000 శ్లోకాలున్నాయి. ఆరుఖండాలు ఉన్నాయి. అవి: ఆది, భూమి, బ్రహ్మ, పాతాళ, సృష్టి, ఉత్తరఖండాలుగా సృష్టిఖండంలో సముద్రమథనం, పృథుచక్రవర్తి ఉత్పత్తి, పుష్కరతీర్థవాసుల ధర్మాలు, ఇంద్ర-వృత్రాసుర యుద్ధం, వామనావతారం, మార్కండేయ వృత్తాంతం, కార్తికేయజననం, శ్రీరామచరిత్ర, తారకాసురసంహారం మొదలైన కథలు ఉన్నాయి. భూమిఖండంలో శివశర్మ అనే బ్రాహ్మణుడు పితృభక్తితో స్వర్గం చేరిన కథ ఉంది. పృథుచక్రవర్తి కథను ఈ పురాణం విశేషంగా వివరించింది. ముఖ్యంగా ఈ పురాణం విష్ణుభక్తి ప్రధానమైనది. అయినా ఇతర దేవతల గురించి కూడా సమాధికభక్తి గౌరవాలతో వివరించింది. శివకేశవులకు అభేదాన్ని సూచిస్తూ, బ్రహ్మదేవుడికి వీరి ఏకత్వాన్ని ప్రతిపాదించడం ఇందులో ఉంది. 'శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే' అనే ప్రసిద్ధ శ్లోకవాక్యం ఈ పురాణంలోదే.

స్వర్గఖండం దేవ, గరుడ, గంధర్వ, యక్ష, కిన్నర, కింపురుష లోకాలను సవిస్తరంగా వర్ణించింది. ఇందులోని శకుంతలోపాఖ్యానం భారతంలోని ఉపాఖ్యానానికి భిన్నంగా ఉంది. పాతాళఖండంలో రామకథ వస్తుంది. సీతాదేవి జన్మరహస్యాన్ని పద్మపురాణం వివరిస్తుంది. వ్యాసుని శ్రీమద్భాగవతపురాణ ప్రశస్తి ఈ పురాణంలో మాహాత్మ్యరూపంలో ఉంది. ఇక ఉత్తరఖండంలో అనేకమైన ఆఖ్యానాలున్నాయి. శ్రీమహావిష్ణుతత్త్వం, విష్ణుప్రీతికరాలైన వ్రతాలు, హరివంశపురాణంలోని విషయాలుగా ఇందులో చెప్పబడ్డాయి. అయితే ఈ పురాణ ప్రతుల విషయంలో వంగదేశ ప్రతికి, దక్షిణాది ప్రతికి కొన్ని తేడాలు కనిపిస్తాయి.

**3. విష్ణుపురాణం**

విష్ణుభక్తి ప్రధానమైన పురాణమే విష్ణుపురాణం. ఈ పురాణంలో 6412 శ్లోకాలు ఉన్నాయి. మొత్తం 6 అంగాలుగా ఈ పురాణం విభజించబడింది. పురాణాలలో దీనిని చిన్నదిగా చెప్పవచ్చు. అయినా మహాపురాణ లక్షణాలన్నీ ఇందులో కనిపించడం విశేషం. ముఖ్యంగా ఈ పురాణాన్ని శ్రీరామానుజాచార్యులవారు, అద్వైతప్రతిష్ఠాపకులు శ్రీ శంకరభగవత్పాదులు, శ్రీమదానందతీర్థులవారు తమ తమ భాష్యాది రచనలలో ప్రమాణంగా గ్రహించి దీని వైశిష్ట్యాన్ని తెలియజేశారు. దీనిలో మొత్తం 126 అధ్యాయాలున్నాయి. మొదటి అంగంలో సృష్టివర్ణనం, రెండవ అంగంలో భూగోళవర్ణనం, మూడవఅంగంలో ఆశ్రమధర్మవర్ణనం, నాల్గవఅంగంలో చంద్రవంశరాజుల వర్ణనలున్నాయి. ఐదవఅంగంలో శ్రీకృష్ణుని జన్మ, చరిత్రాల వివరణ ఉంది. ఇందులో శ్రీకృష్ణచరిత్ర భాగవతంలోని దశమస్కంధంలో వలెనే వర్ణితమైంది. ఆరవ అంగంలో ప్రళయం గురించి, భక్తిప్రమాణం గురించి ఉంది.

శ్రీమద్భాగవతంలో పంచమస్కంధంలో గద్యలు ఉన్నట్లు, ఇక్కడ 4వ అంగంలో సుందరమైన గద్యలున్నాయి. భక్తి, జ్ఞాన, వైరాగ్యాల సమన్వయాన్ని ఈ పురాణంలో మనం దర్శించవచ్చు. విష్ణువుకు ప్రాధాన్యం ఇచ్చినా, శివద్వేషం, ఇతర దేవతా ద్వేషం కనిపించదు. శివకేశవసంవాదంలో

'యోహం సత్వం జగచ్చేదం స దేవాసుర మానుషమ్, మత్తో
నాన్యదశేషం యత్ తత్త్వం జ్ఞాతు జహోర్హసి"

అని నువ్వు నేనే, ఈ జగత్తు కూడా నేనే, అవిద్యా మోహితులైనవారు మన ఇద్దరి మధ్య భేదం చూపుతూ ఉంటారన్న అద్వైతతత్త్వోపదేశం ఇందులో ఉంది. అయితే నారదీయపురాణంలో చెప్పిన ప్రకారం ఈ పురాణంలో మొత్తం 24,000 శ్లోకాలుండాలి. కాని ప్రస్తుతం లభ్యమయ్యే గ్రంథాలలో 6,000 మాత్రమే కనిపిస్తున్నాయి. విష్ణు ఉపాసకులకు ఇది ఉపాసనగ్రంథం. భాగవతంలోని రహస్యాలు ఈ పురాణంలో కూడా విశేషంగా ఉన్నాయి.

**4. వాయుపురాణం**

అతిప్రాచీనమైన పురాణాలలో వాయుపురాణం ఒకటి. ఇందులో మొత్తం 112 అధ్యాయాలు, దాదాపు 11,000 శ్లోకాలు ఉన్నాయి. ఇందులోని భాగాలకు పాదాలనే పేరు పెట్టారు. ప్రక్రియాపాదం, అనుషంగపాదం, ఉపోద్ఘాతపాదం, ఉపసంహార

పాదాలని వీటి పేర్లు. ఈ పురాణ ప్రారంభంలో సృష్టి ప్రక్రియ విస్తృతంగా వర్ణించబడింది. తర్వాత నాలుగు ఆశ్రమాలు, వాటి ధర్మాలు ప్రతిపాదించబడ్డాయి. వాయుపురాణంలో ఉన్న విశేషం ఏమిటంటే, ఇందులో భూగోళవర్ణనం చాలా విస్తృతంగా జరిగింది. 50, 51, 52, 53 అధ్యాయాలలో ఖగోళవర్ణనం కూడ విస్తారంగా చేయబడింది. యాగాలు, యజ్ఞాలు, తీర్థాలు, ఋషులు, ఋషివంశాలు, ప్రాచీన మహారాజుల వంశాలు సవివరంగా వర్ణించబడ్డాయి. 86, 87 అధ్యాయాలలో సంగీతసంబంధమైన అనేక విషయాలు చెప్పబడ్డాయి. ముఖ్యంగా శివతత్త్వప్రధానంగా ఈ పురాణం కనబడుతుంది. శ్రీ శివమానస పూజ ఈ పురాణంలో బాగా వర్ణించబడింది. శివుని 8 నామాలు ప్రధానమైనవని ఈ పురాణం చెబుతుంది. అవి: 1) శివాయ నమః, 2) మహేశ్వరాయనమః, 3) రుద్రాయనమః, 4) విష్ణవేనమః, 5) పితామహాయనమః, 6) సంసారభిషజేనమః 7) సర్వజ్ఞాయనమః, 8) పరమాత్మాయ నమః. శివదీక్షలలో పాశుపతదీక్ష ప్రధానం. ఆ దీక్షా వివరాలు ఈ పురాణంలో కనిపిస్తాయి.

త్రివిధ భక్తిస్వరూపాలను, వాచక, ఉపాంశు మానసజపాలను, జపస్థలం రహస్యాలను ఈ పురాణం వర్ణించింది. నైమిశారణ్యంలో శౌనకాది మహర్షులందరికి వాయువు ఈ పురాణం చెప్పినందువల్ల దీనిని 'వాయుపురాణం' అన్నారు. హరిహర అభేదాన్ని చెప్పడానికి శ్రీకృష్ణుడి శివభక్తిని ఈ పురాణం బాగా వర్ణించింది.

### 5. శ్రీమద్భాగవతం

అష్టాదశ పురాణాలలో అతి ప్రసిద్ధమైనది శ్రీమద్భాగవత మహాపురాణం. 18000 శ్లోకాలతో, 12 స్కంధాలలో ఈ పురాణం రచించబడింది. పురాణాలకు ఉండవలసిన పంచలక్షణాలే కాక ఈ పురాణానికి దశలక్షణాలు చెప్పబడ్డాయి. భాగవతం భక్తి ప్రధాన గ్రంథం. 'భక్త్యా భాగవతం జ్ఞేయా నవ్యుత్పత్త్యా నటీకయా' - భాగవతం అర్థం కావాలంటే భక్తి ఉండాలి కాని, పాండిత్యం కాదని ఆర్షసంప్రదాయం చెబుతోంది. భక్తి సర్వస్వంగా ఈ పురాణాన్ని చెప్పవచ్చు. వల్లభ సంప్రదాయం పుష్టి, చైతన్య సంప్రదాయాలకు ఆధారగ్రంథంగా ఇది అష్టాదశపురాణాలలో ఏ పురాణానికీ లేని సప్తాహ సంప్రదాయం భాగవతానికి ఉండడం విశేషం.

ప్రథమస్కంధంలో కౌరవ, పాండవ తుదిఘట్టాల వర్ణనతో భాగవతం ఆరంభించబడింది. అంటే భారతం ముగింపుతో భాగవతం మొదలు అని చెప్పవచ్చు. భీష్మస్తుతి, భీష్మనిర్యాణం, కుంతీస్తవం, వ్యాసుని తత్త్వం, పరీక్షిత్తు శాపం, శుక ఆగమనం ప్రథమస్కంధ విశేషాలు. రెండవ స్కంధంలో విదురమైత్రేయ సంవాదంలో సృష్టి నిర్మాణ రహస్యాలు, భగవద్భక్తితత్త్వ వర్ణనలు ఉన్నాయి. తృతీయస్కంధంలో కపిలదేవహూతి సంవాదంలో అనేక రహస్యాలు, భక్తియోగం, అష్టాంగయోగం, సాంఖ్యయోగ వర్ణన ఉన్నాయి. చతుర్థస్కంధంలో ధ్రువచరిత్ర, దక్షచరిత్ర, పంచమ స్కంధంలో నరకవర్ణనలు, భూగోళరహస్యాలు, షష్ఠమస్కంధంలో అజామీళ చరిత్ర, సప్తమంలో ప్రహ్లాదచరిత్ర, అష్టమస్కంధంలో గజేంద్రస్తవం, వామనావతారచరిత్ర, నవమస్కంధంలో సూర్యవంశ చరిత్ర, శ్రీమద్రామాయణం, రంతిదేవచరిత్ర, దశమంలో

90 అధ్యాయాలలో శ్రీకృష్ణుడి సంపూర్ణచరిత్ర, ఏకాదశంలో యదుగీత, ద్వాదశంలో కలియుగ వర్ణన, పరీక్షిత్తు మోక్షంతో భాగవతం ముగుస్తుంది.

అద్వైతతత్త్వాన్ని ప్రధానంగా భాగవతంలో దర్శించవచ్చు. భాగవతానికి అనేక వ్యాఖ్యానాలు ఉండటం దాని వైశిష్ట్యాన్ని చాటుతోంది. అద్వితీయమైన పరబ్రహ్మ తత్త్వాన్ని కనుగొనడానికి ఉత్తమసాధనంగా భక్తిని ఉపదేశించడం భాగవత వైశిష్ట్యం.

**6. నారదపురాణం**

నారదపురాణంలో మొత్తం రెండు భాగాలున్నాయి. పూర్వభాగంలో 125 అధ్యాయాలు, ఉత్తరభాగంలో మొత్తం 82 అధ్యాయాలున్నాయి. ఈ పురాణంలో శ్లోకాల సంఖ్య మొత్తం 25,000. ఇది విష్ణుపారమ్యాన్ని బోధించే పురాణం. వైష్ణవ ఆగమాలతో పాటు, పాంచరాత్ర విధానం ఈ పురాణంలో పూర్తిగా వర్ణించబడింది. ప్రధానంగా బౌద్ధమతాన్ని నిరసించిన పురాణంగా దీనిని చెప్పవచ్చు. వైష్ణవులకు శ్రేష్ఠమైన ఏకాదశి వ్రతమాహాత్మ్యాన్ని ఈ పురాణం విశేషంగా వర్ణించింది. పరమవైష్ణవుడైన రుక్మాంగద చరిత్ర ఇందులో వర్ణించబడింది. అలాగే జ్యోతిష్య, ఛందశ్శాస్త్రాలను ఇందులో పరిచయం చేయడం జరిగింది. మంత్రశాస్త్రానికి సంబంధించిన ప్రస్తావనలో శ్రీరామ, హనుమత్, కృష్ణ, మహేశ్వర మంత్రాలు సవివరంగా వర్ణించబడ్డాయి. వైష్ణవతంత్రాన్ని లోకానికి చాటడానికి వచ్చిన నారదుని పేరుతో ఈ పురాణం ఉండడంవల్ల వైష్ణవులకు ఈ పురాణం ఆరాధ్యగ్రంథం.

**7. అగ్నిపురాణం**

విశ్వవిజ్ఞానభాండాగారంగా ఈ పురాణాన్ని అభివర్ణించవచ్చు. మొత్తం 383 అధ్యాయాలలో అనేక ప్రాచీన భారతీయ విషయాలను ఇది వర్ణించింది. భగవంతుని అవతారాలను సంక్షిప్తంగా వివరించిన తర్వాత రామాయణ, మహాభారతకథలను మొత్తం విపులంగా ఇది అందించింది. దేవాలయ నిర్మాణవిధి, శిల్పశాస్త్రం, దేవతా ప్రతిష్ఠ సంబంధమైన విషయాలు, భగవంతుని అర్చనా పద్ధతులు, ఆగమశాస్త్ర రహస్యాలు ఇందులో విస్తారంగా వివరించబడ్డాయి. జ్యోతిశ్శాస్త్రం, ధర్మశాస్త్రం, రాజనీతి, ఆయుర్వేదం, వ్యాకరణశాస్త్రం, కావ్యవిశేషాలు, అలంకారశాస్త్ర విషయాలు అతివిపులంగా ఈ పురాణంలో చర్చించబడ్డాయి. యోగశాస్త్రానికి సంబంధించిన యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధులతో కూడిన అష్టాంగయోగ ప్రక్రియను ఈ పురాణం అద్భుతంగా నిరూపించింది. అగ్నిపురాణంలో అనేకమైన తాంత్రిక, యంత్ర అనుష్ఠానాలను ప్రతిపాదించడంవల్ల తాంత్రికపురాణంగా దీనిని కొందరు పేర్కొన్నారు. భారతీయ విద్యాసర్వస్వంగా ఈ పురాణాన్ని అభివర్ణించవచ్చు.

**8. మార్కండేయపురాణం**

చిరంజీవి అయిన మృకండుమహర్షి పుత్రుడు మార్కండేయుని పేరుతో ఈ పురాణం అవతరించింది. ఈ పురాణంలో మొత్తం 9000 శ్లోకాలున్నాయి. 137 అధ్యాయాలున్నాయి. మహాభారతానికి సంబంధించిన అనేక రహస్యాలు ఈ



పురాణంలో కనిపించడం విశేషం. మదాలస అనే రాజమహిషి చరిత్రలో అలర్కుడికి ఆమె చిన్నతనంలో బ్రహ్మవిద్య ఉపదేశించగా, అతడు పెరిగి పెద్దవాడై రాజ్యం పరిపాలించే సమయంలో కర్మజ్ఞానాల మధ్య చక్కని సమన్వయం చూపించడం, శ్రీదత్తాత్రేయ మహాత్మ్యాన్ని వర్ణించడం ఈ పురాణంలో చూడవచ్చు. కర్మవిపాకమనే అధ్యాయంలో నేటి సమాజానికి కావలసిన అనేక వైజ్ఞానిక విషయాలు, గర్భగతుడైన జీవుడి పెరుగుదల రహస్యాలు, మరణకాలంలో జీవుడికి కలిగే అనుభవాలు ఈ పురాణంలో మాత్రమే కనిపిస్తాయి. శివమాహాత్మ్యాన్ని ఈ పురాణం చక్కగా వర్ణించింది. మహాకాళీ, మహాసరస్వతీ, మహాలక్ష్మీ స్వరూపమైన దేవీతత్త్వాన్ని మొత్తం 13 అధ్యాయాలలో 'దేవీమాహాత్మ్యం' అనే పేరుతో ఈ పురాణంలో వ్యాసుడు వివరించాడు. శ్రీవిద్యాఉపాసకులకు ఆరాధ్యమైన 'దుర్గాసప్తశతి'గా అమ్మ ఉపాసనావైభవాన్ని 700 శ్లోకాలలో ఈ పురాణం అందించింది. అలాగే కొన్ని వైదిక కర్మలద్వారా అభీష్టాలను ఏ విధంగా పొందాలో కొన్ని ఉపాఖ్యానాల ద్వారా ఈ పురాణం విశదీకరించింది. పురాణాలలో భాగవతం తర్వాత అంతటి ప్రాచుర్యాన్ని ఈ మార్కండేయపురాణం పొందడం దీని వైశిష్ట్యానికి నిదర్శనం.

**9. లింగపురాణం**

ఈ పురాణంలో మొత్తం 163 అధ్యాయాలు, 11,000 శ్లోకాలు ఉన్నాయి. శివుని 28 అవతారాల వివరణ ఇందులో ఉంది. శివుని లింగరూపంలో పూజించడానికిగల కారణాన్ని ఈ పురాణం సోదాహరణంగా నిరూపించింది. శైవమతానికి సంబంధించిన వ్రతాలు, తీర్థాలు ఇందులో విస్తృతంగా వర్ణించబడ్డాయి. పాశుపతసిద్ధాంతానికి సంబంధించిన అనేక విషయాలను ఈ పురాణం ప్రతిపాదించింది. అష్టమూర్తి అయిన శివుని ఎనిమిది నామాలు ఈ పురాణంలో కనిపిస్తాయి. శివమంత్రరహస్యాలు, శివలింగభేదాలు, శివతత్త్వం ఇందులో విస్తారంగా వర్ణించబడ్డాయి. కనుకనే శైవులకు ఇది ఆరాధ్యగ్రంథం.

**10. వరాహపురాణం**

విష్ణుతత్త్వాన్ని ప్రధానంగా వర్ణించడం వల్ల దీనికి 'వరాహపురాణం' అనే పేరు వచ్చింది. ఈ పురాణంలో దేవీభాగవతం ప్రకారం 25,000 శ్లోకాలుండాలి. కాని ప్రస్తుతం లభిస్తున్న వరాహపురాణంలో 11,000 శ్లోకాలు మాత్రమే ఉన్నాయి. శ్రీమహావిష్ణువుకు సంబంధించిన అనేక వ్రతాలు, విధులు ఇందులో వర్ణించబడ్డాయి. ముఖ్యంగా ద్వాదశీవ్రతమాహాత్మ్యం పూర్తిగా ఈ పురాణంలో మాత్రమే లభించడం విశేషం. పదకొండు మాసాలలో ఉన్న పదకొండు ద్వాదశులకు పదకొండు విష్ణురూపాలతో సంబంధం ఉన్నట్లుగా చెప్పబడింది. మార్గశీర్ష శుక్లద్వాదశి మత్స్యఅవతారానికి సంబంధించి మత్స్యద్వాదశిగా, పుష్యద్వాదశి - కూర్మావతారానికి సంబంధించి కూర్మద్వాదశిగా, మాఘద్వాదశి - వరాహద్వాదశిగా, ఫాల్గుణద్వాదశి - నృసింహద్వాదశిగా, చైత్రద్వాదశి - వామన ద్వాదశిగా, వైశాఖద్వాదశి - పరశురామద్వాదశిగా, జ్యేష్ఠద్వాదశి - శ్రీరామద్వాదశిగా, ఆషాఢద్వాదశి -

కృష్ణద్వాదశిగా, శ్రావణద్వాదశి - బుద్ధద్వాదశిగా, భాద్రపదద్వాదశి - కల్కి ద్వాదశిగా, ఆశ్వీయుజద్వాదశి - పద్మనాభద్వాదశిగా - ఇలా దశావతారవిశేషాలతో ప్రతిమాసంలో వచ్చే శుక్లపక్ష ద్వాదశులను వర్ణించటం జరిగింది.

ఈ పురాణంలో మధురామాహాత్మ్యం, నచికేతోపాఖ్యానం, తులసీ విశేషాలు వర్ణించబడ్డాయి. అయితే ఉపనిషత్తులలో వర్ణించబడిన నచికేత ఉపాఖ్యానానికి, ఈ పురాణంలో వర్ణించబడిన నచికేత ఉపాఖ్యానానికి చాలా తేడాలున్నాయి. ఈ పురాణంలోని ఈ ఆఖ్యానంలో స్వర్గనరకాల వర్ణన చాలా విస్తృతంగా చేయబడింది కాని వేదాంత విషయం లేదు. ముఖ్యంగా పాంచరాత్ర, శ్రీరామానుజ వైష్ణవసంబంధమైన అనేక విషయాలు ఇందులో వర్ణించబడ్డాయి. నారాయణుడే ఆదిదేవుడని ప్రతిపాదించడంతోపాటు ప్రతిమానిర్మాణ విషయాలు, ఆలయప్రతిష్ఠ, ద్వాదశినాటి విష్ణుపూజ, పాంచరాత్ర ఆగమ ప్రామాణ్యం ఇందులో విపులంగా వర్ణించటం జరిగింది. అలాగే భగవంతుని నామమాహాత్మ్యాన్ని విశేషంగా వర్ణించింది.

## 11. స్కాంధపురాణం

శివుని కుమారుడైన కుమారస్వామి మరోపేరు స్కంధుడు. ఆయన దేవతలకు ఉపదేశించడంవల్ల ఈ పురాణానికి 'స్కాంధపురాణం' అనే పేరు వచ్చింది. అష్టాదశ పురాణాలలో అన్నింటికంటె పరిమాణంలో ఇది చాలా పెద్దది. ఈ పురాణంలో మొత్తం 81,000 శ్లోకాలున్నాయి. ఆరు సంహితలున్నాయి. అవి 1) సనత్కుమార సంహిత - 36000 శ్లోకాలు 2) సూతసంహిత - 6000 శ్లోకాలు 3) శంకరసంహిత - 30000 శ్లోకాలు 4) వైష్ణవసంహిత - 5000 శ్లోకాలు 5) బ్రహ్మ సంహిత - 3000 శ్లోకాలు 6) సౌరసంహిత - 1000 శ్లోకాలు. ఇలా 81000 శ్లోకాలతో పురాణరాజుగా ఈ పురాణం కీర్తించబడుతోంది. సంహితలుగా విభజించబడిన ఈ పురాణంలో ఖండాలు కూడా ఉన్నాయి. 1) మహేశ్వరఖండం 2) వైష్ణవఖండం 3) బ్రహ్మఖండం 4) రేవాఖండం 5) కాశీఖండం 6) తాపీ ఖండం 7) ప్రభాసఖండాలు వీటిలో ప్రధానమైనవి.

సూతసంహితలో శివోపాసనా వైభవం వర్ణించబడింది. ముఖ్యంగా వైదిక, తాంత్రిక పూజావిధానాలు రెండూ సవిస్తరంగా ప్రతిపాదించబడ్డాయి. శివమాహాత్మ్యఖండం, జ్ఞానయోగఖండం, ముక్తిఖండం, యజ్ఞవైభవఖండం అని నాలుగు భాగాలుగా శివతత్త్వం వర్ణించబడింది. సాంగోపాంగమైన హఠయోగప్రక్రియ, ముక్తిఖండంలో ముక్తికి ఉపాయాలు, అద్వైతవేదాంత సిద్ధాంతం ప్రధానంగా వర్ణించబడి ఉన్నాయి. ఈ పురాణంలోని సూతసంహితకు విద్యారణ్యులు భాష్యం వ్రాయడం విశేషం. శంకరభగవత్పాదులు బ్రహ్మసూత్ర భాష్యం రాయడానికి ముందు 18 సార్లు సూతసంహితను పారాయణం చేశారని ప్రసిద్ధి. ఈ పురాణంలో పూరీ, ఉజ్జయిని, ప్రభాసం తదితర సకలతీర్థాలు వర్ణించబడ్డాయి. ముఖ్యంగా కాశీక్షేత్ర ప్రత్యేకతను వర్ణించే 'కాశీఖండం' ఈ పురాణంలోనిదే. కాశీఖండం చదివి కాశీకి వెడితే కాశీరహస్యాలు అన్నీ తెలుస్తాయి. మహామహిమాన్వితమైన, బ్రహ్మప్రాచుర్యం కలిగిన

'శ్రీసత్యనారాయణస్వామి వ్రతం' ఈ పురాణంలోని రేవాఖండం లోనిదే. అనేక క్షేత్ర మాహాత్మ్యాలుండడం ఈ పురాణ ప్రత్యేకత.



### 12. వామనపురాణం

విష్ణువు దశావతారాలలో ఒకటైన వామనావతారాన్ని ప్రధానంగా వర్ణించడంవల్ల దీనికి ఈ పేరొచ్చింది. విష్ణుభక్తుల చరిత్రలను, విష్ణుతత్త్వాన్ని వివరించడం వల్ల ఇది వైష్ణవప్రధానమైన పురాణం అయింది. అయినా శివచరిత్రను కూడ వర్ణించడం జరిగింది. వామనపురాణంలో మొత్తం 95 అధ్యాయాలు, 6000 శ్లోకాలున్నాయి. అయితే ఇతర పురాణాలలో పేర్కొన్న ప్రకారం దీనిలో 10,000 శ్లోకాలుండాలి. సుదర్శనచక్రకథ, వామనావతార వైభవం, సాలగ్రామాదుల వర్ణన, కొన్ని విష్ణుసంబంధమైన వ్రతాదులు, తులసీమాహాత్మ్యం ఈ పురాణంలో ఉన్నాయి. శివచరిత్రలో భాగంగా పార్వతీతపస్సు, కుమారసంభవం మొదలైన ఘట్టాలు ఉన్నాయి.

### 13. కూర్మపురాణం

కూర్మావతార ప్రస్తావనవల్ల దీనికి ఆ పేరు వచ్చింది. ఈ పురాణంలో బ్రాహ్మీ, భాగవతీ, సౌరీ, వైష్ణవీ అనే నాలుగు సంహితలున్నాయని, మొత్తం శ్లోకాల సంఖ్య 18,000 అని మత్స్యపురాణంలో చెప్పబడి ఉంది. కాని ప్రస్తుతం లభిస్తున్న కూర్మపురాణంలో 6,000 శ్లోకాలు మాత్రమే ఉన్నాయి. విష్ణువు కూర్మావతార రూపుడై ఇంద్రద్యుమ్నుడనే మహారాజుకు ఈ పురాణాన్ని ఉపదేశించినట్లు వర్ణితమైంది. అయినా శివునే ముఖ్యదేవతగా ఈ పురాణం ప్రతిపాదించడం విశేషం. శక్తిపూజాప్రాశస్త్యాన్ని విపులంగా వర్ణించింది. శక్తి సహస్రనామస్తోత్రం ఒకటి దీనిలో ఉంది. విష్ణువు శివరూపుడేనని, లక్ష్మి పార్వతికి ప్రతికృతి అని వర్ణించబడింది. కూర్మపురాణంలో రెండు భాగాలున్నాయి. పూర్వభాగంలో సృష్టివర్ణన, పార్వతి తపస్సు ప్రధానంగా వర్ణించబడింది. కాశీ, ప్రయాగ క్షేత్రాల వైభవం ఇందులో వర్ణితమైంది. ఉత్తరభాగంలో ఈశ్వరగీత, వ్యాసగీత ఉన్నాయి. నాలుగు ఆశ్రమాలధర్మాలను ఈ పురాణం విపులీకరించింది. పరమేశ్వరుడు కూడ విష్ణువువలె చతుర్వ్యూహుడని ఈ పురాణం పేర్కొంది.

### 14. మత్స్యపురాణం

మత్స్యఅవతారకథను ప్రధానంగా వివరించడం వల్ల దీనిని మత్స్యపురాణమన్నారు. ఈ పురాణంలో మొత్తం 291 అధ్యాయాలు, 15000 శ్లోకాలు ఉన్నాయి. మన్వాదుల చరిత్ర, పితృదేవతా గణాలవర్ణన ఇందులో అధికంగా ఉంది. రాజవంశ వర్ణనలో సోమవంశం విస్తారంగా వర్ణించబడింది. అనేక వ్రతాలు ఈ పురాణంలో చెప్పబడ్డాయి. త్రిపురాసురయుద్ధం, తారకాసురవధలతో శివునిచరిత్ర ప్రధానంగా వర్ణించబడి ఉంది. నర్మదానదీతీరంలోని క్షేత్రాలు చాలావరకు విపులంగా వర్ణించబడ్డాయి. ప్రళయకాలంలో అన్ని నదులు నశించినప్పటికీ నర్మద మాత్రం నశించదని చెబుతూ గంగామాహాత్మ్యం కంటే అధికంగా నర్మదమాహాత్మ్యాన్ని ఈ పురాణం వర్ణించడం విశేషం. మొత్తం 25 అధ్యాయాలలో రాజధర్మ ప్రతిపాదన,

అనేక దేవతామూర్తుల ప్రతిమా నిర్మాణ విషయాలు ఇందులో చెప్పబడ్డాయి. వశిష్ఠ, విశ్వామిత్రాది ఋషుల వంశాలను ఇది చక్కగా వివరించింది.

### 15. గరుడపురాణం

శ్రీమహావిష్ణువు గరుత్మంతునికి ప్రపంచసృష్టిని గూర్చి బోధించడంవల్ల దీనికి 'గరుడపురాణం' అనే పేరు వచ్చింది. ఇందులో మొత్తం 264 అధ్యాయాలు, 18000 శ్లోకాలున్నాయి. మహాపురాణంగా ఇది కీర్తించబడింది. మొత్తం రెండు ఖండాలుగా ఈ పురాణం ఉంది. 11 అధ్యాయాలలో రాజనీతి గురించి, 32 అధ్యాయాలలో ఆయుర్వేదానికి సంబంధించి ఎన్నో విషయాలు ఇందులో చెప్పబడ్డాయి. 13 అధ్యాయాలలో సాంఖ్యతత్త్వం వర్ణితమైంది. 45 అధ్యాయాల ద్వితీయఖండానికి 'ప్రేతఖండం' అని పేరు. దీనిని 'ప్రేతకల్పం' అని కూడా అంటారు. మరణానంతరం జీవుని అవస్థ, లోకాంతరాలకు వెళ్ళడం మొదలైన విషయాలు ఇందులో చర్చించబడ్డాయి. గర్భావస్థ, నరకం, యమలోకమార్గం, ప్రేతాగణనివాసస్థానం, ప్రేత లక్షణాలు, ప్రేతత్వవిముక్తి, యమలోకవిషయాలగురించి ఇంత విస్తృతంగా ఏ పురాణంలోనూ లేదు. ఇందులో నరకలోక వర్ణన విస్తారంగా కనిపిస్తుంది.



### 16. బ్రహ్మవైవర్తపురాణం

'వివృతం బ్రహ్మ కార్త్స్న్యే కృష్ణేన యత్ర శౌనక
బ్రహ్మవైవర్తకం తేన ప్రవదన్తి పుర్వాదః' కృష్ణుడు బ్రహ్మను వివరించడంవల్ల దీనికి బ్రహ్మవైవర్తమని పేరు వచ్చింది. దీనిలో మొత్తం 25000 శ్లోకాలున్నాయి. బ్రహ్మఖండం, ప్రకృతిఖండం, గణేశఖండం, కృష్ణజన్మఖండం అనే నాలుగు ఖండాలు ఇందులో ఉన్నాయి. కృష్ణజన్మఖండం పురాణంలో సగభాగం ఆక్రమించింది. రాధాకృష్ణుల చరిత్ర చెప్పడమే ఈ పురాణ ప్రధానలక్ష్యం. బ్రహ్మఖండంలో మొత్తం 30 అధ్యాయాలు ఉన్నాయి. కృష్ణుడు చేసిన జగత్సృష్టి ఇందులో ప్రధాన విషయం. 16వ అధ్యాయంలో ఆయుర్వేదానికి సంబంధించిన విషయాలు ఉన్నాయి. ప్రకృతిఖండం మొత్తం ప్రకృతి స్వరూపిణి అయిన అమ్మ చరిత్ర. దేవీభాగవతంలోవలె దుర్గా, లక్ష్మి, సరస్వతీ, సావిత్రీ, రాధా అనే ఐదురూపాలలో ప్రకృతి, కృష్ణ ఆదేశంవల్ల ఆవిర్భవిస్తూ ఉంటుందని ఈ పురాణం వర్ణించింది. ఇక గణేశఖండంలో గణేశుని ఉత్పత్తి, ఆయన చరిత్ర వర్ణింపబడ్డాయి. పుణ్యకవ్రతానుష్ఠానం ద్వారా పార్వతీదేవికి శ్రీకృష్ణుడే స్వయంగా గణేశుని రూపంలో అవతరించినట్లు వర్ణితమయింది. ఈ పురాణంలో గణపతి గురించిన విశేషాలు అధికంగా కనిపిస్తాయి.

ఇక కృష్ణజన్మఖండంలో రాధాదేవి చరిత్రే ప్రధానంగా కనిపిస్తుంది. రాధాకృష్ణ సంప్రదాయం, వల్లభసంప్రదాయం గురించిన వివరణ ఇందులో ఉంది. కృష్ణతత్త్వాన్ని వర్ణించే పురాణం అవడంవల్ల కృష్ణభక్తులైన వైష్ణవులు, ముఖ్యంగా గౌడదేశీయులైన వైష్ణవులు దీనికి చాలా ప్రాధాన్యం ఇస్తారు. ఈ పురాణం శ్రీకృష్ణుడే పరాత్పర బ్రహ్మ అని, అతని శక్తి రాధ అని, గోలోకంలో నివాసమని వర్ణించింది. అంతేగాక ఈ పురాణంలో తంత్రశాస్త్రం ఎక్కువగా వర్ణితమైంది. రాధాచరిత్ర మరే పురాణంలోనూ

కనిపించదు. బ్రహ్మవైవర్తంలో ప్రధానంగా ఆమె చరిత్ర ద్వారా కృష్ణతత్త్వాన్ని నిరూపించడం విశేషం.



**17. బ్రహ్మాండపురాణం**

సమస్త బ్రహ్మాండ విశేషాలను వర్ణించిన పురాణం కనుక ఇది 'బ్రహ్మాండపురాణం' అయింది. ఈ పురాణంలో మొత్తం 12000 శ్లోకాలు ఉన్నాయి. ప్రక్రియాపాదం, అనుషంగపాదం, ఉపోద్ఘాతపాదం, ఉపసంహారపాదం అని మొత్తం నాలుగు పాదాలున్నాయి. ప్రథమ ఖండంలో భూగోళవర్ణనం అతివిస్తృతంగా జరిగింది. జంబూద్వీప, పర్వత, నదీ వర్ణన అద్భుతంగా జరిగింది. భారతదేశానికి కర్మభూమి అనే పేరు ఎందుకు వచ్చిందో ఈ పురాణం వివరించింది. ముఖ్యంగా శ్రీ దత్తాత్రేయ అవతార మాహాత్మ్యాన్ని ఈ పురాణం అద్భుతంగా వివరించింది. శ్రీ దత్తాత్రేయులవారు ఉపదేశించిన 'యోగం' సవిస్తరంగా ఉంది. దత్తభక్తులందరికీ ఉపయోగకరమైన విషయాలు ఈ పురాణంలో మాత్రమే కనిపిస్తాయి. పరశురాముని చరిత్ర ఇందులో మరొక ప్రత్యేక ఘట్టం. అంతేగాక లోకప్రసిద్ధమైన అమ్మవారి 'లలితాసహస్రనామాలు' ఈ పురాణంలోనివే కావడం విశేషం. లలితోపాఖ్యానం పేరుతో సవిస్తరంగా లలితాదేవి ఉపాసన రహస్యాలను ఈ పురాణం వర్ణించింది. అలాగే భద్రాశ్వ, కేతుమాల, చంద్రద్వీప, కింపురుష వర్ష, కైలాస, శాల్మలీద్వీప, కుశద్వీప, క్రౌంచద్వీప, శాకద్వీప, పుష్కరద్వీపాదులు, గ్రహమండల విషయాలు, నక్షత్రాల చరిత్ర ఇందులో విపులంగా కనిపిస్తుంది.

**18. భవిష్యపురాణం**

కలియుగ భవిష్యచరిత్రను చెప్పినందువల్ల దీనిని 'భవిష్యపురాణం' అన్నారు. నారద, అగ్ని, మత్స్య, వాయుపురాణాదులు దీనిని పేర్కొన్నాయి. అయితే ప్రస్తుతకాలంలో ఈ పురాణంలో అనేక అర్వాచీన విషయాలను చేర్చడం జరిగింది. 'ఇంగ్రేజ' అనే నామంతో ఇంగ్లీష్‌వారు భారతదేశానికి రావడం కూడా పేర్కొనడం ఇందులో విశేషం. ఈ పురాణంలో 14000 శ్లోకాలు, బ్రహ్మపర్వ, విష్ణుపర్వ, శివపర్వ, సూర్యపర్వ అనే నాలుగు పర్వాలున్నట్లు నారదపురాణంలో ఉంది. సూర్యోపాసన, కలియుగ లక్షణాలు, కలియుగంలో ఆవిర్భవించిన అనేక రాజవంశాల వర్ణన ఈ పురాణంలో అతివిస్తృతంగా ఉంది. అంతేగాక కలియుగంలో రాబోయే అవతారమైన కల్కి అవతార ప్రస్తావన ఈ పురాణంలో ఉంది.

పురాణవాఙ్మయ సృష్టికర్త శ్రీ వేదవ్యాసులవారు అష్టచిరంజీవులలో ఒకరు. ఆయన తన సాహిత్యసృష్టితో ఇప్పటికీ వాఙ్మయరూపంలో మనందరికీ కనిపిస్తున్నాడు. ఆయన సాహిత్యసృష్టి సార్వకాలికం, సార్వజనీనం అని చెప్పవచ్చు. వ్యాసవాఙ్మయం మొత్తం ఒకే స్వరూపం. ఆయన అనంతమైన వేదవిజ్ఞానాన్ని వివిధ దశలలో వివిధ స్థాయిలలోని మానవుల కొరకు తీర్చిదిద్దాడు. వేదవిద్యను వివిధశాఖలుగా విడదీసి అందించడం, వేదప్రతిపాదితమైన పరతత్త్వాన్ని బ్రహ్మసూత్రాలుగా సూత్రీకరించడం, వేదోపబృంహణంగా 'పురాణసంహిత' రచించడం, పంచమవేదంగా మహాభారత

ఇతిహాసాన్ని సృజించడం, పామరభక్తులందరికీ వివిధ స్తోత్రాలను అందించడం, సర్వకాలికమైన సత్యప్రతిపాదనం వ్యాసుని ద్వారా జరిగిందని చెప్పవచ్చు.

వేదవిజ్ఞానాన్ని సామాన్యులకు అందించేందుకు వ్యాసులవారు ఎన్నుకున్న సాహిత్యప్రక్రియలు రెండని చెప్పవచ్చు. అవి 1. పురాణాలు 2) ఇతిహాసం. అయితే సృష్టికి మూలమైన బ్రహ్మ పదార్థాన్ని వివరించిన తర్వాత దానినుంచి ఈ విశ్వమంతా ఎలా వచ్చిందన్న ప్రశ్నకు సమాధానంగా సర్వమానవాళికి శ్రేయస్సును కలిగించడానికి పురాణసంహితను రచించాడు. ఒకే పరాతత్వం ఈ విశ్వంగా ఎలా ఆవిష్కరించబడిందో కథలుగా, ఆఖ్యానాలుగా పురాణాలలో వర్ణించాడు.

పురాణాలలో చెప్పిన అనేక ఐతిహాసిక విషయాలు యదార్థాలేనన్న విషయం పండితుల పరిశోధనల వల్ల తేలింది. ఉదాహరణకు శ్రీమద్భాగవత మహాపురాణంలో శ్రీకృష్ణుని పట్టణమైన ద్వారకాపురిని కృష్ణ నిర్గమనం తర్వాత సముద్రం ముంచివేసిందని వర్ణించడం జరిగింది. ఆధునిక విమర్శకులు అది అబద్ధం అని కొట్టివేశారు. అయితే గుజరాత్‌లో అరేబియా సముద్రంలోపల మునిగి ఉన్న ద్వారకను అంతరిక్ష ఉపగ్రహాలు కనుగొన్నాయి. ప్రస్తుతం భారతప్రభుత్వం సముద్రంలో దాగి ఉన్న ద్వారకను బయటకు తేవడానికి బృహత్తర ప్రణాళికను చేపట్టింది. వ్యాసప్రోక్త పురాణాలు నిత్యనూతనాలు, సత్యాలు. భాగవతంలో పేర్కొన్న శ్రీకృష్ణనిర్గమనం కూడా యదార్థం. శ్రీకృష్ణుడు ఈ భూమండలాన్ని వదిలిపెట్టినప్పుడే కలియుగం మొదలైందని కథనం.

"యదా ముకుందో భగవాన్ ఇమాం మహీంజహౌ
స్వతన్వా శ్రీవణీయ సత్కథః
తదా హరేవా ప్రతిబుద్ధ చేతసా మధర్మ హేతుః కలి రన్వవర్తత" (భాగవతపురాణం)

అంటే కలియుగం మొత్తం 4,32,000 సంవత్సరాలు. ప్రస్తుతం మొదటిపాదంలో 5,106 సంవత్సరాలు గడిచాయి. ఇంచుమించు ఇదే లెక్కలో అమెరికా అంతరిక్ష పరిశోధనాసంస్థ (నాసా) క్రీ.పూ. 3012లో శ్రీకృష్ణనిర్గమనం జరిగిందని తన పరిశోధనలతో ప్రకటించడం విశేషం. భారతీయ పురాణాలను పాశ్చాత్యులు విశ్వసించి పరిశోధనలు జరపడం చెప్పుకోదగింది. పురాణాలు పుక్కిటి పురాణాలు కావని, యదార్థసత్యాలని, అన్ని కాలాలకు వర్తిస్తాయని స్పష్టమవుతోంది.

పురాణాలలో చెప్పిన అనేక ఐతిహాసిక విషయాలు యదార్థాలే అన్న విషయాన్ని పండితుల పరిశోధనలు బయటపెడుతున్నాయి. కొన్ని శిలాలేఖలు, ముద్రలు మొదలైనవి లభించడంతో పురాణాలు చక్కటి చరిత్ర గాథలుగా అంగీకరించబడుతున్నాయి. వాయు, బ్రహ్మాండపురాణాలలో వర్ణించిన వాకాటిక రాజుల చరిత్ర నిజమైందని తామ్రపత్రాదులద్వారా నిరూపించబడింది. ఆంధ్రరాజుల విషయంలో అనేక ఐతిహాసిక సత్యాలు వాయు, బ్రహ్మాండపురాణాల ద్వారా బయటపడ్డాయి. శిశునాగ, నందవంశం, శుంగ, కణ్వ, మౌర్య వంశాదులను పురాణాలు వర్ణించాయి. చరిత్రకు అందని సూర్య, చంద్ర వంశాల రాజుల వర్ణన ఎక్కువగా పురాణాలలో కనబడుతుంది.



భారతఖండాన్ని నవఖండాలుగా విభజిస్తూ పురాణాలలో వర్ణనం ఉంది. మత్స్యపురాణంలో వీటి ప్రస్తావన రావడం విశేషం. ఇంద్రద్వీపం, వారుణం, భారతం (కుమారద్వీపం), కసేరు, తామ్రపర్ణం, గభస్తిమంత్రం, నాగద్వీపం, సౌమ్యం, పున్నాగ అని వీటిపేర్లు. చరిత్రకారులు పురాణంలో వర్ణించి వీటిలో ఆరింటిని గుర్తించారు. అవి: ఇంద్రద్వీపం అండమాన్స్; నాగద్వీపం - నికోబార్; తామ్రపర్ణం - లంక; వారుణద్వీపం - బోర్నియా; కసేర్‌మాన్ ద్వీపం - మలయద్వీపం, కుమారద్వీపం - భారతదేశం. ఈ విధంగా చరిత్రను ప్రదానం చేసి పురాణాలు చదివితే అనేక విలువైన నిగూఢమైన రహస్యాలు తెలుస్తాయి. వ్యాసుడు తన పురాణసంహితను కేవలం ద్వాపరయుగానికి పరిమితం చేయక, రాబోయే కలియుగ మానవుల శ్రేయస్సు కోసం, ఆర్ష సంస్కృతి, సంప్రదాయాలను పరిరక్షించడానికి, అనంతమైన వేదవిజ్ఞానాన్ని ఈ విధంగా అందజేశాడు.

జ్ఞానవిజ్ఞాన సముపార్జనకు పురాణ అధ్యయనం నేటికాలంలో చాలా అవసరం. సృష్టిని, ప్రకృతిని అవగాహన చేసుకొని, మానవుడు తన లోపల దాగి ఉన్న శక్తిని గ్రహించి, తద్వారా ఏ విధంగా ప్రయోజనాలు పొందాలో పురాణాలు మనకు నిర్దేశిస్తున్నాయి. పురాణం అనేది చతుర్దశ మహావిద్యలలో ఒకటి. పురాణవిద్య అనేది వ్యక్తిగత ప్రయోజనాల్ని, సామాజిక ప్రయోజనాల్ని నెరవేర్చే విధంగా ఉండేది. పురాణాలలో వ్యాసభగవానుడు మొత్తం 64 విద్యలను గురించి వర్ణించాడు. శ్రీకృష్ణభగవానుడు సాందీపమహర్షి గురుకులంలో 64 రోజులలో ఈ 64 విద్యలు అభ్యసించి జగద్గురువు అయ్యాడని పురాణాలు వర్ణించాయి.

ఈనాడు యువత వ్యక్తిత్వవికాసం పేరుతో ప్రత్యేకమైన శిక్షణను డబ్బులు చెల్లించి పొందుతున్నారు. వ్యాసవాఙ్మయం అధ్యయనం చేస్తే ఇటువంటి ప్రత్యేకశిక్షణలు అక్కరలేదు. పురాణాలలో "సత్యం, ధర్మం, ప్రేమ, అహింస, సహనం, సహకారం, నీతి, నిజాయితీ, జాలి, కరుణ, వాత్సల్యం, ఆర్ద్రత, దయాగుణం, దానగుణం, ఓర్పు, వినయం, విధేయత, శీలం, ఇంద్రియపటుత్వం వంటి అంశాలకు చాలా ప్రాధాన్యతను ఇవ్వటం జరిగింది. అంటే వ్యక్తిలో ఉండే అంతర్గతశక్తులను వృద్ధిపరిచే 'ఆధ్యాత్మికత'ను ఇవి ప్రధానంగా ఉపదేశించడం జరిగింది. శ్రీకృష్ణకుచేలుల స్నేహం, ప్రహ్లాదుడి స్థితప్రజ్ఞ లక్షణాలు, అర్జునుడి వీరత్వం, ద్రౌపది, సీత, అనసూయ, సతీసుమతి వంటి స్త్రీల మహోన్నత వ్యక్తిత్వం, రామాయణంలో వర్ణించబడిన కుటుంబవ్యవస్థ ఇవన్నీ ఆదర్శప్రాయమైనవి. పురాణాలను అధ్యయనం చేయటం ద్వారా మానవుడు మాధవుడు కాగలడన్న సత్యాన్ని వ్యాసుడు తన వాఙ్మయంలో నిరూపించాడు.



# || జిజ్ఞాస ||

## రామాయణంపై కొన్ని అనుమానాలకు సమాధానాలు

**1. రామాయణం నిజంగా జరిగిన కథేనా? లేక కల్పితమా? ఆధారాలున్నాయా?**

**సమాధానం:** శ్రీమద్రామాయణం జరిగిన కథే. అందులో సందేహం లేదు. 24వ మహాయుగంలో త్రేతాయుగంలో 30వేల సంవత్సరాలు మిగిలి ఉండగా శ్రీరామమూర్తి అవతరించాడు. అంటే ప్రస్తుత కలియుగానికి ఒక కోటి 81 లక్షల 47వేల సంవత్సరాలకు ముందు రామావతారం వచ్చిందని పండితులు ఊహిస్తున్నారు. రామాయణం జరిగిన కథ అనడానికి ప్రధాన ఆధారం నేటి అయోధ్యలో ప్రవహిస్తున్న 'సరయూ' నదే.

**2. లవకుశ సినిమాలో దశరథుడికి శాంత అనే కూతురున్నట్లు చూపించారు. అలాగే లవకుశులతో శ్రీరామలక్ష్మణభరతశతృఘ్నులు, యుద్ధం చేసినట్లు, యజ్ఞాశ్వాన్ని లవకుశులు బంధించినట్లు చూపించారు. లవకుశులకు శ్రీరామపరివారానికి నిజంగా యుద్ధం జరిగిందా? కల్పితమా?**

**సమాధానం:** అసలు లవకుశ సినిమాయే కల్పితం. దశరథుడికి శాంత అనే కుమార్తె ఉన్నట్లయితే దశరథుడు సంతానం కోసం పుత్రకామేష్టి చేసి ఉండేవాడు కాదు. శాంత రోమపాదుడనే రాజు కూతురు. ఋష్యశృంగమహర్షి భార్య. ఇక లవకుశులతో శ్రీరామపరివారానికి యుద్ధమనేది జరిగినట్లు వాల్మీకి రామాయణంలో లేదు. ఇది తెలుగు సాహిత్యజానపదుల కల్పన. మూలగ్రంథంలో లేనందువల్ల అది మనకు ప్రమాణం కాదు. కనుక ఆ 'లవకుశ' అనే చిత్రమే కల్పన. అంతేకాదు, 'శ్రీరామాంజనేయయుద్ధం, శ్రీకృష్ణార్జునయుద్ధం, మాయాబజార్ కథ, గయోపాఖ్యానం మొదలైనవన్నీ చమత్కారకల్పనలే. రామాయణ, భారత మూల గ్రంథాలలో ఇవి కనిపించవు. పరమభక్తుడైన హనుమంతుడితో శ్రీరాముడు యుద్ధం చేయడం కలలో కూడా ఊహించరాని ఘట్టం. గీతాశాస్త్రం ఉపదేశించిన జగద్గురువు కృష్ణుడితో సఖ్యభక్తికి నిదర్శనమైన అర్జునుడు యుద్ధం చేశాడనేది హాస్యాస్పదం. ఇంతేకాదు మాయాబజార్‌లోని కథ కూడ మహాభారతంలో కనిపించదు. కనుక ఇవన్నీ అభూతకల్పనలే. నమ్మరాదు.



**3. శ్రీమద్రామాయణంలో లక్ష్మణుడు గీత గీసినట్లు, ఊర్మిళాదేవి 14 సం.లు నిద్రించినట్లు మేము టి.వి. సీరియల్సులో చూశాం. అవి నిజమా?**

**సమాధానం:** వాల్మీకి రామాయణంలో సీతాపహరణం చేసే సందర్భంలో లక్ష్మణుడు సీతాదేవికి రక్షణ కోసం 'లక్ష్మణరేఖ' గీసినట్లు లేదు. ఇది కూడా కేవలం జానపద రామాయణాల సృష్టి. ఊర్మిళ కూడ నిద్రపోవడం అబద్ధం.

**4. శ్రీరాముని కంటే సీత వయస్సులో పెద్దదని అంటారు. నిజమా?**

**సమాధానం:** కాదు. పద్మపురాణం, శ్రీమద్రామాయణం మొదలైన గ్రంథాలు చూడగా సీతాదేవి రాముడికంటె 9 సం.లు చిన్నదని అర్థమవుతుంది. సీతారామకల్యాణం జరిగే సమయానికి రాముని వయస్సు 16 సం.లు. సీతమ్మ వయస్సు 6 సం.లు. అయితే 6 సం.ల అమ్మాయికి వివాహం ఏమిటనే ప్రశ్న కలుగుతుంది. కాని సీత అందరివంటి ఆడపిల్ల కాదు. మహాశక్తి స్వరూపం. సీతమ్మ అయోనిజ. కాళిదాసు చెప్పినట్లు 'తేజసాం న వయః సమీక్ష్యతే' తేజశ్శాలులకు వయస్సుతో నిమిత్తం లేదు. కనుక సీత రాముడికంటె చిన్నది.

**5. సీతారాముల కల్యాణం శ్రీరామనవమి రోజు జరిగిందా? నవమి శ్రీరాముని పుట్టినరోజు కదా! మరి వివాహం ఎందుకు?**

**సమాధానం:** చాలా మంచి ప్రశ్న. వాల్మీకి రామాయణంలో సీతారామకల్యాణం చైత్ర శుక్ల నవమి రోజు జరిగినట్లు లేదు. బాలకాండలో 'ఉత్తరఫల్గుణి' నక్షత్రంలో జరిగినట్లుంది. అయితే లోకాచారంలో చైత్రశుక్ల నవమినాడు కల్యాణం చేయాలని మహర్షులు నిర్ణయించారు. రాముడు లేని సీతను, సీతలేని రాముడిని పూజించడానికి వీలులేదు. కలిపి పూజించాలనేది నియమం. కనుకనే శ్రీరామనవమి రాముని పుట్టినరోజు అయినప్పటికీ ఇరువురిని కలిపి పూజించాలని కల్యాణం చేసి పూజించే సంప్రదాయం ఏర్పడింది. ఇది సీతారాములకు మాత్రమే ప్రత్యేకం.

**6. సీతారాముల దాంపత్యం ఆదర్శవంతమైనది కాదు. ఎందుకంటే వారిద్దరు విడిపోయారు.**

**సమాధానం:** చాలా తప్పు. సీతారాములు ఎప్పుడూ విడిపోలేదు. కల్యాణం అయిన తర్వాత 12 సం.లు అయోధ్యలో కలసి ఉన్నారు. ఆ తర్వాత అరణ్యవాసంలో 13 సం.లు కలిసే ఉన్నారు. 13వ సం.రం చివర సీతను రావణుడు అపహరించాడు. లంకలో సీత ఉంది 11 నెలలు. ఆ తర్వాత అవతార సమాప్తిలో సీతమ్మ ముందుగా అవతారం చాలించడానికి అరణ్యానికి వెళ్ళి, తాను లక్ష్మి కనుక వైకుంఠానికి ముందు చేరింది. అందువల్ల 11 వేల సం.రాల సుదీర్ఘకాలంలో సీతారాములు కలసి ఉన్న కాలమే ఎక్కువ. కనుక సీతారాములు ఎప్పుడూ దూరంగా ఒకరిని విడిచి ఒకరు ఉండలేదు. ఒకరి మనస్సు ఒకరికి సమర్పించుకున్నారు కనుక సీతారాములే ఈనాటి సమాజానికి ఆదర్శదంపతులు.



"మన అనాదిమతానికి అస్థిభారం వేదాలు. అవి భగవన్నిశ్వాసాలని మన నమ్మకం. 'వేదోఖిలో ధర్మమూలం' అని మనుమహర్షి చెప్పుతున్నాడు...

అందుచేత ఏ సందర్భంలోగానీ, మనం వేదాలను మరచిపోరాదు...

వేదవిజ్ఞాన వ్యాప్తికోసమే ఇతిహాసపురాణాల ఉద్దేశం. 'ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్', ఈ ఉద్దేశంతోనే వ్యాసులు సత్యవాక్యపరిపాలన, ధర్మాచరణ చేసి ఐహికాముష్మికఫలాలను నరుడు ఎట్లు పొందగలుగుతాడో భారత-ఇతిహాస మూలంగా వ్యక్తపరిచినారు...

మహాభారతమనే నిక్షేపంలో భగవద్గీత ఒక అమూల్యమైన రత్నం...

వేదవిభజన, మహాభారతరచన అందులో గీతోపదేశం, భాగవతపురాణ సృష్టి, బ్రహ్మసూత్రాలూ చేసి భగవానులు వేదవ్యాసమహర్షులు మనలను వారి ఋణంలో ఎల్లకాలమూ ఉండేటట్లు చేశారు. ఆయన వాఙ్మయసృష్టిలో ప్రతివానికిన్నీ ఏదో ఒకటి లాభించక తప్పదు. ఉపాసనామార్గములలో ఆయన విడిచిపెట్టింది ఏదీ లేదు..."

**(మన ఆర్షవిజ్ఞానం గురించి శ్రీ కంచి కామకోటి జగద్గురు పరమపూజ్య శ్రీశ్రీశ్రీ చంద్రశేఖరేంద్రసరస్వతీ శంకరాచార్య స్వామివారు...)**





# దివ్యస్మృతి

మా తల్లిదండ్రులు శ్రీమతి బుద్ధవరపు లలితాకుమారిదేవి (1927-2004), శ్రీ బుద్ధవరపు సాంబసదాశివరావు (1920-1982)ల సంస్మరణగా ప్రచురించిన ఈ పుస్తకం అత్యంతవిలువైన మన ఆర్ష విజ్ఞాన సంపదను అభిమానించే వారందరికి కరదీపిక కావాలన్నది మా సంకల్పం. ప్రస్తుత యాంత్రికయుగంలో, ఆధునికభావాల పేరిట భారతీయ సంస్కృతి, విలువల పట్ల ఆట్టే దృష్టి పెట్టడానికి తీరికలేనివారికి సైతం మన ఆర్ష విజ్ఞానం అందించిన అపార సంపదసారాన్ని సంగ్రహంగానైనా అందుబాటులోకి తెచ్చి, సులభంగా గ్రహించడానికి చేసిన ప్రయత్నం ఇది. వేద ఉపనిషత్ ఇతిహాస పురాణసంగ్రహంగా వెలువరించిన ఆర్ష విజ్ఞాన కరదీపికను తెలుగు పాఠకులు ఆదరిస్తారని ఆశిస్తూ...

**బుద్ధవరపు శివరామకృష్ణ**
(సహజ పబ్లికేషన్స్ తరపున)